ప్రతులు —1500

మూల్యము :—

ప్రాప్తిస్థానము :—

కార్యనిర్వహణాధికారి,
సింహాచలం దేవస్థానం,
సింహాచలం, విశాఖపట్నం
530 028.

విభవ, ఆషాఢ శుక్ల ద్వాదశి.
(26—7—1988)

ముద్రణ :—

జీయర్ ప్రింటింగ్ ప్రెస్
శ్రీనివాసనగర్
ప్రహ్లాదపురం (B.O.)
విశాఖ—530 027.

శ్రీః

# సింహాగిరి వచనములు

కృష్ణమాచార్య ప్రణీతము





శ్రీ సింహాచల దేవస్థానము వారిచె
ప్రకటితము

# విషయ సూచిక

జి. వి. నరసింహమూర్తి, బి.ఎస్సి; బి.యల్;
డెప్యూటీ కమీషనరు, కార్యనిర్వహణాధికారి,
శ్రీ సింహాచల దేవస్థానం,
సింహాచలం, విశాఖపట్నం—530 028.

# నివేదనము

చాతుర్లక్ష గ్రంథ సంకీర్తన వాక్పూజలతో శ్రీ సింహాద్రినాథుణ్ణి మెప్పించి, ప్రత్యక్షంకావించుకొని, తనపాటకు ఆ స్వామిచే నాట్యమాడించిన మహాభక్తశిఖామణి, ప్రథమాంధ్రవచనకవితాచార్యుడు, 'పదకొండో అవతారంగా' ఖ్యాతిగాంచిన మహానుభావుడు, కృష్ణమాచార్యులవారి "సింహగిరి వచనాల"ను నేటికి దేవస్థానం తరపున తెనుగువారికి సమర్పించ గలుగుతున్నందుకు ఎంతగానో సంతోషిస్తున్నాను.

చందనంలోవాడి సన్నిధిని జరిగే వైదిక-సారస్వత-సాంప్రదాయిక కార్యక్రమాలన్నిటిలోనూ నిర్వ్యాజంగా, నిరపేక్షంగా, కేవలకైంకర్య బుద్ధితో పాల్గొంటున్న ఆప్తమిత్రులు శ్రీమాన్ టి. పి. శ్రీరామచంద్రాచార్య, ఎం.ఏ; (మిసెస్ ఏ.వీ.ఎన్. కళాశాల—ఆంధ్ర విభాగాధ్యక్షులు)గారు ఈ గ్రంథప్రకటనంలోనూ యథాపూర్వంగా తమసహకారాన్ని సమగ్రంగా, సమర్థంగా అందించేరు.

మహత్తరమైన ఈ గ్రంథానికి బృహత్తరమైన పీఠికను సమకూర్చడంతోపాటు ముద్రితవచనాలకు తాము సేకరించిన మరిన్ని వచనాలనూ చేర్చి పుష్టిన్నీ, మాకు తుష్టినీ సమకూర్చిన శ్రీమాన్ ఆచార్యులవారభినందనీయులు.

శ్రీసింహాద్రినాథుడు శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యులవారికి ఇతోధిక సేవాభాగ్యాన్ని ప్రసాదించాలని, తెలుగునాట భక్తులు, పండితులు సర్వులూ ఈ వచనాలను మంచి మనసుతో స్వీకరించాలనీ కోరుచున్నాను.

జి. వి. నరసింహమూర్తి.

# హరిచందనం

ఆంధ్ర వచన వాఙ్మయ ప్రథమాచార్యుడూ శ్రీ కృష్ణమాచార్యులను గూర్చి, చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనలైన అతని సింహగిరి నరహరివచనాలను గూర్చి ముచ్చటించే ముందు అతని వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసిన శ్రీమద్రామానుజుల శ్రీవైష్ణవ సిద్ధాంత దృక్పథం గురించీ, కృష్ణమాచార్య వాఙ్మయ జీవలక్షణమైన శ్రీవైష్ణవ సంప్రదాయ రహస్యాన్ని గురించీ ఇక్కడ పూర్వరంగ భూమికగా ప్రస్తావించటం అవశ్యకం.

## - పూర్వరంగ భూమిక -

నేడు ఖండాంతరాలవారు భారత భూమిని పూతభూమిగా, తత్వవిచారజన్మభూమిగా భావించి అట్టిది తమ జన్మభూమి గానందుకు విచారించినట్లే, నాకుదేవతలు సైతం భారతజనిని స్పృహణీయంగా భావించేరు.

" గాయంతి దేవాః కిలగీతకాని
ధన్యాస్తుయే భారత భూమిభాగే,
స్వర్గాపవర్గాస్పదమార్గ భూతే
భవంతి భూయః పురుషాస్సురత్వాత్ "

## దక్షిణ దిక్కు సర్వోత్తర

భారత మంతా ఇట్లా పవిత్రమూ దివ్యస్పృహణీయమూకాగా భక్తాగ్రగణ్యులైన ఆళ్వారుల అవతారంతో దక్షిణం విశేషించి పూతతమం అయింది. " దిగ్దక్షిణాపి పరిపక్త్రిమ పుణ్యలభ్యాత్సర్వోత్తరాభవతి దేవి తవావతారాత్ " అని శ్రీమన్నిగమాంతదేశికులవారన్నట్లు గోదాదేవి ఆవిర్భావంతో దక్షిణ దిక్కే సర్వోత్తర అయింది.

## ఆళ్వారులు - వైష్ణవం

అధునికుల దృష్టిలో దాక్షిణాత్య శ్రీవైష్ణవ భక్తివాఙ్మయ చరిత్రలో క్రీ॥శ॥ మూడవ శతాబ్దినుంచి ఎనిమిదవ శతాబ్దం వరకు ఒక స్వర్ణయుగం. భక్తిసార భట్టనాథ ప్రభృతులైన ఆళ్వారులతో పాటు అనన్యభక్తితో అరవిందాక్షుణ్ణి అర్చించి ఆత్మసమర్పణం చేసుకొన్న ఆండాళ్ అవతరించడంతో ఈ కాలపు చరిత్ర సంపుటం చాంపేయసుమ పరిమళ సంభరితమైంది.

పరాంకుశభక్తిసార భట్టనాథ ప్రభృతులైన భక్తచూడామణుల మందిర ప్రాంగణాల్లో గుబాళించే భక్తిపారిజాత పరిమళాల ప్రభావంవల్లనో, శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీసమ్మిశ్రితాలై నాడంతటా ప్రసరించే కావేరీతరంగ స్పర్శశీతలాలైన శ్రీవైష్ణవ సంప్రదాయ పవనాంకురాల సుఖస్పర్శంవల్లనో, ప్రబుద్ధమై, ప్రవృద్ధమై, వైష్ణవ పారమ్యప్రతిష్ఠాపన ప్రవణమైన విశిష్టాద్వైత సిద్ధాంతం ఉత్తరాశయందు కూడాదాక్షిణ్యం వహించి పరమాత్మలాగ సర్వవ్యాపి అయింది.

## ఆళ్వారులు - ఆచార్యులు

భక్తిభూమికా సుప్రతిష్ఠిత మైన ఈ శ్రీవైష్ణవ సంప్రదాయానికి ప్రవర్తకులు 'ఆళ్వారులు.; ప్రచారకులు. ఆచార్యులు. ఆళ్వారులు పన్నిద్దరూ భక్తిపార వశ్యంతో తమిళంలో పాశురాలుపాడి వకుళామోదవాసితాలైన భక్తివాసనల్ని దాక్షిణాత్యులహృదయాంతరాళాల్లో చిరస్థాయిగా ప్రసరింప చేసేరు. ఆళ్వారులు నాటిన భక్తివల్లరులకు పాదుగా, పందిరిగా సిద్ధాంతాను ష్ఠానాలను ఏర్పరిచి తత్పరిరక్షణం కోసం పాటు పడ్డవారు ఆచార్యులు.

## ద్రావిడ వేదవ్యాసులు

వీరిలో అన్నివిధాలా ముందు పేర్కొదగ్గవారు నాథమునులు. వీరు అస్తవ్యస్తంగా ఉన్న ఆళ్వారుల పాశురాలను సంపాదించి, సంకలనంచేసి, ఒక వ్యవస్థతో-ఒక వింగడింపులో, ' నాలాయిర దివ్యప్రబంధం ' గారూ- పొందించి "ద్రావిడ వేదవ్యాసులై"నవారు, వీరి పౌత్రులుయామును నాచార్యుల వారు. శ్రీవైష్ణవ దర్శనానికి సిద్ధాంత పరమైన ప్రతిష్ఠాభూమిక సమకూర్చి నవారు వీరు. యామునమును లకెన్నోశతాబ్దాలకు ముందే ఉత్తరాన్న సంకర్షణ వాసుదేవారాధకులుండేవారనీ, వార్ని సాత్వతులు, • భాగవతులు అని వ్యవహరించేవారనీ చారిత్రకులకథనం.

## భాగవతమతం

వైదిక "కర్మకాండ" మీద, తద్విధానాలమీద, వర్ణవ్యవస్థమీద ఒక రకమైన తిరుగుబాటు చేసిన వారువీరు. వీరిసంప్రదాయ భూమికకేవల భక్తి. ఇది రానురాను "వర్ణవ్యవస్థను" పాటించే సాంప్రదాయికుల్ని ఆకర్షించింది.

ఇట్లా యీ సాంప్రదాయికులూ ఇందులో ప్రవేశించటంతో దీనికి సంఖ్యాబలం తోపాటు సిద్ధాంతాల్లో అనేకాలైన కలగలుపులూ ఏర్పడ్డాయి. ఈ సమ్మిశ్రణంలోనే సిద్ధాంత, పూజావిధాన ప్రతిపాదకంగా ' పాంచరాత్రం ' ఆవిర్భవించింది ఈ విధంగా సాత్వత భాగవత-పాంచరాత్ర శబ్దాలు వైష్ణవ పర్యాయాలుగా, తత్సంప్రదా యానుయాయివర్గవాచకాలుగా ఏర్పడ్డాయి.

## భాగవతం - వైదికీకరణం.

వర్ణవ్యవస్థమీదా, కర్మకాండ మీదా తిరుగుబాటు చేసి సాంఘిక సూత్రాలు ప్రధానంగా ఏర్పడ్డ జైన బౌద్ధమతాలవారు ప్రజల్లోకి చొచ్చుకపోయి, విపరీతంగా తమతమ ప్రచారం చేసుకొంటున్న ఆరోజుల్లో, వాళ్ళని ఎదిరించటానికి కఠోరనియమాలతోడి కార్మకాండల్తో కూడిన పూర్వమీమాంసకాని, కేవలం మేధాశక్తితో గారడీలు చేయించే "అద్వైతం"కాని అక్కరకు, రాలేదు. ప్రజాసామాన్యాన్ని నిలవరించి తమ వేపు తిప్పుకోవటానికి ప్రజాసామాన్యంలోనే ప్రచారంలోఉన్న సాత్వత-భాగవతమతాన్ని పాంచరాత్ర సిద్ధాంతాన్ని తామూ అంగీకరించి అందులో ప్రవేశించి తద్వారా అవైదికాలైన జైన బౌద్ధాల ప్రవాహవేగాన్ని అడ్డుకొన్నారు వైదికులు. ఇట్లా విప్లవకరమైన సాత్వత భాగవతమతం శ్రీ వైష్ణవమూ వైదికమూ కూడా అయింది. కాని వైదికుల్లో వీరిమీద కన్నెఱ్ఱ పోనేలేదు. అవసరానికి వీరితో చేతులు కలిపినా తమ ఆభిజాత్యం అడుగడుగునా వీరికి గుర్తు వస్తూనేఉంది. దీనితో ఇందులోనే ఉండి. దీన్ని తమకు అనుకూలంగా వాస్తవానికి దూరంకాకుండా మలచుకొనేవారు కొందరూ, విడిపోయీ, దూరంగానే ఉండే, దీన్ని విమర్శించే వారు కొందరూ తయారయేరు. శ్రీ శంకరాచార్యుల వారి నాటికి ఈ విమర్శపాంచరాత్ర ప్రామాణ్యాన్ని శంకించేవరకూ వచ్చింది. ఈ పరిస్థితుల్లో భగవద్యామునమునులు అటుసాత్వత భాగవతుల్ని, ఇటువైదిక బ్రాహ్మణుల్ని శ్రీ వైష్ణవసాధారణీకరణంతో ఏకంచేసి పాంచరాత్రాగమప్రామాణ్యపరిరక్షణంకోసం పాటు పడ్డారు. పాంచరాత్రాగమానికి ఇతర తంత్రవైలక్షణ్యాన్ని వైదిక తనీ ప్రతిష్ఠాపించి శ్రీవైష్ణవ "విశిష్టాద్వైత" (సంప్రదాయ,) సిద్ధాంత పూర్వరంగ భూమికను ఏర్పరిచేరాయన.

# శ్రీమద్రామానుజులు - సిద్ధాంత పూర్వరంగం

ఆ తరవాత ఆళ్వారుల భక్తిప్రపత్తులు అంతస్సారాలుగా బ్రహ్మ సూత్రాలు శరీరంగా పాంచరాత్ర సిద్ధాంత పీఠికమీద విశిష్టాద్వైత సిద్ధాంత మూర్తిని రూపొందించిన వారు శ్రీమద్రామానుజులు. ఉత్తరాన సంస్కారులూ విప్లావకులూ అయిన సాత్వత భాగవతులకు వారసులీదక్షిణాన ఆవతరించిన ఆళ్వారులు. అటుసాత్వత భాగవతులలోని సంస్కారదృష్టినీ, విప్లావక బుద్ధినీ, భక్తినీ, భావావేశాన్నీ ఆరాధనాతత్త్వాన్నీ ఆకళించుకొన్నారు. శ్రీమద్రామానుజులు. అట్లాగే ఇటు ఆళ్వారుల్లో ఉన్నఆర్తినీ, శ్రీమన్నా యణ పారమ్యాన్నీ భక్తిమాధుర్యాన్నీ సమతాదృష్టినీ సౌందర్యభావనసనూ సమాలోకనం చేసిన వారూను శ్రీమద్రామానుజులు. తమ కనులముందే ఆవేశభక్తితో, వర్ణవ్యవస్థమీద, వైదిక సంప్రదాయాల మీద తిరుగు బాటుతో బసవన్న వీరశైవ ప్రచారంలో జనసామాన్యం ఉద్ధూతలూగటం చూస్తున్న వారాయన. జైన బౌద్ధాల ధాటికి తాళలేక మూలపడి మళ్ళీబూజులు దులుపు కొనికర్మకాండ యజ్ఞవాటికల్లో వేదికల్నలంక రించటం పరికిస్తున్నారా యన. ఇన్ని గందరగోళాల్లోనూ దృశ్యమాన ప్రపంచమంతా మిథ్యేఅంటూ చివరకు గురు శిష్యసత్తా "మిథ్యాత్వాన్ని సిద్ధాంత మిథ్యాత్వాన్నికూడా ప్రతిభాసింప చేసి"అకర్మణ్యత్వాన్ని పలాయనశీలాన్నీ ప్రబోధించే అద్వైత ధోరణుల్నీ ఆయన అత్యంత శ్రద్ధతో పరిశీలిస్తూనే ఉన్నారు. ఇన్నిటిని అనుశీలించి చూస్తే మేధకూ–హృదయానికీ,; జ్ఞానానికీ–భక్తికీ; సంప్రదాయానికీ–సంస్కా రణకూ; వర్ణవ్యవస్థకూ–సమతా సౌభ్రాత్రాలకూ; అసత్యానికీ–సత్యానికీ; బ్రహ్మాండమైన సంఘర్షణఆయనకు గోచరించింది. వీటిసన్నింటినీ అవి రోధంగా ఏకముఖంగా సమన్వయ పరిచే సిద్ధాంతం ఒకటి ప్రతిపాదించాలనే సంకల్పం ఆయనలో కలిగింది. ఇక్కడే శ్రీమద్రామానుజుల మహోన్నత వ్యక్తిత్వం మనకు గోచరిస్తుంది. ఈ మహత్తమ కార్యభారాన్ని నిర్వహిం చేందుకు తమజీవిత సర్వస్వం ఆయనత్యాగం చేశారు. ఇందులో ఆయన కృషిద్వివిధావిభక్తం. ఒకటి ప్రచారాత్మకం, రెండోది నిర్మాణాత్మకం.

# వర్ణవ్యవస్థ - సమతావాదం

వర్ణ వ్యవస్థ-దొంతరల్లో అడుగున పడి అణగి పోతున్న వార్ని, మేధతోజ్ఞానంతో ప్రమేయంలేకుండా కేవలం సవాసనులైన వార్ని ఆర్తి, సౌందర్యదృష్టి అతిశయంగా కలవార్ని, ఆకర్షించి వార్ని ఏకముఖం చేసేందుకు ఆయన ఆళ్వారులు పాడిన "దివ్యప్రబంధ" వాఙ్మయాన్ని చేపట్టేరు. దివ్య ప్రబంధాను సంధానంతో వారిలో సాధారణీకరణాన్ని సాధింపదలచుకొన్నా రాయన. ఆరోజుల్లో సంపూర్ణంగా వర్ణ వ్యవస్థ మీద తిరుగుబాటు చేసి వైదిక చిహ్నాలైన యజ్ఞోపవీతాదుల్ని పరిత్యజించిన వీరశైవులుసైతం వైదికమతానుయాయుల్ని పరాజితుల్ని చేసేందుకు బ్రహ్మసూత్రాల నాశ్రయించి స్వమతానుగుణంగా వాటికి భాష్యం సంతరించుకొన్నారు. అయితే ఇందుకు విలక్షణంగా శ్రీమద్రామానుజులు వైదిక మార్గవర్తను లైన అగ్రవర్ణాలవార్ని సవ్యమార్గంలో నడిపించేందుకు వాస్తవాన్నే శ్రుత్యంతరంగాన్నే సుందరంగా విశదపరిచేందుకు బ్రహ్మసూత్రాలకు తామూ శ్రీభాష్యం సమకూర్చేరు. వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తూనే వర్ణ వ్యవస్థను పాటిస్తూనే పరస్పర సౌభ్రాత్రంతో సమానత్వం సాధించ వచ్చుననే సమన్వయ వాది ఆయన. వర్ణ వ్యవస్థను పాటించటమంటే హెచ్చుతగ్గులు ప్రదర్శించు కుంటూ, పరస్పరం దెబ్బలు తీసుకుంటూ లేదా బక్కవాళ్ళను, చిక్కినవాళ్ళను చావుదెబ్బలు తీస్తూ, చివరకు తామే అయిన సమాజాన్ని కుళ్ళబెట్టుకొనే కుత్సిత విధానాలనవలంబించటం కాదు. తత్తద్వర్ణాల వారు అన్యోన్యా విరోధంగా దేశకాలోచిత ధర్మ నిర్వహణం చేసుకొంటూ శ్రీవైష్ణవ సాధా రణీకరణంతో మానవ-త్వోపాధికమైన ఏకజాతిగా రూపొందాలనే ఆయనకాంక్ష

## శ్రీమద్రామానుజులు - సమన్వయవాది

వేద విజ్ఞానాన్ని, దానికి వారసులైన వార్ని వదిలేసి అవైదికులేమో అని కొందరానాడు భావిస్తున్న కేవల భాగవతులలో కలిసి పోవటం ఆయన అభీష్టంకాదు. అట్లాఅని భాగవత సంప్రదాయాన్ని దూరంచేసుకోవటమూ ఆయనకు ఇష్టంకాలేదు. రెండు వర్గాల వార్ని ఏకముఖంగా నడిపించటమే ఆయనలక్ష్యం ఈ కలయికని సాంప్రదాయికులు అక్ష్యరాలా నమ్మతించక

పోవచ్చు. అంచేతే ఆయన సమాంతరాలుగాకాకుండా సన్నియోగ విశిష్టాలుగా. సన్నిహితాలుగా ఉభయ వేదాంతశాఖల్ని ప్రచారంలో ఏర్పరిచేరు. ఫలితంగా ద్రావిడ వేదాంతశాఖాధ్యాయి అబ్రాహ్మణుడు సంస్కృత వేద విజ్ఞాన వంచితుడుకాడు. అట్లాగే ద్రావిడ వేదాధ్యయనం చేసిన సంస్కృత “వేదాంతి-బ్రాహ్మణుడు” కేవల మేధావిగా మడిగట్టుక కూచోక హృదయ స్పందనంతో, వైష్ణవసాధారణీకరణంతో, ఇతరవర్ణాలపట్ల హార్దమైన సౌభ్రాత్రంతో సమన్వయ దృష్టితో సంచరిస్తారు. ఈసాన్నిహిత్యానైరంతర్యంవల్ల ఇరుతెగలకూ “విశిష్టాద్వైతం” సిద్ధించటం విశేషం. ఇంతగడుసుదనపు ఎత్తుగడతో ఆయిన ఉభయవేదాంత ప్రతిష్ఠాపనాచార్యులైనారు అటు దివ్య ప్రబంధానుసంధానం ప్రచారంచేసి ఆళ్వారుల భక్తిమాధురీ మధుప్రపంతు లలో సహృదయ సామాన్య ప్రజల్నితలమున్కలుచేసి తమవైపు ఆకట్టుకొన్నారు. ఇటు మహామేధావుల్ని, కర్మిష్ఠుల్ని, అగ్రవర్ణాలవార్ని, కర్కశతర్కవాదాలతో కటకటపడుతున్నవార్ని, తమ శ్రీభాష్యసిద్ధాంతప్రతిపాదనంతో తమవేపు తిప్పుకొన్నారు ఒక వర్గంవారు భాగవతుల వారసులు. ఇంకో వర్గంవారు కేవలవైదికులకు వారసులు. ఇటీ భాగవతయమునసీ అటూవైదిక గంగనీ సరస్వతీ స్వరూపులాయిన తనలోమేళనంచేసి తన దివ్యతేజస్సు అంతర్వాహినిగా ఈ సంస్కృతి అంతా భిన్నభిన్నరూపాలుగా కాక త్రివేణీ (సమాహార) రూపంగానే భారతం అంతా ప్రవహించి పునీతంచెయ్యాలని సంకల్పించేరు. ఇది అమలులోకి వచ్చి ప్రచారంసాగితే భిన్నవర్ణాల వారు ఏకోన్ముఖంగా ప్రయాణంచేసి సమభావం సౌభ్రాత్రం కలిగి శ్రీవైష్ణవ సాధారణీకరణంతో ఏకజాతిగా రూపొంది భారతావనిని స్వర్గసీమ చేస్తారని భావించేరాయన. ఈ దృష్టితోనే ఆయన ఉభయవేదాంతశాఖల్ని ఏర్పాటుచేసి తత్ప్రచారానికి “పీఠాలను” నెలకొల్పి “పరంపర”లనేర్పాటుచేసి సుస్థిరమూ సుదృఢమూ అయిన వ్యవస్థనూ ప్రణాళికనూ రూపొందించి లోకోపకారకులయేరు.

ప్రాంతీయ భాషల్ని మత ప్రచారంలో ఆదరించటం తమిళ భాషామయమైన దివ్యప్రబంధాన్ని ‘వేదం’గా పరిగణించటం, దాక్షిణాత్య సంప్రదాయ సిద్ధాంతాలైన శ్రీవైష్ణవాలయాలలో అందరకూ తీర్థ-ప్రసాద స్వీకార యోగ్యతను పరికల్పించటం,

హరిజను లను మొదట 'మనసారా' ఆదరించి భగవత్ సేవావకా శాన్ని ప్రసాదించటం,

వర్ణవ్యవస్థకు అతీతంగా, వివిధ వర్ణాలకు చెందిన ' ఆళ్వారులకు ' 'అతిమానవ'-కాదు " దివ్యత్వ "ప్రతిపత్తి కల్పించి ఆలయాలలో వారికి 'పూజాపురస్కారాలు' పరికల్పించి (అట్లాంటి 'దివ్యసూరులు' వేంచేయని ఆలయాన్ని దివ్యస్థలంగా పరిగణించక, అచట తీర్థప్రసాదాలు స్వీకరించరు శిష్టులునేటికీ. అట్లాంటివాటికి 'ప్రాకృత' స్థలాలనే వ్యవహారం)తీర్థప్రసాద స్వీకార యోగ్యత సర్వులకూ సంతరించటం,

మానవులంతా హృదయం ఉంచేచాలు. సోదర్యసంభావనం చేయ గల వారైతే చాలు లింగ, వర్ణ విభేదంతో ప్రమేయంలేకుండా భారతీయ-ఆధ్యాత్మిక సంపదనుభవానికి వారసులని చెప్పటం, ఇట్లాంటి సంస్కారణ లెన్నో వారి సమతాదర్శనానికి. సౌందర్యభావనానికి తార్కాణలుగా నేటికీ నిలుస్తాయి, దీని పర్యవసానమే ఇటు మన కృష్ణమాచార్యులవారు అటు వాళ్ళవాకవారూ శ్రుతిసమ్మితాలుగా, బహు శ్రుతి సమ్మతాలుగా, బహు శ్రుత మతాలుగా తెలుగు నాట తెలుగు లో వేదాలు పాడటం.

## శ్రీమద్రామానుజులు - కళింగాంధ్రం

ఇట్లాంటి వక్తిత్వమూ అంతరంగమూకల శ్రీమద్రామానుజులు ఆసే తుశీతాచలమూ పర్యటించి తమ సిద్ధాంతం ప్రచారం చేస్తున్నసమయంలో అన్ని ప్రాంతాలతోపాటు ఆంధ్రావనీ ఆయన ఆశయాలను ఆదరంతో స్వీక రించింది. ఎందరో పూర్వభాగవత వైష్ణవ కుటుంబాలవారూ అద్వైతాదీతర మతాలవారూ కూడా ఆయన సిద్ధాంత ప్రతిపాదనల్ని శిరసావహించి నూతనోత్సాహంతో శ్రీవైష్ణవులైనారు. ఆయన ఆంధ్రదేశ పర్యటనలో శ్రీకూర్మసింహాచలాలు విశిష్టఘట్టాలు. కళింగాంధ్రం అంతా ఆయనకు కైమోడ్పులు ఘటించింది. ఇట్లాంటి పరిస్థితుల్లో శ్రీమద్రామానుజుల నిర్యాణానికి సరిగ్గా వంద సంవత్సరాలనాడు మన ప్రథమాంధ్రవచన కవితాచార్యులు కృష్ణమాచార్యులు అవతరించేరు. పైపూర్వరంగపీఠికలో నిరూపింపబడ్డ శ్రీమద్రామానుజుల వ్యక్తిత్వమూ, ఆశయాలూ కృష్ణమాచార్యులుగా తెలుగు

నాట అవతరించేయనటం అతిశయోక్తి కాదు అవినయమూకాదు. అందుకే కృష్ణమాచార్యుల వ్యక్తిత్వం తదవతార పూర్వరంగం అర్థం కావటంకోసమే సుదీర్ఘమయిన ఇంత ఉపోద్ఘాతం ఉపక్రమించక తప్పలేదు.

తెలుగు కవి అంటే చాలు అతని దేశకాలాల విషయంలో పెద్దగా లిదుమారంచెలరేగుతుంది. కృష్ణమాచార్యులకూ ఈ "గాలి"సోకక తప్పలేదు.

## కృష్ణమాచార్యుల్ని గురించి కృషి చేసినవారు

కృష్ణ మాచార్యులను గూర్చి ఆధునికుల్లో బహుశః మొట్టమొదట ప్రస్తావించినఘనత శ్రీనిడుదవోలు వెంకటరావు గారిది. తరువాత శ్రీతిమ్మావఝ్ఝల కోనందరామయ్యగారూ, శ్రీవేటూరి ఆనందమూర్తిగారు పరిచయ వ్యాసాలు వ్రాసినట్లున్నారు. ఆ తరువాత శ్రీఆరుద్రగారు తమ సమగ్ర ఆంధ్రసాహిత్య చరిత్ర పద్మనాయకయుగం-సంపుటంలో కృష్ణమాచార్యుల్ని గురించిక్లుప్తంగా ముచ్చటించేరు. చివరగా ఆంధ్రరచయితల సంఘంపక్షాన డా॥ కులశేఖరరావుగారు "సింహగిరి వచనములు" అనేపేర కృష్ణమాచార్యుల వచనాల్ని కొన్నిటిని సేకరించి ప్రకటించి తెనుగు జాతికృతజ్ఞతకు పాత్రులైనారు. 1964లో అనుకొంటాను నేనూ పూజ్యులు డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారూ కలిసి ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఉన్న కృష్ణమాచార్య వచనాలను సంస్కరించి ప్రకటించాలన్న ఊహకు వచ్చేం. కడమవచనాల కోసం, కాలదేశాల కోసం కొంత ప్రయత్నించీ, వ్యక్తిగతాలైన ఇబ్బందుల వల్ల మా ఊహ ఊహగానే ఉండిపోయింది. ఇంతలో 1968 లో డా॥ కులశేఖరరావుగారి 'సింహగిరి వచనములు' వెలుగులోకి వచ్చేయి ఈ ఉద్యమంతో సంబంధం గలవాడుగా, విశేషించివ్యక్తిగతంగా డా॥కులశేఖరరావు గారికి కృతజ్ఞతాభివందనాల ర్పిస్తున్నాను. డా॥ రావుగారు గ్రంథారంభంలో ఉపోద్ఘాతం సంతరించి కృష్ణమాచార్యుల జీవితవిశేషాలుకొన్ని తెలియ చేసేరు

ప్రథమాంధ్ర వచనకావ్యనిర్మాత కృష్ణమాచార్యుల్ని గురించి పైలైన న్నియథార్థాలూ, ఔచితీసహాలూ అయిన విషయాలు సవిమర్శంగా ఆంధ్ర ప్రజానీకంముందుంచి వారికి కృష్ణమాచార్యుల్ని గురించి "తొలితెలుగు వచనకవి"ని గురించి తెలియ జెప్పటమే నేనాశించిన ప్రయోజనం.

# కాలం

కృష్ణమాచార్యులు తమ వచనాల్లో 'వికృతి' సంవత్సరంలో తాము జన్మించినట్లు చెప్పకున్నారు. ఆయన ద్వితీయ ప్రతాపరుద్రుడివల్ల సమ్మానాలు పొందినట్లు 'ప్రతాప చరిత్ర సిద్ధేశ్వర చరిత్రలు, చెప్తూన్నందువల్ల ద్వితీయ ప్రతాపరుద్రుడి సమకాలంలో ఉండే వికృతిని ఆయన జన్మసంవత్సరంగా భావించటం ఉచితం అన్నదృష్టితో కావచ్చును, కీ॥శే॥ శ్రీనిడుదవోలు వెంకటరావుగారు కృష్ణమాచార్యుల జన్మను క్రీ॥శ॥ 1290 వికృతిగా నిర్ణయించేరు. కాని డా॥ కులశేఖరరావుగారు ప్రతాపరుద్రుడి పరిపాలనా కాలం 1295-1326 కనక 1290 ఆయన జన్మకాలం అయితే ప్రతాపరుద్రుడి నాటికి కృష్ణమాచార్యులు మరీచిన్న వయసులో ఉండవచ్చును అంచేత 1260-65 ఆయన జన్మకాలం అవటం బాగుంటుందని "మూజువాణీ" తీర్మానం ఒకటి ప్రతిపాదించేరు. వారు ప్రతిపాదించిన కాలంలో 'వికృతి' సంవత్సరం లేదు. దీన్నివారు పట్టించు కున్నట్టు కనబడదు. అయితే శ్రీ నిడుదవోలు వారి కాలాన్ని (1290) అంగీకరిస్తే శ్రీ కులశేఖరరావు గారి అభియోగం మాట ఏమిటన్న ప్రశ్నఅల్లాగే ఉంటుంది.

## అంతరంగసాక్ష్యం

దీనికి సమాధానం కృష్ణమాచార్యవాఙ్మయంలోని అంతరంగిక సాక్ష్యాలు, ఆయన కావ్యనిర్మాణ రంగస్థలం అయిన సింహాచలం, తాత్కాల చరిత్ర, ఆనాటి శ్రీవైష్ణవ సంప్రదాయ ధోరణి. ఇవన్నీ అనుశీలిస్తేకాని చెప్పటం కుదరదు. కృష్ణమాచార్యుల వేశ్యాలోలత్వం, శృంగార ప్రియత్వం ఆయన వచనాల వల్లనే తెలుస్తోంది. ఇదొకటి ఆయన జీవితంలో గమనించాల్సిన అంశం. అహోబలం నుంచి 'నారసింహుని నాట్యవినోదులు' 'పొతకమూరి భాగవతులు' సింహాచలం వచ్చి కృష్ణమాచార్యులను దర్శించుకొంటారు. అప్పటికి 'చాతుర్లక్ష' గ్రంథంలో లక్షాఏబదివేలు కొదవ కృష్ణమాచార్యులకు.'చాతుర్లక్ష'ఒకటి "యక్షప్రశ్న"లాగ విడవకుండా ఇంకా అల్లాగేఉంది. అది ఏమైనా వారు వచ్చేనాటికి కృష్ణమాచార్యులకు 40, 45 ఏళ్ళ

వయస్సైనా ఉండి ఉండాలి. ఆయన తన పదహారోయేట సరాభవ సంవత్సర ఆషాఢ-శుద్ధ, ద్వాదశినాడు సంకీర్తనం ప్రారంభించేరు. ప్రతాపచరిత్ర ప్రకారం కృష్ణమాచార్యులు చాతుర్లక్ష గ్రంథం రాగి రేకులమీద చెక్కించి వాట్ని బళ్ళకెత్తించి శ్రీరంగం తీసుకపోయేరు. ప్రతాపరుద్రుడి అవసానం 1323 కనక కనీసం 1320 లోగానైనాయీపని జరగాలి. శ్రీవెంకటరావు గారి ప్రకారం అప్పటికి ఈయన వయస్సు 30 ఏళ్ళు. ఆరోజుల్లో చాలా చిన్న వాడు. పదహారోయేట సంకీర్తనం ప్రారంభించినా కనీసం ఏభైఅరవై ఏళ్ళు స్వామిని అనవరతంగా కీర్తించి చాతుర్లక్షల మాట ఎలాగున్నా కొన్నివేల కీర్తనలో వచనాలో ఆయన కూర్చిఉంటారన్నది మాత్రం నిర్వివాదాంశం. పోతకమూరి భాగవతులతో ఆయన ప్రసంగించేటప్పుడు "కడమ $1\frac{1}{2}$ లక్షలూ ఎప్పటికవుతాయో" అనేదిగులుకూడా ఆయనలో కనబడుతుంది. దీన్నిబట్టి అది చాలా పెద్దప్రణాళికగా కనబడుతుంది. కాని ఏటికి ముప్పైవేల గ్రంథం ప్రణాళికలా తోచదు. ముప్పైయేళ్ళకే అది పూర్తయేలాగుంటే ఆయన అంత దిగులుగా "ఎన్నటికి పూర్తవుతుందా" అని ఆందోళన పడవలసిన అవసరమూ కనబడదు. పోతకమూరి భాగవతులు కృష్ణమాచార్యులను సందర్శించే నాటికి ఆయనకు కొడుకు పుట్టటం, ఏడేళ్ళుజీవించి ఆ శిశువు పరమ పదించటం కూడా జరిగింది. ఆరోజుల్లో అష్టవర్షకన్యకలకే వివాహం జరిగినా వరులుమాత్రం కనీసం త్రిదశులుగదా! అందునా కృష్ణమాచార్యులు తనవారంతా కాదంటే మఠంలో అనాథగా పెరిగి 'అనాథపతి' యైన సింహగిరి నరహరి కరుణవల్ల గొప్పవారయినవారు. ఈ గొప్పదనం ఒక రోజులో, ఒకయేడులో వచ్చేదిగాదు. 16 వ యేట సంకీర్తనం ప్రారంభించిన ఆయన కనీసం 10, 15 సంవత్సరాలు గడిస్తేకాని ఆమాత్రం పేరు ప్రతిష్ఠలు సంపాదించటం కాని, ఆయన మహత్వం కాస్త దేశవ్యాప్తం కావటం కాని జరిగేఅవకాశం ఉండదు. అంచేత రమారమి పాతిక ముప్పది సంవత్సరాల వయస్సులో మేనమామ కూతురితో ఆయనకు వివాహంజరిగి ఉండవచ్చు. వివాహంనాటికే ఆయన భక్తిపారవశ్యంలో తల మున్కలౌతూండటం అంత దంగా ప్రమాణసిద్ధం. వెంటనే పుత్రోదయం. ఏడేళ్ళు బ్రతికి ఆకొడుకు

పోవటం. 40 ఏళ్ళలోగా ఇది జరిగి ఉంటే-ఆ తరవాత 40, 45 మధ్య
పోతకమూరి భాగవతులు ఆయన్ను సందర్శించటం జరిగి ఉండవచ్చు ఇక
ఆయన వేశ్యాలోలత్వాన్ని గురించి. ఇందుకు ఆయనేసాక్షి. వివాహం అయి
భార్యకాపురానికి వచ్చేకే ఈయన ఈ వ్యామోహంలో పడ్డట్టుకనపడుతుంది.
ఆరోజుల్లో వేశ్యాలాంపట్యం అకార్యం, అవమాన్యం కాకపోగా మగటిమికి
లక్షణం. కాని ఒక్క-మాట, సమాజంలో ఏదోరకంగా అంతో ఇంతో వ్యక్తి
త్వం మహత్వం సంపాదించుకొన్న తరవాతనే ఇట్లాంటివి చెల్లుబాటుకు
వచ్చేవి. అంతేకాదురాణించేవిని. ఆనువంశికమూ పారంపరీణమూ అయిన
పెట్టుబడివల్ల కాక, కృష్ణమాచార్యులు స్వార్జితమైన కీర్తి ప్రతిష్ఠల పెట్టుబడి
తోనే సమాజంలో సామాన్యమానవుడుగా నిలబడగల గటమేకాదు సామ్రా
జ్యభోగాలనుభవించేస్థితికే వచ్చేరు. ఇంత స్థితికివచ్చేకనే వారేంచేసినా
లోకం ఆదర్శంగా ఆదరంగా చూస్తుంది. కృష్ణమాచార్యులకు ఈ స్థితికి
రావటానికి ఆయన మనిషయేక, అంటే 16 ఏళ్ళ తరవాత కనీసం రెండు
పదులేనా పట్టిఉండాలి, అంటే రమారమి 35 సంవత్సరాల వయస్సువచ్చి
ఉండి మంచినిండు జవ్వనంలో ఆచార్యులవారుండగా శృంగారవల్లభులయే
రన్నమాట. దీనికి సంవాదిగా సింహాచలం చరిత్ర కనబడు తోంది.

## శృంగారవాల్లభ్యం

ఆటపాటల్లో అందెలు వేయించుకున్న "దేవదాసీలు" దేవాలయాల్ని
సేవించటం భారతదేశంలో సార్వత్రికం సామాన్యమూను. సింహాచలంలో
1264 నుంచీ యీ సంప్రదాయం ప్రారంభం అయినట్లు శాసనాలు తెలుపు
తున్నాయి 1266 లో గాంగ ప్రథమనరసింహ చక్రవర్తి దేవాలయానికి
నూరుమంది పాటకత్తెలను సమకూర్చుటమేకాక తత్సంప్రదాయ నిర్వహణకు
ఒక వృత్తికూడా ప్రసాదించేడు వీరంతా సానులేకావచ్చునని చారిత్రకుల
ఊహ. ఈ సందర్భంలో కృష్ణమాచార్యుల " దేవవేశ్యాభుజంగా " అన్న
సింహగిరి నరహరి సంబోధన అనుసంధించు కోవటం ఎంతేనా అవసరం.
ఈ ప్రకరణంతో కలుపుకొని చూస్తేదాన్లో ఆశ్చర్యం అక్కరలేదు. వీరు
అందగత్తెలే కాక ఆట-పాటల్లోనూ ఆరి తేరినవారు. అప్పటికే కృష్ణమా
చార్యులు పదకర్తగా సంకీర్తనా చార్యులుగా, మహామహిమావి

తులైన భక్తశిఖామణిగా పేరుపడి సింహాచలంలో స్వామి సేవాతత్పరులుగా ఉన్నారు. స్వామివారి ఏకాంతసేవాసమయాల్లో చిందులు తొక్కుతూ, చిఱు తాళాలువాయిస్తూ, దండెమీటుతూ, వచనభావంతో సింహగిరి నాథుణ్ణి కీర్తిస్తూ, పరవశించిపోతున్న తరుణంలో వీరిలో మేలిసాని, నృత్యగాన విద్యా విశారద, "జగన్మోహనాంగి" 'పదునొకండవ అవతారుండైన' కృష్ణమాచార్యులపై మరులు గొనటం, లోకమూ తామూ తమను అవతారంగా భావించు కొంటున్న కళాహృదయులు కృష్ణమాచార్యుల వారు ఆ "కళావతురాలి" వలపు చిన్నెలకు పరవశించి విప్రనారాయణులవలె ఆమె పైన సంకావటం అబ్బురం ఏంకాదు. సుమారొక దశాబ్దం ఆమెతో గడిపిన తరవాతనే పోతకమూరి భాగవతులు ఆయనను సందర్శించి ఉంటారు. అంటే 1275 ప్రాంతంలో ఈసంఘటన జరిగి ఉండవచ్చును. ఈ నాటికి రమారమి 45 ఏళ్ళ వయస్సుగల కృష్ణమాచార్యులు క్రీ॥ శ॥ 1230 వికృతి సంవత్సరంలో జన్మించి ఉంటారని ఒక బలమైన ఊహ ప్రస్తుతానికి చెయ్యవచ్చును.

## సంకీర్తన సంప్రదాయం - శాసనప్రమాణం

పూర్ణపురుషాయుష ప్రమాణంగా ఆరోజుల పరిపాటి ననుసరించి, నూరేళ్ళు కాక పోయినా 80, 90 ఏళ్ళయినా కృష్ణమాచార్యులు జీవించి ఉండ వచ్చును. ఆయన సంకీర్తన సంప్రదాయం అగ్రవర్ణాల వారిలోకంటె, ఇతరుల్లోనే ముఖ్యంగా సానుల్లో ఆయనకు వారితో ఉండే సాన్నిహిత్యాన్ని బట్టీ, అందులో వారి కుండే సామర్థ్యాన్ని బట్టీ కొంతకాలం అయినా "నిలిచి ఉండా"లి క్రీ॥ శ॥ 1374 లో అంటే సుమారుగా కృష్ణమాచార్యుల పరమ పదానికి 50 సంవత్సరాల తరవాత సంకీర్తన సంప్రదాయ పరిరక్షణకు, అది సానులచే నిర్వహింప చేయటానికి వృత్తిని కల్పిస్తూ, సింహాచలంలో వేయించిన ధర్మశాసనం ఒకటి దీన్ని సమర్థిస్తోంది. ఇప్పటికీ సింహాచలంలో కృష్ణమాచార్య సంకీర్తనం అన్నది ఈ సంప్రదాయం గానే నిర్వహింపబడుతూండటం కూడా ఇందుకు ఉపష్టంభకం. 1280 కృష్ణమాచార్యజన్మ సంవత్సరం అయివుంటే 1374 లోనే ఇంచుమించు ఆయన

జీవితకాలంలోనే, ఆయన సంస్మరణమైనా లేకుండా, సంకీర్తన సంప్రదాయ పరిరక్షణం కోసం శాసనం పుట్టటం సంభావ్యంకాదు. అందుచేత ఈ శాసన బలాన్ని పట్టికూడా కృష్ణమాచార్యుల జన్మవర్షం క్రీ॥ శ॥ 1230 గా ప్రస్తుతానికి పరిగణిచంటంలో విప్రతిపత్తి ఉండకూడదు.

## ఆచార్యసూక్తిముక్తావళి - అంతరార్థం

ఇది యిలా గుండగా శ్రీ వైష్ణవ సంప్రదాయ చారిత్రక గంథం- "ఆచార్యసూక్తిముక్తావళి"లో కృష్ణమాచార్యులు శ్రీ మద్రామానుజులకు సమకాలికులుగా చిత్రింపబడ్డారు. ఇదే నిజమైతే ప్రథమాంధ్రకవి నన్నయ గారికి సద్యస్సమనంతరకాలికులౌతారు ప్రథమాంధ్ర వచనకవీని, కాని యీ ప్రతిపాదనం అంతరంగ బహిరంగ సాక్ష్యాలకు రెండింటికీ విరుద్ధంగానే కనబడుతోంది. చివరకు సిద్ధాంతం ఏమయినా కేవలం ప్రతాప చరిత్రబలంతో ఆచార్యసూక్తిముక్తావళి ప్రతిపాదనాన్ని త్రోసిరాజన్నవారు కొందరూ, అసలు అదొకటి ఉన్నదని కూడా తలవనివారు మరి కొందరూను మన విమర్శకులు. చారిత్రకంగా కృష్ణమాచార్యుల కాలనిర్ణయంలో ఆచార్య సూక్తిముక్తావళి అంగీకృత ప్రమాణంకాకపోయినా ఆయన జీవిత సత్యాలనీ సిద్ధాంతాలనీ నిరూపించేందుకు ఉపయోగపడుతుంది. ఇది విమర్శకులు గ్రహింపలేదు. సింహగిరి నరహరి వచనాల అంత స్సాక్ష్యాన్ని బట్టి ఆచార్య సూక్తిముక్తావళి విలువల్ని ఈ సందర్భంలో విమర్శించటం అవసరం. కృష్ణమాచార్య వాఙ్మయాన్ని పట్టి ఆయన శ్రీ మద్రామానుజుల పట్ల ఎల్ల ప్పుడూ అపారమైన భక్తి విశ్వాసాలు కలవారని తెలుస్తోంది. సింహగిరి నరహరితో పాటు యతిపతి రామానుజులు, కృష్ణకువ్వారు, రాఘువేశ్వరుడు వీరు ముగ్గురూ ఆయనకు దైవ సమానులు. ఈ భక్తి సర్వకాల సాధారణం. ఇట్లాంటి కృష్ణమాచార్యులు ఒకప్పుడూ రామానుజులను "వట్టిసన్యాసి" గా భావించరు. ఇక శ్రీమద్రామానుజులా ఆయన ఉదాత్తగంభీరులు. ప్రాణికోటి పట్ల ఆయన కరుణ అపారం గోష్ఠీ పురగోపురం మీదనిలిచి మంత్రార్థవితర ణం చెయ్యటం ఆయన ఔదార్యానికీ కరుణకూ తార్కాణం. అంతేకాదు ఆత్మోద్ధారణం కంటె పరోద్ధారణానికి ఆయన తపనకు పరమోదాహరణం.

ధనుర్దాసులాంటి ముష్కరులపై కృపాకటాక్షలహరీశీకరాలను చిందించిన కరుణాసింధువాయన. అట్లాంటి ఆ మహానుభావులు కేవలం ఆచార్యోపాధివహించి వచ్చేరన్న నెపంతో బుద్ధిచెప్పటానికి 'ఆయనతో మాకు పనిలేద' నేంత విరసులా! పొతకమూరి భాగవతుల సందర్శనానికి ముందు శ్రీమద్రామానుజులతో ఆచార్యులవారికి "భేటీ" జరిగితే తత్పర్యవసానంగానైనా ఆకథ అట్లానడవదు. పొతకమూరి వారి తరవాత శ్రీమద్రామానుజుల సందర్శనం అందామా అంటే ఆస్వాములన్నే "ఎంబెరుమానార్ల స్వరూపులు"గా భావించిన కృష్ణమాచార్యులు, వారి సందర్శనంతో పశ్చాత్తప్తులై జీవిత విధానాన్నే మార్చుకొన్న కృష్ణమాచార్యులు తమ సమక్షంలో తాముగా సాక్షాత్కరించిన ఎంబెరుమానార్ల పట్ల రాజసపై ఖరినెట్లా అవలంబిస్తారు? సింహగిరి నరహరి వచనాలు ఎప్పటికైనా బయటకు వస్తాయనే ఊహచాలక "అంధాభిజాత్యం"తో "వాది భీకరగురులు" కేశవాచార్యులకు ఈ "కథ" చెప్పేరేమో! ఇది కేవలం కృష్ణమాచార్యుల సంస్కరణ భావాలు, విప్లావక దృష్టికిట్టని అభిజాత్యసంపన్న కుటుంబాలవారు కల్పించిన కట్టుకథ తప్పమరేమీకాదు. ఈ కథ ఆచార్యసూక్తిముక్తావళిలో తప్పమరే శ్రీవైష్ణవ చారిత్రక గ్రంథం లోనూ లేకపోవటం కూడా ఈ ప్రకరణంలో గమనించాలి. బంధురభక్తి భావమహితులూ మహనీయ దివ్యభావ భరితులూ చాతుర్లక్ష గ్రంథ స్వరూపులూ, తెనుగు వేదద్రష్ట, సంకీర్తన వాఙ్మయస్రష్ట ఆర్తిగలవారూ, అందం చూడగల వారూ అయిన కృష్ణమాచార్యులు శ్రీ మద్రామానుజుల్ని సందర్శించిఉంటే తెలుగుదేశపు వైష్ణవ చరిత్ర తీరేవేరుగా ఉండి ఉండేది. భగవ-ద్యామునమునుల్ని శ్రీమద్రామానుజులు సందర్శించ లేనట్లే శ్రీమద్రామానుజుల్ని శ్రీ కృష్ణమాచార్యులు సందర్శించలేదేమో! ఈ కథకల్పించినవారు రామానుజ సమకాలికత్వంద్వారా కృష్ణమాచార్యులకు ఆంధ్ర వాఙ్మయంలోకాని శ్రీ వైష్ణవ సంప్రదాయంలోకాని ముందు పీటవెయ్యటం కోసంకాని, ఈ రూపంగా శ్రీ మద్రామానుజుల మహాత్మ్యాన్ని ప్రతిష్ఠాపించటం కోసం కాని పాటుపడ్డవారు కాదు. మరికేవలం శ్రీ వైష్ణవ సంప్రధాయంలో పట్టిన ఆచార్యవ్యవస్థా ప్రాముఖ్యాన్ని ప్రతిపాదించటం

కోసమూ తెలుగుదేశంలోని వైష్ణవుల పట్ల వారెంతటి మహత్వాతిశయం కలవారైనా చిన్నచూపుతోనూ కల్పించిన కట్టుకథ యిది. ఆచార్య సంప్రదాయం విషయంలో కృష్ణమాచార్యులు ఏ శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్యులకూ తీసిపోయేవారుకాదు. ఇది ఆయన వచనాలు చూచినవారికి తెలుస్తుంది. అంచేత ఆచార్య సూక్తిముక్తావళికథ ప్రామాణికంగా పరిగణింపబడే అవకాశం లేదు. అహోబిలంలోని నాట్యవినోదులైన పొతకమూరి భాగవతుల జాడ చారిత్రకంగా నిరూపింపబడేవఱకూ, కృష్ణమాచార్యులకు ప్రతాపరుద్రుడిచ్చేడనుకొంటున్న "ఏవైఉూళ్ళరాజకీయాధికార శాసనాలు" బయటపడేంతవఱకూ, ఇంకా ఏమైనా ఆంతరంగిక సాక్ష్యం చెప్పగల వచనాలు కొత్తవి ఆయనవి బయటపడేంతవఱకూ, ప్రస్తుతం ప్రతిపాదింపబడుతున్న జన్మ సంవత్సరాన్ని అంగీకరించటంలో బహుశః ఏ విప్రతిపత్తీ ఉండకూడదు. ఏతావతా కృష్ణమాచార్యుల జన్మ సంవత్సరం క్రీ॥ శ॥ 1230 వికృతి. 1246 పరాభవ సంవత్సర ఆషాఢ శు॥ ద్వాదశినాడు దండెయు చిఱుతాళములు ధరించి సింహగిరి నరహరి సన్నిధిని ఆయన సంకీర్తనం ప్రారంభించేరు.

## తామ్రపత్రాల సంగతి

ఓరుగంటిని కృష్ణమాచార్యులు సందర్శించి ఉండటానికి అభ్యంతరం ఏమీలేదు. ఆయన 'భూప్రదక్షిణం' చేసేరు. శ్రీరంగాది దివ్యక్షేత్రాలూ సందర్శించేరు. ఆ సందర్భంలో ప్రతాపరుద్రుణ్ణి చూసి సమ్మానాలూ పొంది ఉండవచ్చును. రాజకీయాధికారమూ చెలాయించి ఉండవచ్చును. అయినా ఆయన మనస్సు సింహగిరిమీదే ఉంది. అందుచేతనే కావచ్చు మూడేళ్ళు అధికారం చేసి సొమ్మంతా కూడబెట్టి తామ్రపత్రికలు చేయించి తన చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనలు వాటిమీద చెక్కించి స్వామికి సమర్పించటంకోసం, బళ్ళకెక్కించి సింహాచలానికే తరలించి ఉంటారు. ఆయన సింహాద్రినాథుణ్ణి కూడా శ్రీరంగశాయి అంటారు. ప్రతి శ్రీవైష్ణవ దివ్యక్షేత్రాన్ని "తిరుపతి" అన్నట్లు, ప్రతి విష్ణుక్షేత్రమయిన కొండనూ "తిరుమల" అన్నట్లు శ్రీవైష్ణ

వుల వ్యవహారంలో. సింహాచలం నివాస రసికులాయన. 60,70 వయస్సులో చాలావఱకూ "చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనం" పూర్తి చేసుకొని దేశం తిరుగుతూ ప్రతాపరుద్రుడి పరిపాలనా ప్రారంభదినాల్లోనే లేదా అతడు యువరాజుగా రుద్రమదేవి దినాల్లోనే రాజసమ్మానం పొందిఉండవచ్చును. ఆ తామ్ర పత్రికలు సింహాచలం తెప్పించి వాటిమీద తన వాఙ్మయం చెక్కించి సింహాగిరి నరహరి శ్రీ భండారానకు సమర్పించి ఉండవచ్చును. శ్రీరంగం వెళ్ళి సింహాచలానికి మళ్ళీ తిరిగివచ్చినట్టూ, సింహాద్రినాథుని శ్రీ భండారానకు "చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనలు" సమర్పించ పూనినట్లూ, ఆయన అంతరంగ సాక్ష్యం ఉండనేఉంది.

## ఇక ఆయన నివాసాన్ని గూర్చిన చర్చ

ప్రతాపచరిత్ర కృష్ణమాచార్యులకు ఓరుగంటితో సంబంధాన్ని పేర్కొంటూ ఆయన స్వగ్రామం 'సంతూరు' అనీ తరువాత ఆయన 'కల్లూరు' అనే గ్రామం నిర్మించేననీ చెపుతోంది. 'సంతూరు' లేక 'సంతురు' ఆయన జన్మభూమి అని ఆయన వచనాలవల్ల తెలుస్తోంది. అయితే యీ 'సంతూరు' ఎక్కడిదన్న ప్రశ్నకు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తిరునల్వేలి జిల్లాలో (మదరాసు) సంతూరనే గ్రామాన్ని సమాధానంగా ప్రతిపాదించేరు. తెలుగురచయిత జన్మభూమి తమిళ గ్రామం అవటం, అనటం బాగుండదని డా.కులశేఖరరావుగారు మహబూబ్‌నగర్ జిల్లాలోని 'సంతపురినే 'సంతూరుగా' నిరూపించటానికి పూనుకొన్నారు. వారి యీ నిరూపణానికి వారు చూపినకారణాలు రెండు-ఓరుగంటికి సంతపురి దగ్గరగా ఉండటం, 'సంతపురి' వారు వైష్ణవుల్లో ఉండటం ఒకటి. కృష్ణమాచార్యులు నిర్మించే రనదగిన "కల్లూరు" కూడా మహబూబ్‌నగర్ జిల్లాలోనే ఉండటం మరొకటీని. కాని యీ ప్రతిపాదనం అంత ఔచితీసహంగా కనబడదు. వ్యవహారదృష్టితో కాని భాషాశాస్త్రరీత్యాకాని సంతపూర్ లేక సంతపురి—సంత పూర్—సంతఊర్—సంతూర్—సంతూరుగామారే అవకాశం, ఔచిత్యం ఉంది కాని వ్యత్యస్తంగా-సంతూరు సంతపురి గామారే అవకాశం కనబడదు. ఇహ కల్లూరు సంగతి, ఇది మహబూబ్‌నగర్ జిల్లాలో ఉండవచ

కాని కృష్ణమాచార్యులు నిర్మించిన ఊరు ఇదేనా అని? ఆయన నిర్మించే రంటున్నారు అంటే కొత్తగా ఒక గ్రామం ఇలువేల్పు పేరనో, గురువు పేరనో తన పుణ్య-ప్రతిష్ఠల కోసమో నిర్మించుకొని ఉండాలి అంతే కాని గురుస్మృతీ, దైవస్మృతీ ఏదీలేకుండా వట్టి 'కల్లూరు' అనేపేరు తన గ్రామానికి పెట్టుకొంటారా అనేది పరిశీలించవలసిన అంశం. ఇంతే కాదు కృష్ణమాచార్యులకు దివ్యమైన పేర్లంటే మోజుకూడాను. తన మేనమామ గారి నివాసం "శ్వేతద్వీపం" అంటారాయన. ఈ 'శ్వేతద్వీపం' ఏ అంతర్వేదిక్షేత్రమో కావచ్చునేమో! పరిశోధకులు నిరూపించాలి. ఇట్లాంటి అలవాటున్న వ్యక్తి తను నిర్మించిన గ్రామానికి మరీపాషాణప్రాయమో అవద్యమద్వ్యార్థకమో అయిన కల్లూరన్న పేరుపెడతారనుకోను-ఇక ఆయన జన్మదేశ నిర్ణయం చేసేటప్పుడు సింహాచలంతో ఆయనకున్న సంబంధాన్ని విస్మరించకూడదు. ఈ సంబంధం నిరూపించటానికి కాని, ఆయన జన్మదేశాన్ని నిరూపించటానికి కాని, ప్రయత్నించేముందు ఈ వృత్తాంతం కల ఆయన వచనం చూడకపోతే అంత కంటె మహాపచారం మరొకటి ఉండదు. ఆయన వచనం ప్రకారం-

అంధుడని తల్లిదండ్రులు నూతిలో పారవేసిన కుఱ్ఱవాణ్ణి 'కృష్ణకువ్వారు' అనే ఒకసన్యాసి తీసి పెంచి కొన్ని సంవత్సరాలకు తాను సింహాద్రి వెళుతూ ఈ బాలుణ్ణి కూడా తోడుకొనిపోయి కింద ఈ పిల్లవాణ్ణి దిగవిడిచి తాను మాత్రం స్వామి సన్నిధికి (కొండపైకి) వెళ్ళేటప్పుడు తనను మరిచిపోయి స్వామి సన్నిధినే "కువ్వారు" ఉండి పోతాడేమో అనే భయంతో ఆ పిల్లవాడు తనను మరువ వద్దంటాడు. అందుకనుగుణంగానే మూన్నాళ్ళు ఈ బాలుడి సంగతి పట్టించుకోడు ఆ"కువ్వారు". తరవాత సింహాద్రినాథుడు బాల రూపంలో వచ్చి పాలుఇవ్వటం-అంధబాలుడికి దృష్టి రావటం జరుగుతుంది-ఇదీ ఆయన జన్మకథ.

## - సంతవూరు - సంతపురి కాదు -

ఎక్కడో మహబూబ్‌నగర్ జిల్లాలో 'సంతపురి' లో ఉన్న అంధ శిశువుని తీసుకొని ఒక సన్యాసి కళింగాంధ్రంలోని సింహాచలానికి చేరటం

సరిపెట్టుకోలేని సంగతి. ఈ మధ్యలో ఎన్నోక్షేత్రాలూ, మఠాలూ, అనాథ మందిరాలూ ఉండగా ఎక్కడా ఆ బాలుణ్ణి దించకుండా ఆ సన్యాసి ఇంత దూరం ఎలా, ఎందుకు తెచ్చినట్టు ? ఆయన సింహాచల స్థిరనివాసి అయిన కుటుంబీకుడుగాడు సన్యాసి శిరోమణి ఆయె ! - ఆ తరవాత అంధబాలుడు చూపుగలవాడై సంకీర్తనం చేస్తూండగా అతని తల్లిదండ్రులు, బంధువర్గం వారూ సింహాచలం వచ్చి చాలాసంతోషించి బాలుడికి జాతకర్మాది బ్రాహ్మణ సంస్కారాలన్నీ చేస్తారు. ఈ సంతూరు ఎక్కడో మహబూబ్‌నగర్ జిల్లాలో ఉంటే కృష్ణమాచార్యులవార్త వారికి తెలియటం వారంతా సింహాచలం రావటం ఇవన్నీ ఆరోజుల్లో జరగటం కొంచెం అసహజాలూ కష్ట సాధ్యాలూను. కనుక కృష్ణమాచార్యుల జన్మస్థలం అయిన 'సంతూరు' విశాఖపట్నం జిల్లాలోనే సింహాచలం పరిసరాల్లోనే ఉండి ఉండాలి. అలాగై తేనే ఆయన సింహాచలం చేరటానికి కాని తరవాత బంధువర్గం వారు ఆయన జాడతెలుసుకొని అక్కడికి రావటానికి కాని వీలుంటుంది.

## - సింహాద్రి - అప్పన్న దే -

ఈ సింహాద్రి లేక సింహాచలం విశాఖ పక్కదే. ఇతర ప్రమాణాలతో పాటు ఆంతరంగిక సాక్ష్యమే ప్రబల తమ ప్రమాణం ఇక్కడ. సింహగిరినరహరిని సింహాద్రిఅప్ప - అప్పడు అని కృష్ణమాచార్యులు చాలా చోట్ల వ్యవహరిస్తారు. శ్రీ జగన్నాథంతోపాటు సింహాచలాన్నీ పేర్కొంటారు. ఈ సహపఠితత్వంవల్లాయిది విశాఖ సింహాచలమే. ఇందులో అనుమానం అక్కరలేదు. అంచేత సంతూరు సింహాచలానికి వీలయినంత దగ్గరలో ఉండటమే సంభావ్యతరం. సింహాచలానికి రమారమి 25 మైళ్ళ దూరంలో 'సంతలూరు' అనే ఊరుంది ఇది 'సంతూరు' కావచ్చునే మోపరిశోధించాలి.

## - కువ్వారు - కవూర శబ్దభవం -

ఇక్కడ నాదొకకొత్త ప్రతిపాదన. తెలంగాణా జిల్లాలతో కంటె మొదటి నుంచీ 'ఒరిస్సా' దేశంతో సింహాచలానికి సన్నిహిత సంబంధాలుం

టున్నాయి. ఇది కళింగాంతర్భాగం. కళింగ గాంగులు సింహాచలానికి ఎంతో సేవచేసేరు. ఒరియా ప్రజకూ, వారి రాజులకు లాగే సింహాద్రినరసింహుడు ఇష్టదైవం. ఇప్పటికీ సింహాచలం భోగరాగాలూ ఆదాయమూ ఒరిస్సా ప్రజలవే. కృష్ణమాచార్యుల గురువు, రక్షకుడు అయిన కృష్ణకువ్వారు నరసింహస్వామి భక్తుడయిన ఒక సన్యాసికావచ్చును. ఒరిస్సా ప్రాంతంనుంచి సింహాచలం రాకపోకలు చేసే వాడుకావచ్చును. లేదా సంతూరులోనే అతనొక మఠంలో ఉండేవాడూ కావచ్చును. ఈ కువ్వారు కులశేఖరరావుగారూహించినట్లే కుమారభవంకావచ్చును పదమధ్యమకారం ఆనునాసిక్యంతో వకారంగా పరిణమించటం అసంభవంకాదు. మామ మాఁవ అయింది ఇల్లాగా కుమరాం కుఁవరాం (విశాఖ జిల్లాలోనిదే ఒకగ్రామం) అయింది. ఈ ఆనునాసిక్యోచ్చారణ కళింగాంధ్రంలోనే అతిశయంగా కనబడుతుంది. తెలుఁగులో అర్ధబిందూచ్చారణం ఇక్కడే స్పష్టతరంగా వినబడుతుంది. అంచేత కృష్ణకుమార్‌ని మనవారు కుమార్ కుఁవార్ కుంవార్ కుంవ్వారు అని ఉచ్చరించవచ్చును. లేదా కృష్ణమాచార్యులాయనను కృష్ణకుమార్ అనే వ్యవహరించితే పరంపరలో అది విపరిణామాన్ని పొంది ఉండనూవచ్చును. మొత్తానికీ కృష్ణకుమార స్వామి తెలుగు వారనితోచదు. తరవాత, బలమైన సాక్ష్యం అయన ఒరియా దేశస్థులటానికే తోడ్పడుతుంది. ఇది కూడా సంతూరుకు తెలంగాణా సంబంధం కంటె కళింగాంధ్ర సంబంధాన్నే దృఢతరం చేస్తోంది. ఈ కృష్ణకుమార్ పేరునే కృతజ్ఞతా సూచకంగా కృష్ణమాచార్యులకు అతని తల్లిదండ్రులు పెట్టిఉంటారేమో !

## సింహగిరి వచనాలు - ప్రక్రియా ప్రాథమ్యం

ఆంధ్రభాషలో కావ్యరచనకు శ్రీకారంచుట్టిన నన్నయగారు చంపూ ప్రాయంగా భారతాన్ని సంతరించేరు. సంస్కృతంలో అనూచానంగా వస్తూన్న కేవలపద్యకావ్య పద్ధతికంటే సమకాలీనంగా భోజరాజువలంభించిన చంపూ పద్ధతే ఇంపుగా కనపడ్డట్టుందాయనకు. తిక్కనగారు చివరకు నన్నయగారి మార్గాన్నే అనుసరించినా మొదట్లో నిర్వచన పక్కానను సరించి తెలుగులో

ఒక విశిష్ట సంప్రదాయం నెలకొల్పేరు. కృష్ణమాచార్యులు సంస్కృతాను సారంగా కేవల పద్యపద్ధతిగాక, నన్నయగారి ననుసరించి చంపూ పద్ధతిగాక, వచన శైలిలో కవితా గానం వెలయించేరు. ఈ పద్ధతికి తెలుగులో ఈయనే ఆద్యులు.

## సింహగిరివచనాలు - గద్యత్రయఃపూర్వరంగం

అప్పటికే శ్రీవైష్ణవ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులైన శ్రీ మద్రా మానుజులు సంస్కృతంలో గద్యత్రయ ప్రబంధం కటాక్షించేరు. ఈ గద్య త్రయం శ్రీ వైష్ణవులకు నిత్యానుసంధేయంగా ఉపాదేయం. శ్రీ వైష్ణ వులూ విశేషించి శ్రీమద్రామానుజులయందు ప్రగాఢ ప్రతిపత్తికలవారూ అయిన కృష్ణమాచార్యులు గద్యత్రయాన్ని పలుమార్లు మననం చేసుకోవటం లోనూ, కవనశీలురూ దేశభాషాభినివిష్టులూ అయిన ఆయన దాన్ని ఒర వడిగా గ్రహించి తెలుగులో కావ్యం వెలయించటంలోనూ అబ్బురం ఏమీ లేదు. "యామునార్యసుధాంభోధిమవగాహ్య" అని శ్రీమద్రామానుజులు తాము చెప్పినట్లే భగవద్యామునమునుల స్తోత్రరత్న శ్లోకవాక్యగర్భితంగా గద్యను వెలయించటంవల్ల అందులో చక్కటి వృత్తగంధిత విలసిల్లింది. కృష్ణమాచార్యులు సహజంగా గాయకులు. మధురభక్తిభావంతోపాటు సుమధుర కంఠనాదంకూడా ఆయన సొమ్మై ఉంటుంది. అంచేత లయతాళాను గుణంగా, రాగభావంప్రస్ఫుటం అయేటట్లు వృత్తగంధి వచనాలతో సం కీర్తనం ప్రారంభించి గద్యత్రయంకంటె మరోమెట్టు పైకే వెళ్ళేరు. గద్యత్రయం పాఠ్యంగా మాత్రమే ఉండగా 'సింహగిరి వచనాలు' సంకీర్త్య మాణాలుగా, గేయాలుగా కూడా ప్రశస్తికెక్కాయి అంటే ఇవి "తొలి తెలుగు వచన గేయా"లన్నమాట. గద్యత్రయం దీర్ఘసమాసభూయిష్ఠశైలీ విలసితం. కృష్ణమాచార్యులు సమాసాలుక్వాచిత్కంగా వాడినా దేశి తెలుగు పలుకుబళ్ళ ఆయనలో హెచ్చు. ఇది తత్కాల దేశభాషా విజృంభణ ప్రభావాన్ని సూచిస్తుంది. గద్యత్రయంలో [illegible]పతుల సంవాదం [illegible]. ఈ వచనాల్లోనూ సింహగిరి పతితో కృష్ణమాచార్యుల సంభాష

ణలు ఉంటాయి. వృత్తగంధి వాక్యాలు గద్యత్రయంలో కొకొల్లలు ఈ వృత్తగంధులు విశేషంగా ఉండటమేకాదు రాగభావస్ఫోరకంగా, తాళానుగుణంగా, గాన ప్రయోజకంగా ఇవి అవతరించటంవల్ల వీటి జీవలక్షణమే వృత్తగంధిత. స్వయం వ్యక్తిత్వం కలవారవటంవల్ల కృష్ణమాచార్యులు కేవలం అంధానుసరణం చేయకుండా ఎక్కడ చూసినా తమముద్ర ప్రస్ఫుటంగా కనపడేటట్లు విలక్షణమైన శైలిలో వచనాలు వెలయించేరు.

## సింహగిరివచనాలు - ప్రతులు

ప్రస్తుతం ముద్రితం అయిన ప్రతి తంజావూరి సరస్వతీమహల్ పుస్తకభాండాగారంలో విష్ణునామసంకీర్తనఫలం అన్న పేరుతో ఉన్న D. No. 803 తాళపత్రప్రతి. ఇందులో 60 వచనాలు ఉన్నాయి. ఇదికాక 'మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో 'సింహగిరి నరహరి వచనాలు' అన్న పేరుతో ఒకతాళపత్రప్రతి ఉన్నట్లు కాట్యలాగువల్ల తెలుస్తోందనీ, కాని దాన్నిగురించి మదరాసులో విచారించగా దాన్ని తిరుపతికి తరలించేరన్నారనీ, తీరా తిరుపతిలో విచారిస్తే అది అక్కడకు చేరనేలేదన్నారనీ డా॥ కులశేఖరరావు గారు అంటున్నారు. ఈ నిర్లక్ష్యం తిరుపతి వారిదో మదరాసు వారిదోతెలీదు. ప్రథమాంధ్ర వచనకావ్య ప్రతిపోగొట్టుకోవటం సాహిత్యపరంగా ఎంతటి మహానష్టమో ఇప్పటికీ మనవారు గుర్తించినట్టు కనపడదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంవారి క్యాటలాగులనుబట్టి కృష్ణమాచార్య వచనాలుండదగిన లిఖితగ్రంథాలు 5 కనపడుతున్నాయి. ఇందులో ఒకటి ఇందులోనే మరోదాని ప్రత్యంతరం అందేత నాలుగు విభిన్న ప్రతులు కృష్ణమాచార్యులకు సంబధించినవి ఉన్నాయన్న మాట, వాటివివరాలు ఈ కింద పొందుపరుస్తున్నాను.

## మద్రాసు పాచ్యలిఖిత పుస్తక బాండాగారం ప్రతులు

1 సింహగిరి నరహరి వచనములు. తాళపత్రప్రతి. నెం, 1464 14-3/4" × 1-1/4" పరిమాణములో 11 పేజీలు. (బహుశః 11ఆకులు

కావచ్చునేమొ) పుటకు ఐదు పంక్తులున్నాయి. నెం. 1398గా ఇది Ante లో వర్ణింపబడ్డది. ఉదాహృత వచనం ముద్రితవచనాలతో సంవదిస్తోంది. ఇదే కులశేఖరరావుగారు పేర్కొన్న పోయినప్రతి.—దీనివివరాలు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంవారు 1937లో ప్రకటించిన డిస్క్రిప్టివ్ కాటలాగు ఆరవ సంపుటం వచనకావ్యాల్లో 1779వపుటలో ఉన్నాయి.

## కృష్ణమాచార్య సంకీర్తనము

కాగితపు ప్రతి. ఆర్. నెం. 1034. 9-1/2 × 10-1/2 పరిమాములో ఉంది. 1933-34 సంవత్సరాల్లో డి. నెం. 2946 వ్రాతప్రతి నుంచి ఉద్ధరించేరు. అసమగ్రం. దీనివివరాలు 1949లో ముద్రింపబడ్డ మద్రాసు ప్రా. లి. పు. భాండాగారంవారి ట్రయన్నియల్ క్యాటలాగు ఆరవ సంపుటలో 2237వ పుటలో ఉన్నాయి. ఇందులో ఆర్. నెం. 813నుంచి 1064దాకా ఉన్న గ్రంథాల వివరాలున్నాయి. ఉదాహృతవచనంలో కృష్ణమాచార్యముద్ర (సింహగిరినరహరి నమో నమోదయానిధీ) కనపడలేదు. కాని మిగతా కృష్ణమాచార్యవచన లక్షణాలన్నీ ఇందులో ఉన్నాయి. ఆయన పేరూఉంది ఇందులో. కృష్ణమాచార్య కర్తృత్వ సాధనాలుగా మరి రెండువిషయాలు ఇందులో కనబడుతున్నాయి. 1. విదురునింటి విందా, పాండవపక్షపాతీ వంటి సంబోధనాలు. 2. శ్రీరాఘవేశ్వర, కృష్ణకుమార సంబోధనలు, మొదటి రెండు సంబోధనలూ ముద్రితవచనాల్లోనూ ఉన్నాయి కృష్ణకుమారుడు—ముద్రితవచనాల్లోఉన్న కృష్ణకుమ్వారుస్వామికాని మరొకరుకాదు. ఇక రాఘవేశ్వర సంబుద్ధి. ఇదికేవలం రఘునాధపరం కాదు. కృష్ణకుమారస్వామిలాగే యీ రాఘవేశ్వరస్వామి లేక రాఘవస్వామి కృష్ణమాచార్యులకు గురుస్థానీయులనితోస్తుంది. ముద్రిత వచనాల్లో 13వ వచనంలో "రాఘవభాష్య విశేషసుధామృత సంజీవనిష్ఠ" అనే ఒక ప్రయోగం యీ సందర్భంలో గమనించాలి. ఈ"రాఘవభాష్య" కర్త ఆ "రాఘవేశ్వరుడే కావచ్చును. ఈతవితో ఆచార్యులవారి సంబంధం ఎలాంటిదో అసలీయన ఎవరో తెలుసుకోవాలి. ఏమయినా యీ గ్రంథం కృష్ణమాచార్య వాఙ్మయదృష్టితో పరిశీలించదగింది.

## కృష్ణమాచార్య సంకీర్తనము

కాగితపుప్రతి. సమగ్రం. వరుస నెం. 655 ఆర్. నె. 206. 1911–15 సంవత్సరాల్లో గ్రంథాలయం వ్రాతప్రతినుంచి ఉద్ధరింపబడింది. 1917లో ముద్రింపబడ్డ మద్రాసు ప్రా. లి. పు. భాండాగారంవారి త్రయన్ని యల్ క్యాటలాగు రెండవసంపుటం మూడవభాగం (తెలుగు) లో ఈ వివ రాలున్నాయి. ఉదాహృతవచనాన్ని పట్టీ పైన పేర్కొన్న గ్రంథంయిదీ ఒక్కటిగానే కనపడుతున్నాయి.

## కృష్ణమాచార్య సంకీర్తనము

తాళపత్రప్రతి. సమగ్రం, వరుస నెం. 654 బీరువా వివరాలు 11-4-5. ఈ వివరాలు 1932 లో ప్రకటితమైన "తెలుగు" లిఖిత గ్రంథాల అకారాదిసూచిక" 31 వ పుటలో ఇవ్వబడ్డాయి. డిస్క్రిప్టివ్ క్యాటలాగుల్లో మరి దీని వివరాలు కనబడలేదు.

## కృష్ణమాచార్య సంకీర్తనము

తాళపత్రప్రతి, సమగ్రం, ఆర్ 4476 (25) ఆర్ 206 వంటిదే అని యిక్కడ వివరణ వ్రాసి వుంది. కృష్ణమాచార్య ప్రశంసాపరమైన పుస్తకం ఇది అని క్యాటలాగు వారూ, విమర్శకులూ భావిస్తున్నారు. కాని కృష్ణమాచార్య వాఙ్మయ లక్షణాలు ఇందులో చాలా ఉన్నాయి. ఉదాహృత భాగంలో ముద్రలేదు. దేవా అన్న సంబోధన, కృష్ణమాచార్యుల పేరు ఉన్నాయి. అంతంలో "ఈ దివ్యనామ స్మరణంయెవరు వ్రాసినా యెవరు చదివినా యెవరు విన్నా" అని ఉంది. దీన్నిబట్టి యిది కృష్ణమాచార్య సంకీర్తనమే కావచ్చును. ఆయన మహత్వాన్ని ఓరుగంటితో ఆయన సంబంధాన్ని సూచించే వచనం ఒకటి ముద్రిత ప్రతిలోనూ ఉంది. కృష్ణ మాచార్యుల మహత్త్వాన్ని ఇతరులే చెప్పక్కర్లేదు ఆయనే చెప్పుకోగల రనటానికి ఆయన వచనాలే సాక్ష్యం. కృష్ణమాచార్యులు ప్రథమ పురుషలో

ప్రస్తావింపబడ్డంత మాత్రంచేత ఇది పరకర్తృకం కానక్కర్లేదు. ఈ ప్రథమ పురుష వ్యవహారం నన్నయగారిలో పోతరాజుగారిలో కూడా చూసినవారికి కృష్ణమాచార్యుల్లోనూ విచిత్రం కాదు. ముద్రిత వచనాల్లోనూ ప్రథమ పురుష వ్యవహారం ఉంది. కాకపోయినా ఆయనను గూర్చిన గ్రంథంగానైనా దీని విలువలను తెలుసుకొని ఉపయోగించుకోవాలి.

## శ్రీ ఆరుద్ర వచనం

ఇవి యిల్లాగుండగా శ్రీ తిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారు కొన్ని సింహగిరి నరహరి వచనాలు సేకరించి ముద్రణానుకూలంగా సిద్ధం చేసి ఉంటారని శ్రీ ఆరుద్రగారు అంటున్నారు. 1952 లో శ్రీ తిమ్మావఝ్ఝులవారి భారతి వ్యాసం నేనూ చూసేను. కాని ప్రస్తుతం అదినాకు లభించలేదు. దాన్నిగూర్చిన ప్రత్యభిజ్ఞాచాలటం లేదు. శ్రీ ఆనందమూర్తి వ్యాసమూ భారతుల్లోనే చూసిన గుర్తు ఖచ్చితంగా పరామర్శింపలేకపోతున్నాను. శ్రీ ఆరుద్రగారు "సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర" పద్మనాయక యుగంలో కృష్ణమాచార్యుల వచనం ఒకటి ఉదాహరించేరు. తంజావూరి నుంచి తాము వచనాలు వ్రాయించి తెప్పించుకొన్నట్లు శ్రీ ఆరుద్రగారు తెలుపుతున్నారు, కానివారిచ్చిన ఆ వచనం తంజావూరి ప్రతిలోదికాదు. తంజావూరిలో సింహగిరి నరహరి వచనాలు. "విష్ణునామ సంకీర్తన ఫలం" అన్న పేరుతో ఉన్నట్లు శ్రీ ఆరుద్రగారు పేర్కొన్నారు. ఆ"విష్ణునామ సంకర్తన ఫలాన్నే" డా॥ కులశేఖరరావుగారు ప్రకటించేరు. దాని కాగితపు వ్రాతప్రతి. 1947 లో వ్రాయించినది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులోనూ ఉంది. శ్రీ ఆరుద్రగారు తమకావచనం ఎక్కడ లభించిందో సరిగా చెప్పలేదు. మద్రాసులోని సింహగిరి వచనాల సంగతి వారు ప్రస్తావించలేదు. వారు కృష్ణమాచార్యుల్ని గూర్చి చెప్పిన విషయాలకు శ్రీ కోదండరామయ్యగారే ప్రమాణం అని వారి వ్రాతలవల్ల తెలుస్తోంది. ఈ వచనం శ్రీ కోదండరామయ్యగారి దగ్గరనుంచి కాని శ్రీ ఆరుద్రగారు స్వీకరించేరో లేక కామే

మద్రాసు భాండాగారంలోంచి సంపాదించేరో తెలియదు. తంజావూరినుంచి వ్రాయించి తెప్పించుకొన్న "విష్ణునామ సంకీర్తనఫలం"లో వచనం ఉదాహరించకుండా అవిజ్ఞాతజన్మకారణ రహస్యమైన యీ వచనాన్ని ఉదాహరించటంలో వారి ఊహ ఏమిటో ! ఒకవేళ ఈవచనాన్నే శ్రీ కోదండ రామయ్యగారో, శ్రీ ఆనందమూర్తిగారో భారతుల్లో వెనక ఉదాహరించేరేమో స్మృతికి రావటంలేదు. శ్రీ ఆరుద్రగారి వ్రాతలవల్ల, వారిచ్చిన ఉదాహరణ వచనంవల్లా శ్రీ కోదండరామయ్యగారు మద్రాసు 'సింహగిరినరహరి వచనాల'ను సేకరించే ఉండిఉంటారని నేనూ మొదట్లో భావించేను. శ్రీ కోదండ రామయ్యగారు మద్రాసుప్రతులెరిగనివారుకాదు. కాని తమవద్దే ఆ వచనా లుంటే రెండు దశాబ్దాలుగా వాట్ని వెలుగులోకి తేకుండా ఊరుకొంటారా శ్రీ కోదండ రామయ్యగారు అని మళ్ళీ సందేహమూ కలుగుతోంది. మద్రాసుప్రతి అక్కడలేకుండా, తిరుపతి చేరకుండా, చివరకు సింహగిరి వచనాలప్రతి ఎక్కడా లేకుండా పోయిన యీ గడ్డుకాలంలో, 1952లోనో అంతకు పూర్వమో మద్రాసు మాతృకకు ప్రతి వ్రాసుకొనిఉంటే శ్రీ కోదండరామయ్యగారే కృష్ణమాచార్య వాఙ్మయ పోషణకు తోడ్పడాలి.1 వారు తాముసేకరించిన ముద్రితప్రతి భిన్నాలైన వచనాల్ని యథాతథంగా నైనా పత్రికాముఖంగా ప్రకటిస్తే 'పరివర్ధిత సింహగిరి వచనాల' ముద్రణకు అవకాశం ఉంటుంది. కృష్ణమాచార్యులను గురించి ఏమేనా మరికొంత చెప్పే అవకాశమూ ఉంటుంది.2

'సింహగిరి నరహరి వచనాలు' అన్నపేరుతోనే ఉన్నపుస్తకం కన పడక పోవడం, నాటినుంచీ ప్రథమాంధ్ర వచన కావ్యరచయితకు తెలుగు దేశంలో జరుగుతున్న అమర్యాదకు తార్కాణ. ఇందుకు బాధ్యులైనవార్ని

---

1 మాన్యులు శ్రీ కోదండ రామయ్యగారు పరమ పదించకముందు వ్రాసినది యీ పీఠిక.

2 శ్రీ ఆరుద్రగారిచ్చిన వచనం తిరుపతిలో ఉన్న R 1034 'కృష్ణమాచార్య సంకీర్తనము' అన్న ప్రతిలో ఉన్నది. 1973లో తిరుపతినుంచి యీ ప్రతిని నేను వ్రాయించి తెప్పించుకొన్నాను.

ఆంధ్రప్రజ ఉపేక్షించటం మరీ సహింపరానిది. ద్రావిడాభిజాత్యంగల శ్రీ వైష్ణవకుటుంబాలవారూ, వర్ణవ్యవస్థమీద అవర్ణ్యమైన భక్తిశ్రద్ధలుగల అగ్రవర్ణాల విద్వాంసులూ, చివరకు నేటి పరిశోధకులూ, 'సంపాదకులూ' కూడా ఏదోరకంగా తెలిసో తెలియకో ఆయనపట్ల అపచారపడుతున్నవారే.

## శ్రీ విశ్వనాథ - విచిత్రచర్య

ఈ సందర్భంలో "ఒక విచిత్రోదంతం." ఆంధ్రప్రజలముందు విన్నవించుకొంటున్నాను. ఆంధ్రసాహిత్య అకాడమీవారు కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ (ప్రభృతుల) గారి సంపాదకత్వంలో "ఆంధ్ర గద్యచంద్రిక" అని ఉదాహరణ ప్రాయమైన ఆంధ్రవాఙ్మయ గద్యభాగ సంకలన గ్రంథం ఒకటి ప్రచురించేరు. ఇంతకు ముందే ఎప్పుడో ప్రథమాంధ్ర వచన కావ్యరచయితగా పేర్కొనబడ్డ కృష్ణమాచార్యుల వచనం మచ్చుకు ఇందులో లేకపోవటం ఆంధ్రత్వానికి గర్వకారణం ! సంపాదక వర్గనాయకులు ఆంధ్రప్రభుత్వాస్థాన కవులు! గ్రంథం ప్రకటించినవారు పరిగణింపబడ్డ ఆంధ్రసాహిత్య అకాడమీవారు ! పుస్తకమా ఆంధ్రగద్య చంద్రిక! ఈ ఆంధ్రత్రివేణీ సంగమంలో అవగాహనం మాట అలాఉంచండి పుడిసెడు తీర్థం పుచ్చుకొనేందుకు అర్హత సంపాదించుకోలేకపోయేడు ప్రథమాంధ్ర వచనరచయిత. ఈ చంద్రికలోనే చూడలేకపోతే ఎక్కడో మారుమూల చీకట్లలోఉన్న సింహగిరివచనాల్ని అసలు చూడగలరా తెలుగుజనం.ఇందులో అజ్ఞాత కర్తృకాలూ అర్వాక్కాలికాలూఅయిన 'భవానీ మనోహర వచనాలు' మొదట ఇచ్చేరు. ఈ ప్రాథమ్యహేతువు తెలపలేదు. తాళ్ళపాకపెద తిరుమలాచార్యుల వైరాగ్యవచన మాలికాగీతాల్లోని తొలి వచనం అజ్ఞాతకర్తృకంగా రెండోదిగా ఇచ్చారు. మరీ అర్వాక్కాలికమూ దీవి కృష్ణమాచార్య కర్తృకమూ అయిన 'శఠకోపవిన్నపముల'లోని ఒక విన్నపం మూడోదిగా ఇచ్చేరు. నేనెరిగినంతవఱకూ చివరి రెండూ ముద్రితాలు. పీటిరెండింటి మీదా కృష్ణమాచార్యుల ప్రభావం ప్రస్ఫుటంగాఉంది

## శ్రీ రఘువీరగద్య ఆంధ్రంకాదు

దీనికితోడు ఇందులో మరో "అఘాయిత్యం" ఏమిటంటే కవితార్కిక సింహులు, సర్వతంత్రస్వతంత్ర బిరుదాంచితులు; శతాధిక గ్రంథకర్తలు వేదాంతదేశికవిఖ్యాతులు అయిన శ్రీమద్వేంకటనాథ కవులు సంస్కృతంలో చెప్పిన "శ్రీరఘువీరగద్య" ని అజ్ఞాతకర్తృకంగా ఆంధ్రగద్యచంద్రికలో ఉదాహరించేరు సంపాదకులు. గీర్వాణవాఙ్మయాన్ని మనం ఎంత కొల్లగొట్టు కులనుభవిస్తున్నా ఇంతదురన్యాయమా? ఇది అన్యాయదురాక్రమణంకాదూ? ఇతరభాషలవారు శ్రీరఘువీరగద్యకర్తృత్వాన్ని గుర్తించలేని మన గీర్వాణ సాహితీ పరిచయాన్ని పరిహసించరూ? ఇహ వేదాంతదేశికులు తెలుగు వారనో, ఆయన తెలుగులోనే యీగద్యం వ్రాసేరనో, లేకపోతే మన ఆంధ్రకవివృషభులెవరో వ్రాసిన తెలుగు గద్యనే శ్రీమద్వేదాంత దేశికులు స్వీకరించిఉంటారనో చిత్రచిత్ర సిద్ధాంతాలని ప్రతిపాదించాలి. దేశికులకు రమారమి నాలుగుపదులు ముందున్న కృష్ణమాచార్యులు 1945 నుంచీ పత్రికల్లో ప్రథమాంధ్ర వచన కవితాచార్యుడుగా కీర్తింపబడుతున్నా ఆయన వచనం ఆంధ్రగద్యచంద్రికలో లేకపోవటం ఆత్మవంచన; ఇది పరవంచన.

## సింహగిరివచనములు - స్వరూపస్వభావాలు.

ఇప్పటికి ముద్రితవచనాలు 60. వీటిలో కొన్ని సామాన్యలక్షణాలతో కొన్ని విశేషలక్షణాలూఉన్నాయి, ప్రతివచనం దేవాఅనే సంబోధనతో ప్రారంభంఅయి, 'సింహగిరి నరహరి నమోనమోదయానిధీ' అనే మకుటంతో ముగియటం సామాన్యలక్షణం. ఈ మకుటంలో కొన్నిచోట్ల "మాయతి రామానుజముని పరందాతారు అనీ 'కృష్ణకువ్వారుస్వామీ' అనీ ముందు చేరటంకద్దు. వచనానికి ఏకరూపమైన పరిమితి పాటించినట్టు కనబడదు. "ఆలాపవర్ణనలతో నమోనారాయణాయని విష్ణునామ గుణకథలు వచన భావంబున కీర్తించను, ఘుమఘుమ ధ్వనులుమ్రోయగాను దండెమీటుచు తాళంబులుగ్గడించుచు పంచమవేదస్మృతులును చాతుర్లక్షగ్రంథ సంకీర్తన వాక్పూజలును చేయంగాను" అనేవాక్యాలవల్ల రాగభావంతో తాళానుగుణంగ తంత్రీశ్రుతి సమన్వితంగా ఈ వచనాలు గానం చేయబడేవవి తెలుస్తోంది.

## నవరత్న పంచరత్న కీర్తనలు

ఇవికాక "సింహాద్రియప్పని సంకీర్తన చేయుచున్నపుడు నవరత్న పంచరత్న సంకీర్తనల జెప్పగా" అనటంవల్ల, నేటికాలంలో త్యాగరాజాదుల పంచరత్నకీర్తనలు ఛందోబద్ధాలుగా కనపడుతూన్నందువల్ల, కృష్ణమాచార్యులుకూడా ఛందోబద్ధాలైన నవరత్న పంచరత్న కీర్తనలు రచించి ఉంటారనీ తోస్తుంది. వాటి స్వరూపస్వభావాలను గురించి ప్రస్తుతం చెప్పలేం. రాగతాళ సమాశ్రయాలూ, ఛందోబద్ధాలూ అయిన కీర్తనలూ గీతాలూ కృష్ణమాచార్యులు రచించి గానం చేసేవారనటానికి పరోక్షప్రమాణం ఆయన వచనాల్లోనే కనపడుతోంది. కోడిపుంజుల యుద్ధాన్ని వర్ణిస్తూ దాని కుపమానంగా ఒక గీతం ఉదాహరించేరాయన — ఘటితముఖపదదళిత సంధిత కౌస్తుభాంశు..........మకుట కఠోరవందిత కుంభినీజయ శోభితమ్ కనక ఘనపీతాంబరాచ్యుత కౌస్తుభాజయశోభితమ్. గిరదోలక ఆదిజం కిణికిణింకిణి కిణికిణింకిణి కిణికిణింకిణి కిణికిణింకిణి — దేవా అనాథపతి స్వామీ సింహగిరినరహరీ" దీన్నిపట్టిచూసినా ఆయన ఇటు వచనగేయాలూ అటు రాగతాళానుగుణాలైన గీతాలూకూడా రచించేరనిచెప్పవచ్చు.

## చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనలు

కృష్ణమాచార్యుల వాఙ్మయ పరిమితిని గురించి ప్రస్తుతం చెప్పదగ్గ సాక్ష్యం ఏమీలేదు. ఆయన చాతుర్లక్ష గ్రంథ సంకీర్తన వాక్పూజలు చేస్తున్నట్లు చెప్పుకొన్నారు పలుతావుల్లో. "గ్రంథం" "అంటే 32 మాత్రలనే సంప్రదాయత మనకు ఉంది. మనవారు గ్రంథ పరిమితిని "గ్రంథ"ప్రమాణంతోనే చెప్పేవారు. తమిళంలోనూ దివ్యప్రబంధవ్యాఖ్యాన సంప్రదాయంలో గ్రంథ ప్రమాణ పరిగణనం పరిపాటిగా ఉంది. తమిళంలోకాని సంస్కృతంలో కాని ఏదీ లక్షదాటినట్టు కనపడదు. భారతమే మనకు లక్షగ్రంథం. గుణాఢ్యుని బృహత్కథ ఏడులక్షలని కథ. కృష్ణమాచార్య సంకీర్తనం పంచమవేదానికి చతుర్గుణం అన్నమాట! ఈ నిక్షేపం అనుభవించటానికి తెలుగువారు నోచుకొన్నారో లేదోమరి. కానీ 'చాతుర్లక్ష' ని లక్షణ బద్ధంగా పరిగణించె

అవకాశం ఉండా అంటే అది కుదరటంలేదు. పోతకమూరి భాగవతుల ప్రసంగంలో అప్పటికి చాతుర్లక్షలకు లక్షాఏభై వేలు కొఱత అంటున్నారాయన దీన్నిబట్టియిది వాచకమే అనటంలో అనుమానం అక్కరలేదు. కృష్ణమా చార్యులనాడు గంటంతో తాటాకుల మీద వ్రాసుకొనే అలవాటుంది. ఒకానొక సందర్భంలో ఆయన స్వామి సన్నిధిని గానం చేస్తూండగా స్వామి బాల రూపంతో వచ్చి ఆయన తొడమీద కూర్చొని గంటంతో తాటాకుమీద వ్రాయసాగేడట!. దీన్నిపట్టి అంతకుముందు వ్రాయకుండా ఆశువుగా ఎప్పటి కప్పుడు తోచినట్టుగానం చేసేఅలవాటున్నా ఈ సంఘటన తరవాతనైనా వ్రాయించాలన్న ఊహ ఆయనకు తోచి ఉండాలి. అంతదాకా అక్కర్లేదు 'చాతుర్లక్ష' అనగానే, సంఖ్యాపరిమితి పెట్టుకోగానే వ్రాయించే ఉంటారనేది నిర్వివాదం. అయితే యీవ్రాయించటం తామ్ర పత్రాలమీదేనా? తాళపత్రాల మీద కూడా వ్రాయించి ప్రచారానికి వీలు కల్పించేరా? అన్నదోప్రశ్న. కొన్నితాళ పత్రగ్రంథాల్లో ఫలశ్రుతిగా సంకీర్తన మహాత్వం చెపుతూ "ఎవరు వ్రాసినా" అని ఉన్నందువల్ల ఆయన కాలంలోనే యివిప్రోత్స హింపబడి దేశంలో వ్యాపించి ఉంటాయి. అయితే ఏఒక్కరూ చాతుర్లక్షనూ వ్రాసే అవకాశం ఉండక పోవచ్చు. చాతుర్లక్షలూ ఉన్న తాళ పత్రప్రతి ఉండే అవకాశం కాని అది మనకు లభించే అవకాశం కాని లేక పోవచ్చు అక్కడికి మిగిలిన ఆశఅల్లా తామ్రపత్రికల నిక్షేపం మీదే.

## తామ్రపత్రికలు

రాగిరేకులు చేయించి వాటిపై కీర్తనలు చెక్కించి వాట్ని కృష్ణమా చార్యులు శ్రీరంగం తీసుకుపోయినట్లు ప్రతాపచరిత్ర చెప్తోంది. కృష్ణమా చార్యులవారు తమ చాతుర్లక్ష సంకీర్తనల్ని తామ్రపత్రికల మీద చెక్కించి హరి సమర్పణంగా స్వామి భండారానకు సమర్పించి భావితరాలవారి కోసం స్వామిప్రసాదంగా, భాగవత శేషంగా వాట్ని నిక్షేపించినట్టు దీనివల్ల తెలుస్తోంది. అయితే ఇక్కడ ప్రతాపచరిత్రను జాగ్రత్తగా పరిశీలించాలి ఈ విషయం ఇంతకు పూర్వమే విన్నవించేను. ప్రతాప చరిత్రతో పాటు

అన్నివిధాలా కృష్ణమాచార్యులకు వారసులన దగిన తాళ్ళపాక వారు తామ్ర పత్రికలు వేయించటమూ, కృష్ణమాచార్యులు తప్పకుండా తామ్రపత్రికలు వేయించే ఉంటారనటానికి అవార్యమైన అనుమానప్రమాణంగా కనపడు తోంది. తాళ్ళపాకవారి తామ్రపత్రిక పెన్నిధి బయటపడ్డట్టే ఆచార్యులవారి తామ్రపత్రికల నిక్షేపమూ బయటపడాలి. తెలుగు సరస్వతికి శాపవిమోచనం ఎప్పటికో !

## తెలుగు వేదం - వచనాలు

కృష్ణమాచార్య వచనాలకు వేదప్రామాణ్యం, తౌల్యం అందులోనే ప్రతిపాదించబడింది. తన సంకీర్తనల్ని పంచమ వేద స్మృతులుగా భావిస్తా రాయన. వాటిలో వేదంఉన్నదంటారామహానుభావుడు. అవి వేదమే అంటారు కొన్నిచోట్ల. ఇట్లా పంచమవేదస్మృతిద్వారాను, ఋగాదివేద ప్రామాణ్య ప్రతిపాదనంద్వారాను వాటివిశిష్టతని ఆయనే ప్రకటించేరు. వేదం ఎట్లా పరతత్త్వప్రతిపాదకమో, ఉపనిషత్తులు ఎట్లా పరబ్రహ్మస్వరూపనిరూప కాలో ఆయన వచనాలూ అట్లాగే పరతత్వం అయిన శ్రీమన్నారాయ ణుని స్వరూపరూపగుణ విభవాదుల్ని ప్రతిపాదించేవి కావటంవల్ల ఇవి వేదతుల్యాలు — తెలుగువేదాలు అయేయి.

## తమిళ వేదం-శఠకోపులు

ద్రావిడ శ్రీవైష్ణవ సంప్రదాయంలో ద్రావిడ వేదం అయిన నాలా యిర దివ్యప్రబంధం విషయంలో, ముఖ్యంగా శ్రీ శఠకోపసూరుల విష యంలోనూ ఇట్లాంటి సమన్వయమే ఉంది. "వేదంతమిళ్ శెయ్దమారన్ శఠకోపన్" అని వేదాన్ని తమిళం చేసినవారుగా ఆయనకు ఖ్యాతిఉంది.అంటే చతుర్వేదాలనూ లేకత్రయిని, లేక ఏదో ఒక వేదాన్ని యథామూలంగానో, ఛాయగానో, స్వతంత్రంగానో తమిళ భాషలో అనువదించేరనికాదు. ఇంతకు ముందు చెప్పినట్టే అఖిలహేయప్రత్యనీక కల్యాణ గుణైకతానుడు, త్రివిధ కారణ భూతుడు, చిదచిత్స్వరూపుడూ అయిన శ్రీమన్నారాయణుని స్వరూప రూపగుణ విభవాది కీర్తనంలోనే వేదప్రామాణ్యం, తౌల్యమూను. ఈ

ప్రామాణ్యంతోనే తరవాతవారు వేదాలకులాగే తమిళ వేదానికీ ఒక వింగడింపూ, అధ్యయన పద్ధతి, అక్కడి స్వరపద్ధతికి దీటుగా ఇక్కడ నియత రాగతాళగాన పద్ధతి, దాని స్వస్తివిధానానికి ప్రతిబందిగా సేవాకాల విధానం- ఇట్లు ఏర్పరిచి ద్రావిడవేదమనీ, ద్రావిడవేదాంతమనీ సుదృఢమయిన వ్యవస్థను రూపొందించేరు. అల్లాంటి వ్యవస్థయేదీ లేకపోవటంవల్లా తరవాతి వారి ప్రోత్సాహం లభించక పోవటమేకాదు కొందరు దురర్ధ సంప్రదాయానుయాయుల మౌర్ఖ్యం పెద్ద అవరోధం కావటంవల్లా, సువ్యవస్థగానో అవ్యవస్థగానో వేదప్రమాణాలుగానో ఏదో అప్రమాణంగానో అసలాయన వచనాలు నిలిచి తెలుగు జాతికి లభిస్తే బాగుండుననేటట్టుంది యిక్కడి స్థితి.

## తమిళ వేదం - దేశివ్యక్తిత్వం

ఆళ్వారుల దివ్యప్రబంధాన్ని 'ద్రావిడవేదం' అనటంలో-వారు బంధురభక్తిభావ పారవశ్యంతో పరమేశ్వరుణ్ణి కీర్తించటంతో వారిపై పేర్కొన్న బ్రహ్మాండమైన భక్తిభావం తదనుయాయులచేత అట్లా పలికించింది. రెండోది-ఆళ్వారులు కృష్ణభక్తి సంప్రదాయాన్ననుసరించటం. తమిళంలో పాడటం, వారు పరస్పరం, వారంసర్నీ తరవాత వారూ, వర్ణ వ్యవస్థాపరిధుల్ని అతిక్రమించి గౌరవించి అనుసరించటం, వేదానికి ప్రతిద్వంద్విగా, ప్రతికోటిగా ద్రావిడ-వేద-వేదాంత వ్యవస్థ ఒకటి నెలకొల్పటం ఇవన్నీ మౌలికంగా భాగవత సంప్రదాయంలోనూ, తమిళభాషా వాఙ్మయ చరిత్రలోనూ ఉండే స్వతంత్రచ్ఛాయల్నీ, దేశితనాన్నీ విస్పష్టంగా ప్రకటించుతాయి. అంతర్యవనికంగా ఇంత వ్యవహారం తమిళ వేదానికి ఉన్నది. ఈ దృష్టితోనే కృష్ణమాచార్యుల తెలుగు వేదాన్ని మనం పరిశీలించాలి.

## తెనుగు వేదం - విమర్శకుల అపార్థం

మొట్టమొదట కృష్ణమాచార్యుల వాఙ్మయాన్ని తెనుగు వేదంగా పేర్కొన్నఘనత తాళ్ళపాక తిరువెంగళ నాథునిది. "వేదంబు తెనుగు గావించి సంసార ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు" అని అతడు పూర్వాచార్యసంస్మరణం చేస్తూ అంటాడు. అయితే ఇక్కడ మన విమర్శకులం

దరూ ఒక చిత్ర విచిత్రమైన భ్రాంతికిలోనై "శఠకోపవిన్నపములు" అనే పేరుతో కనబడుతున్న విన్నపాలే కృష్ణమాచార్యుల తెనుగు వేదం అయి ఉండవచ్చుననే అభిప్రాయం ప్రకటిస్తున్నారు. కాని అది సరికాదు. వీరందరూ ఇట్లాపొరపడే అవకాశం ఇచ్చినవి పై పరమయోగి విలాస పంక్తులే. పూర్వవాక్యాలతో కలిపి వాటిని మరోమారు పరిశీలిస్తే యథార్థం అవగతం అవుతుంది. తొండమాన్ చక్రవర్తినీ, శ్రీమద్రామానుజుల భాగినేయుడు దాశరధినీ, శ్రీపరాశర భట్టార్యులనీ, అనందాళు వార్నీ స్తుతించిన తరవాత-

> శఠమత రాద్ధాంత సంహారియైన
> శఠకోపముని బోలు శఠకోపమౌని,
> వేదంబు తెనుగుగావించి సంసార
> ఖేదంబు మాన్చిన కృష్ణమాచార్యు.,

అని పరమయోగి విలాస పంక్తులున్నాయి. శ్రీనిడుదవోలు వారిదగ్గరనుంచి శ్రీ ఆరుద్రగారివరకూ అందరూ ఇంచుమించు ఈ పంక్తుల్ని అపార్థమే చేసుకొని, పూర్వపంక్తిలో ఉన్న "శఠకోపమౌని"ని యివతలకు ఈడ్చి ఆయన నెత్తిన వేదాన్ని మోపి, ఆ శఠకోపమౌనియొక్క వేదాన్ని తెనుగు చేసిన కృష్ణమాచార్యులనే తాత్పర్యం సంపాదించి "శఠకోపవిన్నపాలే"యీ తెలుగువేదం అన్న చమత్కారమైన సిద్ధాంతం ప్రతిపాదించేరు. దీనికితోడు మరో అభాండధ్వనికూడానూ ఇక్కడ—ఈ శఠకోప విన్నపాలకు మాతృకామాత్రమే శ్రీ శఠకోపుల తమిళవేదం అని. మన పరిశోధక విమర్శకులు తాత్పర్యగ్రాహులేకాని అన్వయచణులూ చతురులుగా కనపడరు. వారి ధోరణిలో అన్వయించినప్పుడేనా పై ఉద్ధారంలో రెండోపంక్తిలో ఉన్న ఉపమానవాచకం ఏంకావాలి ? అదీగాక ఇద్దరు శఠకోపులు ఇక్కడ కనపడ్డంలేదూ ?

అసలు సమన్వయం ఇదీ.

శఠమతరాద్ధాంత సంహారియైన శఠకోపముని బోలు.

'శఠకోప' బిరుదాంచితుడైన స్వామ్మాళ్వారులకు సాటికాదగిన శఠకోపమౌని(న్) – (అహోబలమతాధిపతియైన ఆదివణ్ శఠకోపయతినీ.

అని ఇక్కడికీవాక్య

ఖండంపరి. విడిగా వేదంబు తెనుగు గావించి సంసారఖేదంబుమాన్పిన కృష్ణమాచార్యుణ్ణి, అని చెప్పి వీటికన్నిటికీ 'తలంచి అంజలిగావించి' అని ముందరిక్రియతో ఏకాన్వయంచెప్పాలి. నమ్మాళ్వారుల్లాంటి ఆదివణ్ శఠకోపయతినీ, తెనుగు వేదం పలికిన కృష్ణమాచార్యుల్ని తిరువెంగళనాథుడు స్తుతించేడు. అంతకు ముందే 'ఆళువారలను' విడిగా ప్రస్తుతించేడు. అయితే ఇక్కడ విమర్శకులకు మరో శంక కలిగి ఉండవచ్చు. వేదంబు తెనుగు గావించిన అంటున్నాడుగదా, ఎందులోనో ఉన్నదాన్నిగదా తెనుగు గావించటం. అంచేత శఠకోపమౌని వేదాన్ని కృష్ణమాచార్యులు తెనుగు గావించేడని శంకాపరిహారం చేసుకొని ఉంటారు వారు. అట్లావారుభావిస్తే శఠకోపమునిలాంటి శఠకోపమౌని యొక్క వేదాన్నితెనుగు జేసినవాడు కృష్ణమాచార్యులు అని అర్థం లభిస్తుంది. అప్పుడు ఉపమేయ శఠకోపు లెవరు ? ఉపమాన శఠకోపు లెవరు ? అన్న ప్రశ్నలు బయల్దేరతాయి. ఉపమాన శఠకోపులు ప్రాక్కాలికులు, ఉపమేయుల కంటె మహత్తరులూ కావాలిగద! ఉపమాన శఠకోపుల్ని ఎట్లాగూనమ్మాళ్వారులనీ ఉపమేయ శఠకోపుల్ని ఇప్పుడేనా ఉపమాన భిన్నంగా వ్యక్త్యంతరంగా కడకు ఆదివణ్ శఠకోపయతిగా అంగీకరించక తప్పదు. ఈ ఆదివణ్ శఠకోపయతికి వేదకర్తగా ప్రామాణ్యంకాని ప్రచారంకాని లేకపోవటమేకాదు - ఈయన మన కృష్ణమాచార్యులకు రమారమి రెండు శతాబ్దాలు అర్వాక్కాలికుడు. ముందు పుట్టబోయే శఠకోపులు వ్రాయబోయేవేదాన్ని కృష్ణమాచార్యులు ముందే తెనుగు చేసేరంటారా, వార్ని ఆ శఠకోపులే వంచాలి. ఇక్కడ శఠకోపౌపమ్యంలో సంబంధార్థం గ్రహించాలి. తిరువెంగళనాథుడే చక్కగా దీన్ని ధ్వనించేడు. ఈ ధ్వనిమనవారు వినలేదు. ఉపమాన శఠకోపుల్ని శఠకోప 'ముని' అనీ, ఉపమేయ శఠకోపుల్ని శఠకోప 'మౌని' అనీ అభివర్ణించేరాయన. అంటే నమ్మాళ్వారుల్ని మునిఅనీ వణ్‌శఠకోపుల్ని మౌని అనీ పేర్కొన్నాడన్నమాట. మౌని లోని తద్ధితార్థాన్ని ఇక్కడ విశేష దృష్టితో చూడాలి. మునిభావం మౌనం-అదికలవాడు మౌని ఇక్కడ మౌనంశఠకోపసంబంధం. అది గలవాడు శఠకోపమౌని. అంటే

నమ్మాళ్వారుల సంబంధం గలిగి ఆయనలాంటివాడే అయినవాడు వణ్ శఠకోపయతి అని సారస్యం. శ్రీవైష్ణవ భాగవతులందరూ తాము ఆళ్వారుల సంబంధుల మని చెప్పుకొంటారు. ఆ సంబంధంలోనే ఉంది వారి ఘనత. వణ్ శఠకోపయతి కూడా ఆళ్వారుల సంబంధం కలవారు అని యిక్కడిధ్వని. అయితే ఇంకా 'వేదంబు తెనుగు గావించిన అన్నప్పుడు 'మూలాధారి' ప్రశ్న అలాగే ఉంటుంది మన విమర్శకులకు. సంస్కృత వేదమే తెనుగు గావించిన అని సమాధానం యిక్కడ. ఈ తెనుగు గావించిటంకూడా 'నమ్మాళ్వారుల' 'వేదంతమిళ్ శెయ్ద' లాంటిదే. దీని సంగతి యింతకు ముందే విన్నవించేను. ఈ సంప్రదాయంతెలిస్తేకాని యీ అన్వయం నిర్వహించటం కుదరదు. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంవారు క్యాటలాగులో శఠకోప విన్నపాలకు సూచికవ్రాస్తూ తమిళానికిది అనువాదమనే భ్రాంతిని ప్రకటించుకొన్నారు. ఆ భ్రాంతి విలసిత వాక్యాలే పై దురన్వయానికి మన విమర్శకుల్ని ప్రోత్సహించేయి. ఇక పోతే శఠకోప విన్నపాలను గురించి.

## శఠకోప విన్నపాలు తెలుగు వేదం కాదు

మద్రాసులో ఉన్న శఠకోప విన్నపములు రెండురకాలు. ఒకట సమగ్రం. రెండోది అసమగ్రం. అసమగ్రప్రతినే తమిళానువాదంగా భాండాగారంవారూ, వార్నను సరించి విమర్శకులూ భావించేరు. ఇందులో ఉన్నది ఒక్క వచనమే. మిగిలినవి మరిదొరక లేదు. తమిళానికి దిఅనువాదం అన్న ఊహ 'శఠకోప విన్నపములు' అన్న పేరు వల్ల వీరికి వచ్చింది. మరో 'శఠకోప విన్నపాలు'న్నాయి. ఇవి సమగ్రం. నామసామ్యం రెండింటికీ ఉంది. అవీ తమిళానికి అనువాదంకావు. మరి యీ అసమగ్రప్రతిలోని కేవల విష్ణుప్రశంసాత్మకమైన ఒక్క వచనాన్నిపట్టుకొని 'చూడని తమిళాని'కిది అనువాద మని ఎల్లా ఊహించేరో ఊహాకందనిది. అసమగ్రమై "నమోనమోలక్ష్మీ వల్లభా" అని (మకుటం) చివరకల శఠకోప విన్నపాలు (అందులోఉన్నది ఒక్కవిన్నపమే!) శఠకోపముని ద్రావిడ వేదానికి కృష్ణమాచార్యుల తెలుగు చేత కావచ్చునని శ్రీనిడుదవోలు ప్రభృతుల భావన. ఈ భావనతోనే చిన్నన్న ద్విపదపంక్తుల్ని అపార్థం చేసుకొన్నారు కూడాను.

# శఠకోపుల తమిళవేదం శఠకోప విన్నపాలకు మాతృక కాదు

శఠకోపముని ద్రావిడ వేద స్వరూపస్వభావాలు వేరు. ఈ విన్నపం తీరు వేఱూను. నామ సంకీర్తనం, శరణాగతి, నైచ్యానుసంధానం తప్ప ఇందులో అనుస్యూత వస్తువులేదు. ఇదే కాదు ఏ విన్నపాలూ, వచనాలూ అయినా ఇంతే. అనుస్యూత వస్తుసూత్రం అందులో ఉండదు. ఇవి కొంత వఱకూ గీతకధర్మాల్నీ ముక్తక లక్షణాల్నీ కలిగి ఉంటాయి. శ్రీశఠకోపుల తమిళవేదమని ప్రశస్తమైన "తిరువాయిమొళి"కి ఒక రచనా ప్రణాళిక, వస్తుగాంభీర్యవైవిధ్యాలూ ఉన్నాయి. ఆయన వాఙ్మయం అంతటా అంతర్వాహినిగా మధుర భక్తిస్రవంతి ప్రవహిస్తూంటుంది. భగవంతుణ్ణి నాయకుడుగాను, కవి తనను నాయికగానూ భావించుకొని అక్కడక్కడ ఆ పారవశ్యంతోనే దూతీ, సఖీ, దుహితృమాత్రాది భూమికల్ని భావించుకొంటూ దివ్యభావ కమనీయ మహనీయంగా వెలయించిన కావ్యంఅది. ఆ గాంభీర్యంవేఱు, ఆ సారస్యం వేఱు. ఆ చమత్కారం వేఱు, ఆ రామణీయకంవేఱు, ఆ శిల్పం వేఱు, ఆ భక్తిమాధుర్యమే వేఱు. అది అదే! అది ఇంకోటికాదు! దానిలా ఇంకోటిలేదు. రాదు. ఇట్లాంటి శఠకోప వాఙ్మయానికి ఈ 'మచ్చుతునక' విన్నపం అనువాదమేకాదు, ఛాయామాత్రానుసరణంకూడా కాదు! కృష్ణమాచార్యుల సింహగిరి నరహరి వచనాల ప్రభావంవల్ల ఆవిర్భవించిన వైష్ణవ పరమైన 'విన్నపముల'లో ఒకటి అది. దానికి శఠకోపవిన్నపములు అన్న పేరు పొరపాటున వచ్చిఉండవచ్చు. రెండవ శఠకోప విన్నపాలను పట్టి రావచ్చు. ఒక శఠకోపనాముడైన అర్వాక్కాలికుడు వ్రాసుకొన్నందువల్ల రావచ్చు.

## ముద్రిత శఠకోప విన్నపాలు

కృష్ణమాచార్య వచనాలు తెలుగులో ప్రచారంలోకి వచ్చేక తమగురువునో ఇష్టదైవాన్నో ప్రశంసిస్తూ వచనాలు, విన్నపాలు వ్రాయటం తెలుగులో శ్రీవైష్ణవ సంప్రదాయంలో పరిపాటి అయింది. ఇట్లాంటివే రెండో (సమగ్ర) శఠకోప విన్నపములు.' వీటి రచయితా కృష్ణమాచార్యులే. అయితే మన కృష్ణమాచార్యులు కాదు. ఆయన దీవికృష్ణమాచార్యులు!

కృష్ణా జిల్లాలోని శ్రీకాకుళంలో నివసించే తిరుమల బుక్కపట్టణం వంశ్యు డైన,(బహుశః) శఠకోపాఖ్యులైన తమ ఆచార్యులను ప్రశంసిస్తూ ఆయన చేసిన విన్నపాలివి. మన కృష్ణమాచార్యులకు చాలా అర్వాక్కాలికుడా యనఅని ఆ విన్నపాలే అంతరంగ సాక్ష్యం పలుకుతున్నాయి. ఇది 102 విన్నపాలు ముద్రితాలుకూడాను. శ్రీకాకుళంలో తమ ఆచార్యుల పరివారం లోని కొందర్ని ఈయన పేర్కొన్నాడు. దీనివల్ల కొన్ని చారిత్ర కాంశాలు తెలుస్తాయి. ఈయన పేర్కొన్న కొన్ని "సత్సంప్రదాయ" విషయాలవల్ల కూడా సంప్రదాయ చరిత్ర కొంత తెలుస్తుంది. ఈ విన్నపాలలో కృష్ణమా చార్యుల ప్రభావం స్పష్టంగా కనపడుతుంది. ఈ శఠకోపవిన్నపాల రచయిత ఒక కృష్ణమాచార్యులు కావటంతో, మొదటి (అసమగ్ర) శఠకోప విన్నపాలు అజ్ఞాత కర్తృకాలు కావటంతో, అవీ కృష్ణమాచార్య ప్రణీతాలనే అనుమానానికివచ్చి శఠకోప సన్నికర్షతో కృష్ణమాచార్యుల తెనుగువేదం సహపఠితం కావటంతో శఠకోపముని తమిళ వేదాన్ని కృష్ణమాచార్యులు తెనుగు చేసేరనే భ్రాంతికి పలువురు వచ్చేరు. కాని అది సరికాదు. కృష్ణమా చార్యుల ప్రభావంతో తెలుగులో వచ్చిన రచనలు అవి. వాటి కర్తృత్వంతో కృష్ణమాచార్యులకెలాంటి సంబంధమూ లేదు.

## ప్రచ్ఛన్న సింహగిరి వచనాలు

కృష్ణమాచార్య వాఙ్మయం మహత్తరం, బృహత్తరం కావటంవల్ల ఆయన వచనాలు ఏ ఒక్కరూ సమగ్రంగా వ్రాసుకోవటం సాధ్యంకాదు. అంచెత ఎవరికి లభించినంత వఱకూ, శక్తి చాలినంత వఱకూ, వారు వ్రాసు కొని ఉంటారు. ఇవి వ్యావహారిక శైలీవిలసితాలూ, ఛందో బంధ విరహి తాలూ కావటంవల్ల కానురాను కొన్ని చేర్పులూ మార్పులూ కూడా కొందరు చేస్తూవచ్చి ఉంటారు. దీనివల్ల కృష్ణమాచార్య వచనాలు కొన్ని మఱుగున పడిపోవటం, మరికొన్ని రూపాంతరితాలై ఇతర కర్తృకాలుగా ప్రచారంలోకి రావటం జరిగింది. ఈ దుర్గతి[illegible] నుంచీ [illegible] మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో "[illegible] మహాత్మ్యము"

అనేపేరుతో సమగ్రంగా ఉన్న వచన గ్రంథం ఒకటి ఉన్నట్లు క్యాటలాగు వల్ల తెలుస్తోంది. వచన సంఖ్య తెలియదు. కృష్ణమాచార్య వచనలక్షణాలు ఇందులో ఉన్నాయి.–దేవా అని ప్రారంభ సంబోధన' నమోనమో శ్రీవేంకటేశ్వరా నమస్తే నమస్తేనమః' అని తుదివాక్యం. శ్రీ వేంకటేశ్వరా ! అన్నది మకుటం కావచ్చును.

క్యాటలాగులో ఉదాహృతమైన వచనం :—

మొదలు. "దేవా ! మీ దివ్యతేజస్సు సూర్యుండెఱుంగు. మీ భుజబలంబు కోదండంబెఱుంగు. మీ మహిమ విశ్వామిత్రుండెఱుంగు. మీ వదనంబు వశిష్ఠ వాల్మీకాదు లెఱుంగుచురు."

తుది. "నీ భక్తులైనవారికి అటుమీదట మీరున్న వైకుంఠంబు గలుగ జేతురు. గాన ఇందుకు సందేహంబులేదు, శ్రీహరి సింహగిరి నరహరి నమోనమో శ్రీ వెంకటేశ్వరా నమస్తే నమస్తే నమః"

ఆ ఎత్తుగడలోని దేవాతోపాటు ఈ ముగింపులోని "సింహగిరి" ముద్రనీ యిక్కడ గమనించాలి. ఇందులోని శైలీభావాలు రెండూ కృష్ణమాచార్యులేన్నే గోచరింపచేస్తున్నాయి. కొన్ని సింహగిరి వచనాలనే తరవాతి వేంకటేశ్వర భక్తులెవరో తమ ఇష్టదైవం పేరు చేర్చి వేంకటేశ్వర మహాత్వంగా ప్రచారం చేసి ఉంటారనే అనుమానానికి పై వచనం అవకాశం ఇస్తోంది. పుస్తకం అంతా పరిశోధిస్తే కాని వాస్తవం నిక్కచ్చిగా చెప్పలేం. కాని యీ అనుమానంతో పరిశోధన చెయ్యటం మాత్రం అవసరం. ఇదే నిజమైతే మఱికొన్ని కృష్ణమాచార్య వచనాలు వెలుగులోకి వస్తాయి. ఈ అనుమానం ప్రామాణికమే కావచ్చుననటానికి మరో ఆధారం కూడా కనబడుతోంది–

తంజావూరి సరస్వతీ మహల్ పుస్తక భాండాగారంలో "వేంకటేశ విన్నపములు" అనేపేర అజ్ఞాత కర్తృకంగా ఒక వచన గ్రంథం ఉన్నట్లు క్యాటలాగు సూచిస్తోంది. ఇందులో కొన్ని వచనాలు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవిగా తిరుపతివారి ప్రచురణల్లో ఉన్నాయి. కొన్ని కృష్ణమా

చార్య వచనాలు యథాతథంగా ఇందులో కలిసేయి. చివరిమకుటం మాత్రం సింహగిరి నరహరికి బదులు శ్రీ వేంకటేశ్వరా అని ఉంది. ఇవి చాలా మట్టుకు "విష్ణునామ సంకీర్తనఫలం"లో పాఠభేదాలతో ఉన్నవే. మరి కొన్ని కృష్ణమాచార్యులవేమో అనిపించే ధోరణిలో నడిచినాయి. ముద్రా భేదంతో విష్ణునామసంకీర్తనఫలం వచనాలతో ఇందులో కొన్ని యథా తథంగా సంవదించటంవల్లా, కడమవి వీటితో సహపఠితాలు కావటంతో పాటు కృష్ణమాచార్య వాఙ్మయధర్మాలు కావటంవల్లా ఇందులోనూ సింహ గిరి నరహరి వచనాలు రూపాంతరితాలై ఉన్నాయేమో అని అనుమానించ వలసి ఉంది. అటు తాళ్ళపాకవారి వచనాలతో, దొరకిన సింహగిరి వచ నాలతోనూ జాగ్రత్తగా వీట్నిపోల్చి వాస్తవంగా అందులో సింహగిరి నరహరి వచనాలెన్ని ఉన్నాయో ఉద్ధరించి చూపాలి. మొత్తానికి తెలుగులో కనీసం శ్రీవైష్ణవ పరంగా వచ్చిన వచనాలు, విన్నపాలు అన్నీ కృష్ణమా చార్య ప్రభావవిలసితాలే అనటంలో సందేహం లేదు. వేంకటేశ్వర విన్న పాలు, వచనాలు, శఠకోప విన్నపాలు, రామానుజ విన్నపాలు, యతి శేఖర విన్నపాలు ఇట్లా స్తుతివచన కావ్యాలు చాలా వచ్చేయి. వీటన్నిటా కృష్ణమాచార్యుల ప్రభావం ప్రస్ఫుటంగా కనబడుతుంది.

## ఆంధ్ర మహాకవులమీద కృష్ణమాచార్యుల ప్రభావం

ప్రస్తుతానికి మనకు తెలిసినంతవరకూ కృష్ణమాచార్యులచే ప్రభా వితుడైన మొదటి తెలుగు మహాకవి పోతనామాత్యులు కావచ్చును. కృష్ణ మాచార్యులవలెనే పోతనగారూ విష్ణుభక్తులు. ఆచార్యులవారి భక్తిలా ఉన్మత్తకం కాకపోయినా పోతన్నగారిదీ పారవశ్యభక్తే. కాకతీయుల రాజ ధాని ఓరుగంటిలోనూ,పరిసరప్రాంతాల్లోనూ కృష్ణమాచార్యుల మహత్వమూ, ఆయన సంకీర్తనవచనాలూ జనం నోట వినిఉంటారు పోతన్నగారు. ఆయన దశమస్కంద వచన భాగాలు కృష్ణమాచార్య వచన లక్షణ ప్రతిఫలకాలుగా కనిపిస్తాయి. సామాన్యంగా కృష్ణమాచార్యులు ప్రతివచ

నాస్నీ దేవా! అన్న సంబోధనతో ప్రారంభిస్తారు. మహత్వ ప్రతిపాదనమో, నామసంకీర్తనమో, పూర్వభాగవత కథాకథనమో వచన వస్తువుగా ఉంటుంది. చివఱకు నమస్కారమకుటంతో ముగుస్తుంది. ఇదీ ఆయన వచనాల సామాన్యలక్షణం. పోతన్నగారి యీ వచనాల్లోనూ ఈ లక్షణాలు - దేవా అన్నసంబుద్ధితో వచనం ప్రారంభం కావటం, అంతర్భాగం మహత్వ ప్రతిపాదకం కావటం, శరణాగతి నమస్కారాలతో వచనం ముగియటం - కనబడతాయి. ఇవి ప్రధాన గ్రంథాంతర్వర్తులు కనక మకుట సంప్రదాయం ఉండదు. వచనంలో నమస్కారం లేనప్పుడు అవ్యవహితంగా ఆ ఊపులోనే పద్యం అందుకొని అందులోనైనా నమస్కారాదిగానో, నమస్కారాంతంగానో వచనభావం పరిసమాప్తి చెయ్యటం పోతన్నగారిలో కనబడుతుంది. ఈ ఉదాహరణల్ని పరిశీలించండి.

(1) "దేవా ఇట్టి జీవాత్మ స్వరూపుడవును సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపుడవునని యెవ్వరెఱుంగుదురు .... .... .... .... అదిగావున.
'దేవా నీ చరణ ప్రసాద కణలబ్ధింగాక .... ...
... .... .... .... ఓ యీశ్వరా :"
భాగవతం దశమస్కంధం
పూర్వభాగం. 570.

(2) "దేవా సకల పురుషాంతర్యామిరూపత్వంబువలన పరమపురుషుండవయ్యును ... .... .... ఒప్పు నీకు నమస్కరించెదను."
భా. ద, పూ. 682.

(3) "దేవా నీచేతనింక( జాణూర ముష్టిక గజ కంస శంఖయవన మురనరక .... .... .... ... .... ....
... .... .... అర్జున సారథివై యనేకాక్షౌహిణీ బలంబుల వధియించెదవు, మఱియును.
'కృష్ణా : నీ వొనరించు కార్యములు లెక్కింపన్ .... ...
.... .... .... .... విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్".
భా ద, పూ. 1183.

(4) "దేవా ఏనరుండై ననేమి శ్రద్ధాగరిష్ఠచిత్తుండై నిన్ను సేవించునట్టి మహాత్ముండు విధిచోదితలంబయిన ప్రమాణబహుళ విముక్తుండై వర్తించునట్లు గావున యోగీశ్వరేశ్వరుండవై ననీ వీశితవ్యులమైన మమ్ము నిష్పాపులం జేయుమని నుతించి మఱియు నిట్లనియె" భా. ద, ఉత్తరభాగం. 1151.

(5) "దేవా నీ సచ్చరిత్రంబులు కర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు నీకుం బూజలొనర్చుచు నీ చరణారవిందంబులకు వందనంబులు సేయుచు నీదివ్య నామకీర్తనంబులు సేయుచు... ... ... ... ... ... మఱియు నిట్లనియె- 'నీకు మ్రొక్కెద కృష్ణ నిగమాంత సంవేద్య'

భా౹ ద. ఉ 1196.

## తాళ్ళపాకవారు

మొట్టమొదట తాళ్ళపాక చినతిరుమలాచార్యులు తన సంకీర్తన లక్షణంలో కృష్ణమాచార్యుల్ని పదకర్తగా ప్రశంసించేడు. ఆయన వచనాలనే కావచ్చు చూర్ణికలని పేర్కొన్నాడుకూడాను. తమతాత అన్నమయ్యగారు సంస్కృతంలో చెప్పిన సంకీర్తన లక్షణాన్ని తన తండ్రి పెద తిరుమలాచార్యులవారు వ్యాఖ్యానిస్తే తద్వ్యాఖ్యానుసారంగా తెలుగు పద్యాల్లో వ్రాస్తున్నానంటాడు చిన తిరుమలా చార్యులు. అంచేత కృష్ణమాచార్యుల్ని సంస్కృత సంకీర్తన లక్షణంలో అన్నమయ్యగారే ప్రశంసించి ఉండవచ్చునేమో. తిరువెంగళనాథుడు తెనుగు వేదప్రణేతగా ఆచార్యులవారికి అంజలిస్తాడు. ఈ స్మృతి ప్రశంసలేకాక తాళ్ళపాక వారి రచనల్లో కృష్ణమాచార్యుల ప్రభావం ప్రస్ఫుటంగా కనబడు తోంది.

"శ్రీవైష్ణవులే పరమసాధకులు
శ్రీవైష్ణవులే బ్రాహ్మణులు
హరిభక్తిలేని విద్వాంసుని కంటెను
హరికీర్తనముసేయు వతడు కులజుండు
శ్వపచుండైన నేమి ఏవర్ణుండైన నేమి
ద్విజుని కంటె నాతండు కులజుండు"

అగ్రవర్ణత్వ-శ్రీవైష్ణవాల మీద కృష్ణమాచార్యులు ప్రకటించిన యీ భావాలు అన్నమాచార్యుల పదాల్లో ఎల్లా ప్రతిబింబిస్తున్నాయో క్రింది పదాలు చిత్తగిస్తే తెలుస్తుంది.

"అణురేణు పరిపూర్ణుడైన శ్రీవల్లభుని
ప్రణుతించు వారువో బ్రాహ్మలు"
హరినామములనే సంధ్యాది విధులొనరించు
పరిపూర్ణమతులువో బ్రాహ్మలు;
హరి మంత్రవేద పారాయణులు హరిభక్తి
పరులైన వారువో బ్రాహ్మలు;
ఏవి చూచినను హరియన్నిటంగలడనుచు
భావించు వారువో బ్రాహ్మలు;

"కొంచెమును ఘనముంగనుగొనని హరిందలంచు
పంచమహా మహాపాతకుండె బ్రాహ్మణోత్తముండు॥
వేదములు చదివియును విముఖుండై హరికథల
నాదరించని సోమయాజి కంటె
ఏదియును లేనికుల హీనుండైనను విష్ణు
పాదసేవకుడువో బ్రాహ్మణోత్తముండు॥.

కోడి పుంజుల యుద్ధాన్ని వివర్ణించే వచనంలో కృష్ణమాచార్యులు స్వామిని కికురిస్తూ "ఈ కోమటి పిల్లవాణ్ణి బతికిస్తావా లేకపోతే నీగుట్టంతా బయట పెట్టేదా" అని బెదిరిస్తారు. ఆ సందర్భంలో

"దేవా మీరు శబరియెంగిలి దిన్నది చెప్పుదునా
ఆతని ప్రాణవాయువు నిచ్చెదవా"
అంటారు.

కృష్ణమాచార్యుల ఈ భావ వల్లి అన్నమయ్యగారి హృదయోద్యానంలోనాటుకొని చిగిరించి తీగలుసాగి ఏడు కొండలవాడిపై పూలజల్లులు కురిసింది-

"హరినాకులంచ మిచ్చేవు అన్నిమర్మములు చెపుదునా
దొరవంటు మొక్కనీ దాసులతోడ తుచ్ఛపునీచేత చెప్పుదునా॥

అలనాడు నీవుమైలన్న చొక్కయనంటుకొన్న సుద్దిచెప్పుదునా
గొల్లెతల వాడ చీకటిని తప్పుకోరి చేసినది చెప్పుదునా
....        ....        ....        ...        ....
....        ....        ....        ..        ....
యీడు వెట్టుకొని నీవు బోయదాని యెంగిలిదిన్నది చెప్పుదునా"

పై పంక్తుల్లో భావమేకాకుండా "ఎంగిలి దిన్నది చెప్పుదునా" అన్న ఆచార్యుల వారి వృత్తగంధి అన్నమయ్యగారి పదానికి మంజు మంజీరమే అయింది.

కృష్ణమాచార్యులుపై వచనంలోనే కోమటి పిల్లవాడెంతకూ లేవక పోవటంతో కోపంవచ్చి స్వామిని

"నీకు చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనం కాయను మాతల్లి కడవాడవా? నీవు మాకెన్నాళ్ళ ఋణస్థుడవో నీకు నేనెన్నాళ్ళ ఋణస్థుడనో" అంటారు. ఈ భావంతో పాటు

"మా తల్లి కడవాడవా" అనేది ఒక ఆభాణకమే అయి అన్నమయ్యగారిలో ఎల్లా ప్రవేశించిందో చూడండి-

"నేము ని కన్యులమా నీవుమాలో లేవా
యీమేరలనే మమ్మేలనేలు కొందుగాక॥
ధర విభీషణుండు మీ తల్లి కడవాడా
నిరతి ఘంటకర్ణుండు మీ తండ్రి కడవాడా
యిరవై ధృవుండు మీయిల్లాలి కడవాడా
శరణన్నమాటలో సరిగాచితిరి"-

అని ఆచార్యుల వారికంటె మతినాలుగాకు లెక్కువే ఛదివేరు అన్నమయ్యగారు. ఇట్లాగే ఆచార్యులవారి "విదుర నింట విందు" అన్నమయ్య గారింటా విందు లారగించేడు.

అన్నమయ్యగారి కుమారుడు పెద తిరుమలాచార్యులు తండ్రిగార్ని అనుసరించి సంకీర్తనలు వ్రాయటమేకాక కృష్ణమాచార్యుల అడుగుజాడల్లో వచనాలూ విన్నవించేరు. రచనా పద్ధతిలోనూ భావవ్యక్తీకరణంలోనూ ఆచార్యులవారి ముద్ర యీ వచనాల్లో ప్రస్ఫుటంగా కనబడుతుంది. తాళ్ల

పత్రికలు వేయించటంలో, కవితలో, మతంలో దేశితనాన్ని ఆశ్రయించటంలో, శ్రీవైష్ణవ పారమ్య ప్రకటనంలో, సంకీర్తన సంప్రదాయంలో, ఇందూ అందూ ఏమిటి అన్నిటా తాళ్ళపాకవారికి కృష్ణమాచార్యులు ఆచార్యులే.

## కృష్ణమాచార్యులకు వారసులు తాళ్ళపాకవారు

మతంలో దేశితనం అంటే—భాగవతమతం ఉత్తరాన ఉద్భవించటం లోనే స్వతంత్రత, విప్లావకత, సమత, సౌందర్యం, ఆర్తి, ఆరాధన, మొదలైన భావాలతో దేశితనంతో తేజరిల్లింది. ఆళ్వారులు దక్షిణాన్న కూడా దానికి వారసులుగా ఇన్నిలక్షణాలూ దేశిదృక్పథంతో సంతరించుకొని తమిళంలో పాశురాలు పాడేరు. ఇది విరోధ దృష్టితోనో విద్వేషదృష్టితోనో సంస్కృతంమీదా తత్సంస్కృతిమీదా చేసిన విప్లవంకాదు. మతసంస్కృతుల్ని దేశీయాలుగా సంతరించుకోవాలనే దేశిభావనతోడి తపన ఇక్కడ మనం గమనించాల్సింది. అటు వీరశైవంలోనూ ఈ లక్షణాలు కనబడు తున్నాయి. సంస్కృతం తత్సంస్కృతీ అగ్రవర్ణాలవారి, మేధావివర్గవారి కంచుకోటల్లోనే ఉండిపోవటంవల్లా విప్లావకమూ భక్తిభావభూమికా ప్రాదుర్భూతమూ, సర్వసాధారణీకరణ లక్షణ సమన్వితమూ అయిన ఈ విలక్షణ సంప్రదాయం, సంస్కృతీ, వాఙ్మయం, దేశీయతాముద్రతో సామాన్య ప్రజానీకంలోకి చొచ్చుకుపోవటానికి ఈ దేశిమార్గానుసరణం అవశ్యకర్తవ్యం అయింది. కర్తవ్యం మాత్రమేకాదు దానిలక్ష్యం కూడాఅదే. కృష్ణమాచార్యులు ఆళ్వారుల్ని, శ్రీమద్రామానుజుల్ని, శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని అనుసరించటంలో కూడా ఈ దృక్పథమే కనబడుతుంది. భాగవత సంప్రదాయానుసరణంలో ఆళ్వారులు ఎట్లాంటి స్వతంత్ర ప్రతిపత్తి నవలంబించేరో, ఆళ్వారుల్ని శ్రీమద్రామానుజుల్ని అనుసరించటంలోనూ కృష్ణమాచార్యులు అట్లాంటి స్వతంత్ర ప్రతిపత్తినే అలంబించేరు. ఆళ్వారుల వల్ల తమిళభాషవకుళామోదవాసితం అయినట్లే కృష్ణమాచార్యులవల్ల తెలుగుభాష చాంపేయ సుమపరీమళ సంభరితం కావలసింది, ఆ పరీమళాల్నాస్వాదించటానికాంధ్రులింకా నోచుకోలేదు. (లాగున్నది) — అంచేత శ్రీ వైష్ణవ సంప్రదాయంలో అనూచానంగా వస్తున్న ఈ స్వాతంత్ర్యాన్ని

దేశితనాన్ని తాళ్ళపాకవారూ కృష్ణమాచార్యులద్వారా సంగ్రహించుకొని తమ వాఙ్మయం వెలయించేరు.

తరువాతవారెవరూ కృష్ణమాచార్యుల్ని స్మరించటంకాని అనుసరించ టంకాని జరిగినట్లు కనబడదు. తాళ్ళపాకవారి వాఙ్మయం చిరకాలం అంధ కారంలో ఉండిపోయినట్లే కృష్ణమాచార్య వాఙ్మయమూ ఏళ్ళతరబడి కాలు చీకట్లలో కాలం వెళ్ళబుచ్చుతోంది. వేంకటాచల విహారశతక కర్త ఒకడు ప్రాసంగికంగా కృష్ణమాచార్యుల్ని ప్రస్తావిస్తాడు. సింహాచలంతోనూ నర సింహ స్వామి తోనూ స్నిగ్ధ సంబంధం ఉన్న గోగులపాటి కూర్మనాథకవి కూడా కృష్ణమాచార్యుల్ని స్మరించకపోవడం విస్మార్యంకాదు.

## దేవాలయాలు - కృష్ణమాచార్యులు

సింహాచలంలోనూ మరికొన్న దేవాలయాల్లోనూ కృష్ణమాచార్య సంకీర్తన వ్యవహారం ఉంది. అధ్యయనోత్సవాదుల్లో ఇతర వేదపురాణాదు లకువలె వీటికీ 'సన్నిధివిన్నపం' మర్యాదఉంది. కాని ఇక్కడ శోచనీయం ఏమిటంటే ఆ విన్నపింపబడేవి కృష్ణమాచార్య విన్నపాల్లా కనపడకపోవటం. నామమాత్రంగానే తప్ప మచ్చుకుకూడా ఇక్కడివారికవి తెలియవు. ఇందుకు కారణాలన్వేషించటంలో ఆచార్యసూక్తిముక్తావళికథవల్లా, సింహ గిరి వరహరివచనాల అంతరంగ సాక్ష్యంవల్లా ఒక రహస్యం బయటపడు తోంది. ఆచార్య శబ్దంపేరులోధరించి రాజస ప్రవృత్తితో వ్యవహరించటమే కృష్ణమాచార్య వచనాలు అగ్రవర్ణాలవారికి అగ్రాహ్యాలై 'నిత్యుల' పాలవ టానికి కారణాలుగా అచార్య సూక్తిముక్తావళి ప్రకటిస్తోంది. ఇది కొంచెం జాగ్రత్తగా పరిశీలించాలి.

## కృష్ణమాచార్యుల 'వెలి' రహస్యం

కృష్ణమాచార్యులు వర్ణవ్యవస్థ విషయంలో విప్లావక భావాలు కలవారు. ఒక్క వ్యర్ణవంవస్థలోనే కాదు చాలా సంప్రదాయాల్లో ఆయన స్వాతంత్ర్యం ప్రకటించినట్లు 'వచనాల' వల్ల తెలుస్తోంది. వీటికన్నిటికీ ఆయునికాధారం శ్రీ వైష్ణవమే. "శ్వపచోపిమహీపాల విష్ణుభక్తోద్విజాధికః"

అనేవాక్యం నాటినుండి నేటిదాకా అగ్రవర్ణాల పండితులందరూ నెలవిస్తున్నా అంతరంగశుద్ధి అంత చెప్పుకోతగ్గదికాదేమో అనిపించకమానదు. కృష్ణమాచార్యులు ఈ సూక్తిని ఆక్షరాలా నమ్మినవారు. సాని సంప్రదాయంతో పాటు నిత్యులతోడి సంపర్గం కూడా ఆయనకుండేదేమో. అయన వివాహవృత్తాంతమొకటి ఇక్కడ స్మరణీయం. కులశేఖరాళ్వారుల్లాగ ఆయన 'ఉన్మత్తభక్తుడు.' తన వివాహానికి సింహగిరిస్వామిని అనుమతి అర్థిస్తే ఆయన తానూ పెళ్ళికి వస్తానంటాడు. పెళ్ళివారింట్లో పెళ్ళికుమారుడితోపాటు స్వామివారూ "సాపాటు"కు కూర్చొన్నారు.

## చరమరహస్యం - పరమరహస్యం

తీరా కన్యాదాత లోపలికి వచ్చిచూస్తే 'అల్లుడు'గారి పక్కనున్న వ్యక్తి చరముడు! దాంతో వర్ణవ్యవస్థను సుదృఢంగా చాలా 'రిజిడ్'గా అనుసరించే ఆయన గారు అల్లుణ్ణి ఇంట్లోంచి గెంటేసి పిల్లను పంపక వెలి వేస్తాడు. ఈ చరమ రహస్యం ఒక పరమరహస్యం. ఆచార్యులవారికి పరముడు చరముడిలో కనబడ్డాడా! ఆయన మామగారికి పరముడే చరముడిగా కనబడ్డాడా? ఏమో! ఇది పరమరహస్యం! చరమరహస్యం.!! 'హరిజనుల' విషయంలో ఆచార్యులవారి యీ ఆర్ద్రితే వారూ వారి వాఙ్మయమూ 'అగ్రవర్ణాలవారికి' 'వెలి'కావటానికి కారణం కావచ్చును. కృష్ణమాచార్యుల్లాగే హరిజనుల పట్ల ఇంత ఆర్తినీ ప్రకటించిన మరొకవక్తి శ్రీవైష్ణవ సంప్రదాయంలో 'శ్రీపరస్తుపట్టర్ పిరాన్‌జియ్యర్' "వీరు సన్యాసులుగా మత ప్రచారంచేసి తృప్తిలేక దూరంగా ఉండి మీరూ మేమూ సమానులం అంటే ఏంబాగుంటుందనుకొని శిఖాయజ్ఞోపవీతాలు పరిత్యజించి హరిజనుల్లో కలిసి పోయేరట. ఇప్పటికీ, వీరి శిష్యులైన నిత్యులు పశ్చిమాంధ్రంలో ఉన్నారట" ఈ సంగతి పూజ్యులు మాఆచార్య చరణులు శ్రీమాన్ న.చ.రఘునాథాచార్య స్వామి వారునాతో అన్నారు. ఆంధ్ర దేశంలో హరిజనుల్లో 'దాసరి' సంప్రదాయంవారున్నారు. వీరు వైష్ణవులు. కృష్ణమాచార్య కటాక్షపాత్రులే మోవీరు. కృష్ణమాచార్య సంకీర్తన సంప్రదాయం వీరిలో ఇంకా అడుగంటు కూడా ఉందేమో చూసితత్పరిరక్షణకు వెంటనే పాటుపడాలి.

## కృష్ణమాచార్యుల సంకీర్తన గురువు

వరాహపురాణాంతర్గత కైశికీమాహాత్మ్యకథానాయకుడైన గాయక చండాలు నిపట్ల కృతాజ్ఞతా సూచకంగా, సంకీర్తనంలో అతని పారమ్యాన్ని పొందినతాను అతని వారిపట్ల ఆ మాత్రం ఆర్తిని కనబరచక పోవటం అకృతజ్ఞం అన్న ఉపకారస్మృతితో కృష్ణమాచార్యులు హరిజనులపట్ల వ్యవహించేరనిపిస్తోంది.-ఇట్లాంటి విప్లావక సన్నివేశాలు జీవితంలో ఉండటంవల్లా, తమిళంలోనో సంస్కృతంలోనో (మాత్రమే) స్తుతించాల్సిన స్వామిని దేశిసంప్రదాయంలో తెలుగులో ఆయన స్తుతించటంవల్లా' అగ్రవర్ణాలవారికీ, ద్రావిడాభిజాత్యసంపన్నులై ఆంధ్ర దేశంలో మతప్రచారం కోసం పీఠాలు నెలకొల్పుకొన్న బ్రాహ్మణ శ్రీవైష్ణవ కుటుంబాలవారికీ ఆయనా ఆయన వాఙ్మయమూ అంటే అనాదరభావం కలిగి ఉండవచ్చు. అంచేతనే ఇతరులతోపాటు శ్రీవైష్ణవ సాంప్రదాయికుల్లోనూ సింహగిరి వచనాలు కనబడకుండా పోయేయి.

### సింహగిరి వచనాలు - వింగడింపు

ప్రస్తుతం ముద్రిత వచనాలను విషయవైవిధ్యాన్ని బట్టి 5, 6 రకాలుగా వింగడింపవచ్చును. ఈ వింగడింపు ఎట్లా ఉన్నా అన్నిటా అంతర్వాహినిగా వైష్ణవపారమ్యం, మహత్త్వం ప్రవహిస్తూనే ఉంటుంది.

1. నామసంకీర్తన వచనాలు. వచనం అంతా సంబుద్ధులతో నిండి ఉంటుంది. ఈ సంబుద్ధులన్నీ విష్ణునామగుణ విభవ ప్రతిపాదకాలుగా విలసిల్లటం విశేషం. పైవాటిలోనే మరో అంతర్విభాగం ఉంది. ఈ సంబోధనలు రామపరంగానో కృష్ణపరంగానో ఒక క్రమపద్ధతిలో కూర్చబడి తత్తజ్జీవిత ప్రతిపాదకాలుగా ప్రస్ఫురిస్తాయి. ఇట్లా శ్రీరామాయణం, భాగవత విష్ణుపురాణాలూ ఈ వచనాల్లో కీర్తింపబడ్డాయి. ఈయన శ్రీరామాయణ వచనంలాంటిదే తరువాతివారైన శ్రీ మన్నిగమాంత దేశికుల శ్రీ రఘువీరగద్య. సంబుద్ధ్యాత్మకంగా శ్రీ రామాయణ ప్రతిపాదకం ఇది.

2. పౌరాణిక వచనాలు. సృష్టిప్రళయాదులైన వివిధ పురాణాంతర్గత విషయాలు వర్ణించి పర్యవసానంగా శ్రీమన్నారాయణ పారమ్యాన్ని ప్రతిపాదించటం వీటి ప్రయోజనం.

3. ధార్మికవచనాలు. ధర్మశాస్త్రాల్లో, గరుడపురాణాదుల్లో ఉండే జన్మాంతర కారణాలైన దానధర్మాల, పాపపుణ్యాల పరిగణనం చేస్తూ తదపేక్షయా శ్రీవైష్ణవపారమ్య ప్రతిపాదనం చెయ్యటం, సంకీర్తన మహిమాభివర్ణనం చెయ్యటం వీటి స్వభావం.

4. కథావచనాలు. ప్రావాహికాలూ, ప్రాదేశికాలూ, పారంపరీణాలూ, పౌరాణికాలూ అయిన శ్రీవైష్ణవభక్తుల కథలని చెప్పేవి. విష్ణుభక్తి మహత్వప్రతిపాదనప్రవణాలూ శ్రీ వైష్ణవ పారమ్యప్రతిపాదనపరాలూను ఇవి.

5. జీవిత వచనాలు. రచయిత జన్మవృత్తాదికాన్ని తత్తద్విశేషాలనీ సూచించేవి యివి.

6. సంప్రదాయ వచనాలు. శ్రుతి - స్మృతి - ఇతిహాస-పురాణ ప్రమాణ వాక్యాలతో శ్రీమన్నారాయణుని స్వరూప రూప-గుణ విభవ ప్రతిపాదనం చేస్తూ విశిష్టాద్వైత పద్ధతిలో శ్రీమద్రామానుజ దర్శనానుగుణంగా సంస్కృత వేదాంత సంప్రదాయ ప్రతిపాదకాలు కొన్ని;

దివ్యప్రబంధ సంప్రదాయ ధోరణిలో రహస్యత్రయాది ప్రశంసాపూర్వకంగా, ఆచార్యశేష - శ్రీపాద తీర్థమహిమాభివ్యంజకంగా శ్రీవైష్ణవులకు శిరోధార్యాలూ ఆచార్యులవారికి అర్థవాక్యాలికాలూ శ్రీ వైష్ణవ సంప్రదాయ మణిమంజూషాంతర్నిక్షిప్తాలూ అయిన శ్రీ వచనభూషణాది సంప్రదాయ గ్రంథాల్లో నిక్షిప్తాలైన పారంపరీణ భాగవతసంప్రదాయ రహస్యవిశేషాలను ప్రతిపాదిస్తూ ద్రావిడ వేదాంత సంప్రదాయ ప్రతిపాదకాలు కొన్నీ; ఇట్లా శ్రీ వైష్ణవంలో ఉభయవేదాంత ప్రతిపాదకాలు ఈ వచనాలు.

# వచనాలు - వ్యక్తిత్వం

వర్ణవ్యవస్థని ఉన్నపాళంగా పటాపంచలుచేసి కూలదోయ్యమని ఆయన కంఠోక్తిగా చెప్పకపోయినా విష్ణుభక్తి—వర్ణవ్యవస్థలమధ్య సంఘర్షణవస్తే విష్ణుభక్తివైపే ఆయన మొగ్గుతారు. ఈ క్రింది పంక్తులు గమనించండి.

1) "జాతివర్ణములతో బనిలేదు మీ భక్తుడైనఁజాలునని' శ్వపచోపి మహీపాల' అంటిరి. (26 వ వచనం)

2) దేవా! విష్ణుభక్తిలేని విద్వాంసుకంటె
హరికీర్తనము సేయు నతడెకులజుండు
శ్వపచుండైననేమి ఏ వర్ణంబైననేమి ?
ద్విజునికంటెనతండు కులజుండు
దృష్టింజూడగా విద్వజ్జన దివ్యభూషణము
సింహగిరిందలంచిన యాతండెకులజుండు" (11)

3) "దేవా మీ చరణయుగళ సేవకేకులజుండైననేమి ?" (28)

4) "దేవా మీ దివ్యనామ సంకీర్తన మెవ్వండాయెనేమి
చేయగావినియిది హీనముఇది హెచ్చు
వర్ణంబులుగావని నిషేధించినవాడు........
దేవా మీ దివ్యనామసంకీర్తన మెవ్వరునుతియించిరి.
వారెపో పరమ భాగవతులు." (44)

5) "ఏవర్ణమైననేమి మీ దివ్యనామ గుణసంగతి
గలుగజేసి మీదాసానుదాసునిగా జేయవే" (47)

6) "మీ కులగోత్రంబెన్న నేమిటికి ?" (3)

మనిషినిగా మనిషి పరిగణించటానికి, గౌరవించటానికి అతడు భగవద్దాసుడు, భాగవతదాసుడు కావటమే ప్రధాన హేతువు కాని శాస్త్రవైదుష్యం, అభిజాత్యం ఎంతమాత్రం కావంటారాయన.

1) "సంధ్యాది నిత్యకర్మానుష్ఠానంబులు దప్పకనడిపిననేమి
చతుర్వేద షట్ శాస్త్రముల్ సదివిననేమి
శతక్రతువులాచరించిననేమి
సకల ధర్మంబులు సేసిననేమి
మా సింహగిరినరహరిదాసులకు దాసులై నంగానిలేదుగతి"

2) "మీ కైంకర్యపరులకు వందనము చేయుటయే పదివేలు."

3) "మీ నామావళినుచ్చరించు భాగవతులు ధన్యాత్ములు"

4) "పురుషసూక్తంబున అభిషేకంబులుచేసి మిమ్మగానలేరు.
పురాణంబులు శాస్త్రంబులు చదివిననేమి
మీ గుణంబులు తెలియక మీ దాసుండుగాక
మిమ్మగనలేడు"

5) "మీ దాసులకెవరికైననేమి తిరుకళ్యాణము చేసిన
వారలకనంతములైన పుణ్యములు కలుగునయ్యా"

## ఆచార్యులవారి ఆంతర్యం

మతాంతర–మంత్రాంతర–సాధనాంతర–దైవతాంతర–ప్రయోజనాంతరాలని పరిత్యజించాలంటారు ఆచార్యులవారు. శ్రీమద్రామానుజ సిద్ధాంతం లాంటి సిద్ధాంతంలేదు. రహస్యత్రయంలాంటి మంత్ర(త్రయ)ం లేదు. ఆచార్యకటాక్షంకంటే మరోసాధనంలేదు. సింహగిరినరహరిని మించి దైవంలేదు. శ్రీ వైకుంఠంకంటే మరో ప్రయోజనంలేదు. ఇవి కృష్ణమాచార్యులసుదృఢభావాలు.

## మత సహనం

శ్రీవిష్ణుపారమ్యాన్నీ శ్రీ రామానుజ సిద్ధాంతాన్నీ ఎంత అభినివేశంతో అనుసరించినా ఆదర్శప్రాయమైన మతసహనం ఆయనలో గోచరిస్తుంది–

"దేవా మీభక్తుండై యుండి రుద్రభక్తుల దూషించుట
దోషంబని తెలిసియందుకు
"మద్భక్తశ్శంకరద్వేషీ మద్ద్వేషీశంకరప్రియః
తావుభౌ నరకం యాతఃయావచ్చంద్ర దివాకరౌ."
అనియెడువాక్యప్రమాణంబులు తెలిపి"

దీనివల్ల ఆయన మతసహనం అవగతం అవుతుంది. ఇంతేకాదు విష్ణుభక్తుని మహత్వాన్ని ప్రతిపాదించే ఒక కథ చెప్తారాయన అందులో — కొందఱు రుద్రభక్తులు. ఒకడే విష్ణుభక్తుడు. రుద్రభక్తులమీద ఎట్లాంటి కువిమర్శాచెయ్యకుండా చాలాజాగ్రత్తగా చిత్తశుద్ధితో కథనడిపించి విష్ణుభక్తుడి మహత్వం ప్రకటింపచేస్తారు. అతని మహత్వానికి ముగ్ధులైన రుద్రభక్తులు అతణ్ణి ఆచార్యుడుగా వరించి విష్ణుభక్తులౌతారు. ఈ చివరిఅంశంకూడా సూక్ష్మంగా ధ్వనిస్తారుగాని వాచ్యం చెయ్యరు. ఆయన మర్యాద అల్లాంటిది. రుద్రభక్తులు విష్ణుభక్తులవటంలో విష్ణుభక్తుని చిత్తశుద్ధితోడి మహత్వమూ నిశ్చయ జ్ఞానంతోడి భావశుద్ధీ కారణాలు. అంతేకాని యిందులో శివకేశవుల 'తులన' ప్రసక్తేలేదు.

## శ్రీవైష్ణవసంప్రదాయ విశేషాలు

శ్రీమద్రామానుజ సిద్ధాంతానుయాయి అయిన ఆచార్యులవారు ప్రపన్న సంప్రదాయంబాగా ఎఱిగినవారు. మేదినీసురులు, ఆచార్యులు. జననీ జనకులకంటే పెద్దలైన ప్రపన్నులకు ప్రథమస్థానం యిస్తారాయన. ఆళ్వారుల్నీ భాగవతుల్నీ, తరచు తలుచుకొంటారాయన. పదిగురాళ్వారుల నటంలో ఈయన ప్రాచీనత ప్రకటితం అవుతోంది. పదముగ్గురు భాగవతులంటారాయన, కానివారు పదునలుగురు. 'ప్రహ్లాద—నారద పరాశర' శ్లోకం ఈయనెరగందికాదు. మఱి యీ పదముగ్గురిమాట ఏట్లాగో ?. ఇక్కడ ఆయన అంతరంగం ఏమిటో తెలీదు.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆచార్య కటాక్షానికి విశేషప్రాముఖ్యం ఉంది. చాలాచోట్ల తన్మహత్వాన్ని ప్రకటిస్తారాయన.

"ఆచార్యుడనెడి హనుమంతుఁబంపి *
"మీదాసులకాచార్య కటాక్షము లేకుండుటయే హాని
పరమాచార్యులం బోలు మఱి యాచార్యులు లేరు.
"నీవేమాయాచార్యుడవనిదండము సమర్పించి కడకుజనిరి.
"సదాచార్యకటాక్షేణభజసిద్ధిం." ఆచార్యులేనరహరి
ఆచార్యకృపకు జేరనీయక
"నీవుత్తమ సాత్వికుండవు. సకలాచార్యుండవు"
"పరమాచార్య కృపచేర నేర్పులేక
ఆచార్యశేషము దొరుకక"
"మీ యాచార్యులెవ్వరు"
"మాకు పరమాచార్యులైన మహాత్ముండు
మీరు మాపరమాచార్యులై యన్నియు దెలిపితిరి
"మాకాచార్యాపచారంబులేల మోపుగట్టెదవు.
"ఆచార్య కరుణా విశేషంబువలన.
"ఆచార్య కృపాకటాక్షమువలన
"అభ్యసింపరానివి రెండు—ఆచార్య కటాక్షంబొకటి...."
"ఆ మీదట నాచార్యులకృపచేరుట"

ఈ ఆచార్య శబ్దం శ్రీ మద్రామానుజులకే వాచకం ఈయన దృష్టిలో. సామాన్యంగా గురువుల్ని ఆచార్యులనీ, వారిగురువుల్ని పరమాచార్యులనీ వ్యవహరించటం కద్దు. కాని కృష్ణమచార్యులు ఆచార్యుల్ని పరమాచార్యులంటారు. ఇందులో ఒక చమత్కారం ఉంది, "తస్మిన్ రామానుజార్యేగురురితి పదంభాతి నాన్యత్ర" అన్నట్లుగా పరములైన—శ్రేష్ఠులైన ఆచార్యులు అంటే శ్రీ మద్రామానుజులే అని భావించినవారాయన. ఇదే భావంతో" పరమాచార్యులంబోలు మఱియాచార్యులులేరు. పరమ భాగవతులం బోలు మఱి భాగవతులులేరు" అంటారు. ఇట్లా పరమాచార్యులతో స్వాచార్యులకు అభేదాధ్యవసాయం ఘటించి స్వాచార్యులు రామనుజులవంటి వారనటం మరో విశేషం. పోతకమూరి భాగవతులతోడి ప్రసంగంలో మీ

---

*"దర్శోదగ్ర దశాననేంద్రియ... హనుమత్సమాన గురుణా".... వేదాంత దేశికులు

వరమాచార్యులెవ్వరు' అంటారు. అంటే మీపాలిటి రామానుజులెవ్వరని అర్థం. అట్లాగే "మా పరమాచార్యులైన పోతకమూరి భాగవతుల కృప వలన" అంటారు. తనపాలిటి శ్రీమద్రామానుజులు పోతకమూరి భాగవతులని భావం. వార్ని వర్ణిస్తూ 'ఎంబెరుమానార్ల స్వరూపులైన స్వాములు' అనటంలో అప్రతిపత్తి ప్రకటితమౌతుంది.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రముఖస్థానం వహించిన 'రహస్య త్రయం' పలుతావుల ప్రస్తావించబడ్డది. తత్రాపి ద్వయాధికారి వైలక్షణ్యాన్ని విశేషతః ప్రబోధిస్తారు. ఇది శ్రీవైష్ణవంలో మరోమెట్టు. రహస్యత్రయం:- తిరుమంత్రం. ద్వయమంత్రం. చరమ మంత్రం.

1) "తిరుమంత్రమును విన్నపము చేసిరి"
"తిరుమంత్రాపేక్షలను"
"అష్టాక్షరీ మంత్రోపదేశము"

ఇట్లా పేర్కొనటమేకాక అష్టాక్షరీసంపుటితోనే ఒకవచనం కీర్తిస్తారు.

2) "ద్వయము బ్రహ్మజ్ఞానమూర్తిలోను, మా సింహగిరి నరహరి పదధ్యానమందును దొరకును."
"ద్వయమును పఠించిరి.
"ద్వయమునకధికారియెంతటివాడు ? .........తన్నుదానెఱుంగక దూషించు కపటాచారడాంబికపరుండు ద్వయాధికారియగునె"
"మీ దివ్యమంగళంబైన ద్వయ........"
"ఆద్వయమనవరతంబు సంధించుచు"

3) "పరమరహస్యంబునుంబోలు మఱి రహస్యంబు లేదు" "ఆ చరమార్థం బనియెడు తెప్పగట్టి."

ద్రావిడ శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని సూచించే పదాలూ, పదబంధాలూ వచనాల్లో చాలా కనబడతాయి. పరమరహస్యం. పరమనాంచారి. పెరుమాళ్ళు, తిరుమణి, తిరుచూర్ణములు. కళిగె. తిరుకల్యాణం. అడియేవి. దాసిన్. తొండందు. ప్రపత్తి. ప్రపన్నులు ఆచార్యశేషము. ఎంబెరుమానార్లు, తిరు పట్టణము. తిరుమాళిగ, తిరువడిగళ్ళు, తిరుముఖారవిందము.

ఆళ్వారులస్వరూపులు, పరమ పదము, తిరువారాధన, ఆరగింపుతళియ, తిరువాయిమొళి, తిరుమంత్రము, తిరునాళ్ళు, తిరుమేను, తిరువక్త్రిము, తిరుపతులు

## కృష్ణమాచార్యుల భాషావిశేషాలు.

వ్రాత ప్రతుల్లో కృష్ణమాచార్య వచనాలు చాలా వఱకూ వ్యావహారి కశైలిలోనే కనబడుతున్నాయి. డా॥ కులశేఖరరావుగారు వాట్ని గ్రాంధీకీకరించినట్లు తెలుస్తోంది. సింహాగిరి వచనాలున్న తామ్ర పత్రికలు బయట పడేంత వఱకూ ఈ గ్రాంధికీ కరణౌచిత్యాన్ని గురించికాని యీ వచనాల్లో భాషావిశేషాలను గురించి కాని స్పష్టంగా చెప్పటంకష్టం. కనీసం 'సింహాగిరి వచనాలు' 'కృష్ణమాచార్య సంకీర్తనము' అన్నపేర ఉన్నవీ, ఇంకా ప్రచ్ఛన్నంగా ఉన్న ఆయన వచనాలూ అన్నీబయటపడి ఏక రూపం అయిన శైలీవిన్యాసంతోడి 'కృష్ణమాచార్య వచనాలు' వెలుగులోకి వచ్చింతరువాత కాని ఆయన భాషావిశేషాలు బయటపడవు.అయినా కొన్ని విశేషాలు మనకు ప్రస్ఫుటంగా కనబడుతూనే ఉన్నాయి.

రణించు, బోడించు, తుండించు లాంటి ధాతురూపాలు విలక్షణంగా కనబడతాయి. 'ఇంద్రజిత్తు తలగుండుగండా' లాంటి దేశ్యబిరుద సమాసాలూ, విభీషణస్థాపనాచార్యా, దక్షిణసింధురాజ బంధనా దేవవేశ్యాభుజంగా వంటి సంస్కృత సమాసాలూ తత్కాలీన రాజకీయ బిరుద స్వభావాన్ని సూచిస్తున్నాయి.

తరుణాత తరువాత కూచిపూడి భాగవతాల్లోనూ ఇతరత్రానూ వినపడే అమితరవికోటితేజా-భాగవత కల్పభూజా' వంటి పదబంధాలు మొదటగా కావచ్చు ఈయన వచనాల్లో కనబడతాయి.

"విదురు వింటి విందా వంటి తెలుగు సమాసాలు దేశితనానికి ప్రతీకలు. "శ్రీపాద తీర్థ-తళియ ప్రసాదములు" వంటి సమాసం సంప్రదాయాభినివేశాన్ని సూచిస్తుంది. ద్వారవాకిళ్ళు, అర్యపెరియలు, అనేక తెలుగులు అనేకయిడుములు, అనేక చెలికత్తెలు-వంటి వైరి సమాసాలు

ఆరోజుల్లో అందునా వ్యావహారిక శైలిలో ఉన్న వచనాల్లో ఉండటం అస్వాభావికమేంకాదు.

## పరిష్కరణం - పరిష్కరణీయాలు

డా॥ కులశేఖరరావుగారు వచనాల వ్యావహారిక స్వరూపాన్ని గ్రాంధికీకరించటంతో పాటు అనన్వితాలూ అపపాఠాలూ అని తామభావించిన వాట్నిచాలా ఓపికతో సావధానంగా పరిష్కరించేరు. ఇందుకు వారెంతేనా అభినందనీయులు.అయినా పరిష్కరణీయాలు ఇంకా కనబడుతూనే ఉన్నాయి. ఈ ముద్రణంలో మరి కొంత పరిష్కరణం సంప్రదాయానుగుణంగా నేను చేసేను.

మచ్చుకు కొన్ని :—

57వ వ చ న ం లో.

"కుముద కుమూధాక్షులు(?)ను" అని ఉంది. ఇక్కడ "కుముద కుముదాక్షులు" అని ఉండాలి.

30 వ వ చ న ం లో

"ఆ సింహాద్రి జగదీశ్వరుండంగ రంగ వైభోగదాయకుండు శ్రీరంగ శాయి శ్రీ పరమపదవాసుండు శ్రీ జగన్నాధుండు సింహాద్రి యప్పుడున్నివసించు తిరుపట్టణమందు" అని ఉంది. ఇక్కడ వాక్యాన్వయం ఎలా కుదిరిందో తెలీదు. సింహాద్రియప్పుడు కాదు "సింహాద్రియప్పడు" అని ఉండాలి. సింహాద్రినాధుడికి అప్ప అప్పర్(రు) అప్పడు మొదలైన పేర్లు ఉన్నాయి. కృష్ణమాచార్యులు కూడా ఇదే వచనంలో మరోచోట పౌతకమూరి భాగవతులతో' మీ మహాత్మ్యము సింహాద్రియప్పడు వినవలెను' అంటారు. ఈ అంతరంగసాక్ష్యం వినకపోవటం వల్లనే ఎక్కడో వేంకటాచల విహారశతక పద్యపాదం ఉదాహరించేరు విమర్శకులు కృష్ణమాచార్యుల సింహగిరినరహరి అప్పన్నే అనటానికి. ఇక్కడే మరో విషయం కూడా గమనించాల్సింది ఉంది. పౌతకమూరి భాగవతుల్ని పరిమూలాచార్యులవారు

"ఎంబెరుమాళ్ళస్వరూపులైన తదీయులు, నడబెరుమాళ్ళ స్వరూపులైన స్వాములు" అని వర్ణించినట్లు ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఉన్న వ్రాత ప్రతిలో ఉంది. ముద్రిత ప్రతిలో రెండు విశేషణాలకి బదులు 'ఎంబెరుమానార్ల స్వరూపులైన స్వాములు' అన్న ఒక్క విశేషణమే ఉంది. వ్రాతప్రతిలోని మొదటి విశేషణాన్నే 'ఎంబెరుమానార్లు'గా సంస్కరించి ఉంటారు రావుగారు. 'తదీయులు' రాలేదు. తదీయులంటే భాగవతులని అర్థం. ఇక రెండోది- 'నడబెరుమాళ్ళ' తెలుగు సంస్కృతికి కృష్ణమాచార్యులుకై చేసిన చూడామణి యిది. దీన్ని తొలగించేరు శ్రీరావుగారు. 'నడ(గొండ'లాంటిది యీ సమాసం. జంగమదైవ స్వరూపులని అర్థం. శైవంలోని జంగమదేవరలకు ప్రతిగా ఉన్నారు వీరని యీ విశేషణం సూచిస్తోంది దీనివల్ల ఈ పొతకమూరి భాగవతులు చాత్తాద వైష్ణవులనే ఊహకూ అవకాశం కలగకపోదు. దీనికి తోడు వారిపేర్లలో ఆచార్యశబ్దంలేకుండా అందరూ 'అయ్యలు'గానే ఉండటం ఇందుకుపష్టంభకంగానే ఉంది. అబ్రాహ్మణులపట్ల ఆచార్యులవారి అదరావి కిదిమరో ఉదాహరణ కావచ్చును. ఇంట్లాటి వాటివల్లనే పాపం ఆయనా ఆయన వాఙ్మయమూ కూడా 'వెలి' శిక్షననుభవించటం.

18 వ వచనంలో

"పరమరహస్య కారియగు పురుషాకార ప్రపన్నుని తప్పులెన్నుదురు" అని ఉంది. ఇది అకర్తృకమై అధ్యాహార్యకర్తృకం కావాలి. వాల్తేరు లిఖిత ప్రతిలో 'ద్రష్టలెన్నుదురు' అని ఉంది. ఇలా ఉంటేనే అన్వయం చక్కగా ఉంటుంది. 'ప్రపన్నుని'కి బదులు 'ప్రసన్నుని' ఉంది లిఖిత ప్రతిలో-ఇప్పుడన్వయంచూడండి-పరమరహస్యం అంటే చరమశ్లోకం- పరమరహస్యకారి చరమార్థ ప్రదాత. పురుషాకార ప్రసన్నుడు-లీలామానుష విగ్రహుడై సాక్షాత్కరించినవాడు-ద్రష్టలు ఋషులు ఎన్నుదురు-కీర్తింతురు. లీలామానుష విగ్రహుడై చరమార్థ ప్రదాత అయిన పరమేశ్వరుణ్ణి ఋషులే కీర్తించగలరు. లౌకికులు ఆయన్ని గుర్తించనేలేరు అని యిక్కడి తాత్పర్యం

19వ వచనంలో

'మీ పాదయుగళ పరిమళ మెఱిగినవారికి చందన ఘనసార పల్లవ

ములసహ్యాములు,'-అని ఉంది కృష్ణమాచార్యుల ధోరణిని బట్టియిక్కడ-పల్లవములుకు బదులు 'పరిమళములు' ఉంటే బాగుంటుంది. మరో ప్రతితో సంప్రతించి కాని నిర్ధారణ చెయ్యలేం.

20వ వచనం లో

"భాగవతులు ధన్యాత్ములు. జాయమీశ స్వరూపులు" అని ఉంది. ఇది అనన్వితం. వాల్తేరు లిఖితప్రతిలో(సం)యమీశ స్వరూపులు అని ఉంది. యోగీశ్వరులన్న అర్థంలో ఈ పూరణమే బాగుంది. లేకపోతే'జాయదీశ స్వరూపులు' కావాలి. కాని వ్రాతప్రతిలో యమీశ స్పష్టంగా కనపడుతున్నందువల్ల ఇది సంయమీశ స్వరూపులే కావచ్చును.

21వ వచనంలో

"ఈ విధంబున జగంబున(జతుర్విధరూపంబుల (?)దాల్చి" అని ఉంది. ఇక్కడ చతుర్విధ రూపాలంటే డాక్టరుగారు ఆశ్చర్యం ప్రకటించేరు. శ్రీరంగం, వేంకటాచలం, శ్రీ జగన్నాధం. సింహాచలం. ఈ నాలుగు క్షేత్రాలయందూ కృష్ణమాచార్యులకు సమాన ప్రతిపత్తి. శ్రీ పరమపదవాసుదే ఈ నాలుగు స్థలాల్లో నాలుగు రూపాలతో ఉన్నాడని అయన విశ్వాసం. మిగతా ముగ్గురితోనూ శ్రీపరమపదవాసుడితోనూ సింహాద్రినాథుడికి అభేదమే ప్రకటిస్తారాయన. "శ్రీరంగశాయి శ్రీపరమపద నివాసుండు శ్రీ జగన్నాధుండు సింహాద్రియప్పడు" అంటున్నారాయన. అంచేత 'చతుర్విధరూపంబుల' పట్ల ఆశ్చర్యం అక్కరలేదనుకొంటాను.

25వ వచనంలో

"ఆ చోరుండప్పుడాగ్రహముతో నరువదియేండ్లు మన్నంటిరత్నమున దోగినను తుమ్మదుద్దువకు" అనిఉంది. ఇది అనన్వితం. ఇక్కడ ఆధోజ్ఞాపికలో "మన్నుతో కూడిన రత్నములందు" అని అర్థము కావచ్చును" అని డా. రావుగారు సూచించేరు. కాని యిక్కడ వాల్తేరు లిఖితప్రతిలో "అరవై యేండ్ల మట్టిరత్నాన దోగిన తుమ్మదుద్దుకు" అని ఉంది. పబమలవిపరిణామాన్ని గుర్తిస్తే పంచమ్యర్థకమైన 'పట్టిగా' ఇది తేలుతుంది. మట్టి మైన (పట్టి.పైన) వంటిరూపాలు వ్యవహారంలో ఉన్నాయి. రత్నంలేక

రక్తం రత్నంగా వ్రాతలో మారే, పొరబడే అవకాశమూ లేకపోలేదు. మన్నుతోకూడిన రత్నాలలోకంటె 'అరవై ఏళ్ళబట్టీ రక్తంలో నానిన' అన్న అర్థం సరైనదేకాదు సరసమైనదీని. విప్రవధలవల్ల రక్తంలోనే దోగిఉంది ఆదుష్టు. ఇందులో మౌలికంగా రక్తప్రసక్తికే అవకాశంఉంది. దోగిన అన్నధాత్వర్థం ఇందుకే తోడ్పడుతోంది. ప్రకరణ బలంవల్లా లేఖన సంభావ్యత వల్లాధాతు సన్నికర్షవల్లా, అన్వయ సారళ్యంవల్లా, అర్థౌచిత్య సారస్యాలవల్లా కూడా ముద్రితపాఠంకంటె లిఖిత ప్రతిపాఠమే కవిహృదయం కావచ్చుననిపిస్తోంది.

26వ వచనంలో

"శ్వపచోపి మహీపాలః అంటిరి" అనిఉంది. ఇక్కడ మహీపాల శబ్దం సంబుద్ధివాచకం. విసర్గాంతంకాదు.

30వ వచనంలో

"నూటయెనుబది తిరుపతులును" అని ఉంది. ఎనుబదికాదు. "ఎనిమిది" అని ఉండాలి. ఇదేవచనంలో చివర మళ్ళీ 'నూటయెనిమిది' అనే ఉంది.

31వ వననంలో

'అగాధో ఆర్ద్రో విష్ణువనెను' అని ఉంది. ఇది బహుశః "అకారార్థో విష్ణుః" కావచ్చునేమో ! ముద్రిత పాఠం అనన్వితం. ఇది శ్రీ పరాశర భట్టార్యుల అష్టశ్లోకీ ప్రారంభవాక్యం.

39వ వచనంలో

'అపదోద్ధారకా' అని ఉంది. ఆపదుద్ధారకా అని ఉండాలి.

52వ వచనంలో

"సంకీర్తన నామోచ్చారణంబుచ్చరింప ముహూర్తము పెట్టుమనిన విప్రుడాలస్యముచేసె" అని ఉంది. లిఖితప్రతిలో 'విప్రుడాస్పెం చేసెను. అని ఉంది. ఆస్పెం అంటే హాస్యం. "హోరి! నువ్వు సంకీర్తనం చెయ్యడమేమిట్రా" అని యీ కుఱ్ఱవాణ్ణి ఆస్పెం చేసేడు. పరిహాసించేడు. ముద్రిత పాఠంకంటె ఇదేబాగుంది.

58వ వచనంలో

"నీ మహత్వంబుదెలియ బ్రహ్మరుద్రాదులును బ్రహ్లాదనారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాం రుక్మాంగద విభీషణాది పుణ్యానిమాంపరమ భాగవతులుమిమ్ము సుతియింపలేరు" అని ఉంది. ఈ తెలుగు సంస్కృతాల "ఘోరకలి" ఎట్లాట్టుగా కాని అనన్వితంగాకాని, సంస్కరణీయంగాకాని, కష్యద్దిష్టంకాకపోవచ్చునని కాని పరిష్కర్తలకు తోచినట్లు లేదు. ఇక్కడ అసలు పొరపాటు సమర్థులుకాని వ్రాయసకాండ్రది. 'ప్రహ్లాద నారద' అని కనపడగానే తమకు వచ్చిన శ్లోకమే అన్న దృష్టిపెట్టుకొన్నారుకాని ఆ శ్లోకంలోని భాగవతుల పేర్ల పట్టీలు మాత్రం గ్రహించి అంతవఱకూ అవసరం అయిన సమాసాల్నే కవియిక్కడ వాడుకొంటున్నాడన్న వివేకం వారికిలేదు. అంచేత యీ పొరపాటుజరిగింది. 'ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్య రుక్మాంగద విభీషణాది పుణ్యులైన పరమ భాగవతులు' అనిఉంటే బాగుంటుంది.

8వ వచనంలోనూ ఇట్లాంటి పొరపాటే జరిగింది.

"మత్స్యకూర్మవరాహ నారసింహ వామన రామో రామరామశ్చ బౌద్ధకల్కి దశావతారా" అనిఉంది. ఇది ఎంత అనన్వితం.! శ్లోకంలో ఉన్న పది పేర్లనూ తోరణంగా కూడా సమాసం కూర్చలేనివారా కృష్ణమాచార్యులు! ఇదీ వెనకటిలాగే 'వ్రాతగాళ్ళ' పొరపాటే కావచ్చును. ఇదే భావం 39వ వచనంలో "మత్స్యకమఠ వరాహ నారసింహమూర్తి వామన జామదగ్నిరామ దశరథరామ రామ కృష్ణ బుద్ధకల్క్యవతారా" అని ఏక సమాసంగా ప్రకటిస్తారు. అయితే సమాసం చివర యణాదేశంలో దీర్ఘం పొరపాటు. 'కల్క్యవతార' అని ఉండాలి.—ఈ దృష్టితో ప్రస్తుత ప్రతిని వీలయినంతవరకు పరిష్కరించి ముద్రిస్తున్నాం. కాని చేయవలసింది యింకా చాలాఉంది.

## సింహగిరి వచనాలు-రాగతాళానుగుణ్య మంద్రణావశ్యకత

తామ్రపత్రికల్లో రాగనిర్దేశంచేసినా తాళనిర్దేశం లేకపోవటంవల్ల తాళ్ళపాకవారి పదసంకీర్తనవిధానం తెలియకపోతోందని శ్రీమాన్ రాళ్ళపల్లి

వారు ఆవేదనపడ్డారు. అయినా సమకాలికులైన పదకర్తల బాణీలను, నాటి సంగీత రంగధోరణులనూపట్టి వారు తాళ్ళపాకవారి పదాలకు స్వరకల్పనం చేసినట్టు చెప్పినానారు. కృష్ణమాచార్యుల విషయంలో ఆమాత్రం అవకాశమూ ఉన్నట్టు కనపడ్డంలేదు. దండెయు, చిఱుతాళంబులు పూని కీర్తించినట్లు తాను చెప్పినందువల్ల ఈ వచనకీర్తనలు రాగతాళ సమన్వితాలే అయి ఉంటాయి. ప్రస్తుతానికీసంప్రదాయం మనం కోల్పోయేమనుకోకతప్పదు. తిరుమల తిరుపతిదేవస్థానంవారు ప్రకటించిన తాళ్ళపాక పెద తిరుమలాచార్యుల వైరాగ్య వచన మాలికా గీతాల్లాగ రాగభావం ప్రకటించటానికి వీలుగా కనీసం వాక్యాంతంలో ఏకతాళ పద్ధతిని తాళం కొట్టటానికి వీలుగా వింగడింపుతో ఈ వచనాలు పునర్ముద్రణం జరగాలి. ప్రస్తుత ముద్రణంలో కూడా ఈ పద్ధతి పాటించటం కుదరలేదు కారణాంతరాలవల్ల.

## వచనాల రకాలు - కొన్ని ఉదాహరణలు

ఛందోబంధ విరహితాలైనా కృష్ణమాచార్యుల వచనాల్లో పద లక్షణమూ గద్యకు మరీ ఆవశ్యకమూ అయిన తూకం కనపడుతుంది. ఈ వచనం చిత్తగించండి.—

దేవా శ్రీ రామానుజ సిద్ధాంతమునుబోలు
మఱి సిద్ధాంతము లేదు
పరమాచార్యులంబోలు
మఱియాచార్యులులేరు
పరమభాగవతులంబోలు
మఱి భాగవతులు లేరు
వారి కైంకర్య పరులంబోలు
మఱి కైంకర్యపరులులేరు
అస్మద్గురుభ్యోనమః అను మంత్రమునకు
సరి మంత్రంబు లేదు
పరమ రహస్యంబునుంబోలు
మఱి రహస్యంబు లేదు

పరమ నాంచారి బోలు
మఱి జననిలేదు
అనాధపతి స్వామి నరహరిఁబోలు
మఱి దైవంబు లేదు
స్వామీ సింహగిరినరహరీ
నమోనమోదయానిధీ !

వైరాగ్య విషయాలను ప్రతిపాదించే పట్టుల్లో ఈయన వచనాల తీరువేఱు' స్తుతిప్రశంసాపరాలైన వచనాల గమనంవేఱు, కథనపరాలైన వచనాల నడకవేఱు. అన్నీ ఏకగతిలో ఉండవు' ఈ వచనం తీరు చూడండి.

దేవా తనువులు మాయ
తలపోసి తలపోసి చెప్పెదనంటినా
కఱకఱల మోహమిది
ఆశల పాషాణంబిది
అతుకుల జల్లెడయిది
తన బ్రతుకు కొఱకు పోరాడి పోరాడి
యొరులంజెఱచెడు దుర్గంధపుదొంకయిది
నీరుబుగ్గ, ఊటచెలమ, తూంట్లబాన.
తొడరి దుర్గంధమున బొలుచును
మాటలేకాని మఱి యెందునుబసలేదు
నోటను మురికి, దంతంబులపాచి;
నాసికంబున ఊశె, నయనంబున పీశె;
చెవులోనిగులిమి, చెట్టలకొంప;
మూటగట్టుకొన్న మలమూత్రములతిత్తి
చీమునెత్తుటి జడిపురుగుల జలదారి
చిచ్చుటిరోత. [illegible] పైగల పంచారంబిది
తోలుగప్పిన [illegible]
నమ్మికలేదు నమ్మికలేదు ఇది

నాటకములాడెడు బూటకముల బొమ్మ
అమ్మమ్మా యీ బొమ్మ!
ఉత్తమ గుణములెంచిచూచెదనంటినా,..... .....
ఇట్లా సాగుతుందీవచనం.

పాటల్లో పల్లవిలాగ ఈ వచనవాక్యాల్లోనూ ఒకపల్లవిలాంటిది ఊతగా ఉంటుంది. దీనితో వచనంకూడా గేయధర్మి అవుతుంది.

"దేవా పెద్దతనంబుచేసి మిమ్ము మెప్పించెదనంటినా జాంబవంతుడు మీ సన్నిధినే యున్నాడే" అని వచనం మొదలౌతూ ప్రతివాక్యం పూర్వ ఖండం 'మిమ్ము మెప్పించెదనంటినా' అన్నదానితోనూ, ఉత్తరఖండం 'మీ సన్నిధినే యున్నాడే' అన్న దానితోనూ ముగుస్తుంది. దీనితో వచనానికి మంచిఊపు, తూకంతోపాటు తాళగతీ కుదురుతుంది.

చిక్కని చెక్కడపు పనితోడి వాక్యాలూ తాళానుగమనంతో ఎక్కడికక్కడ తెగి అటు రాగభావం ఇటు తాళగతీ రెండూ 'సమతూకం'తో సరిపడేటట్లుండేవీకొన్ని.
ఈ వచనం చూడండి.

దేవా, మీకు మొఱపెట్టి విన్నపము చేయుచున్నాడను. సంసారమోహబంధముల దగులువడితిని. కర్మానుకూలంబులంబెనగొంటిని. కాంతలమీది కోరికలు డాసెను. కామాంధకారము కన్నులగప్పెను. కర్మవారిధి గడువదయ్యెను. అపరకర్మములకు లోనైతిని.అజ్ఞానజడుండనైతిని అధమాధముండనైతిని అందని ఫలముల కట్టులు సాచితిని, దుష్టదురాచారుండనైతిని మూఢుండనైతిని. చపలుండనతిపాతకుండను."
ఈ ఉపమానాలు పరికించండి——

"కూపములో బడిన శిశువువలెంగూయుచున్నాడను,
తల్లిలేని బిడ్డవలె కలవరించుచున్నాడను,
తైలములోని మక్షికము చందంబాయెను,
ఉరిబడ్డ మెకమువలె నుపాయమెఱుంగక ఉన్నవాడను,
పసిరికకాయ పురుగువలె తేలలేక."

## "ఆధునిక వచన పద్యా"లమాతృక

అంత్యప్రాస ఘటితాలైన ఆధునిక వచన గేయాలకు మాతృకా ప్రాయమైన యీ వచనం అవలోకించండి—

అంకిలియనియెడి తెప్పలింటికి దిప్ప
అసత్య కృతమే ముప్ప
తగవు ధర్మమునడిపినదె యొప్పు
అనాధపతీ నరహరీ మిమ్ము మదలపనిదే తప్పు"

ఇంతటి మహత్త్వ బృహత్త్వాలు గల కృష్ణమాచార్యులవారిని గురించి, సింహగిరి వచనాలను గురించీ చెయ్యవలసింది, చెప్పవలసిందీ ఎంతేనా ఉంది.

రెండేళ్ళ కిందట కృష్ణమాచార్య సంకీర్తన జయింతిఉత్సవానికి సింహాచలంవచ్చిన మాన్యమిత్రులు శ్రీమాన్ కులశేఖరరావుగారు సింహాచల దేవస్థానంవారు సింహగిరి వచనాలను ముద్రించవలసిన అవసరం ఎంతో ఉందని చెప్పినమీదట అప్పుడున్న కార్యనిర్వహణాధికారి శ్రీమాన్ ఎస్. చిట్టిబాబుగారు నా పీఠికతో నేను సేకరించిన మరికొన్ని వచనాలతో గ్రంథాన్ని ముద్రింపచేయటానికి సిద్ధపడి పూర్వరంగం ఏర్పరిచినారు.

తరువాత వారి స్థానంలోవచ్చిన మాన్యమిత్రులు శ్రీమాన్ జి. వి. నరసింహమూర్తిగారు ఈ కార్యభారాన్ని స్వీకరించి నేటికి కృతకృత్యు లయినారు,

ప్రకృత ముద్రణంలో శ్రీమాన్ కులశేఖరరావుగారు ముద్రించిన వచనాలను వాల్తేరు లిఖితప్రతి సాయంతో సంప్రదాయాన్ని అనుశీలిస్తూ అవసరమయినచోట్ల పరిష్కరణం చేసేను. ఇంకా చేయవలసినవే ఎన్నో ఉన్నాయి.

తిరుపతిలోని ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంనుంచి నేను సేకరించిన వానిలో కొన్ని వచనాలను ఇందులో మొదటి అనుబంధంగా చేర్చేను. తిరుపతి ప్రతులు (1) R, 206 (2) R 1034 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వ్రాత ప్రతులనుంచి వరుసగా 1914—15, 1983—84 సంవత్స

రాలతో ఉద్ధరింపబడినవి. ఇవి రెండూ ఒకదానికొకటి ప్రత్యంతరాలు. (3) R 447-B ప్రతిలో ఒక వచనమే ఉంది. అది తులసీమాహాత్మ్య ప్రతిపాదకం. దానిలో సింహగిరి ముద్రలేదు. అంచేత దాన్ని వదలి పై రెండు పుస్తకాలలోని వచనాలనే తీసుకున్నాను. పై ప్రతులలో మొత్తం 8 వచనాలున్నాయి. మొదటివచనం ముద్రిత ప్రతిలోని 34వ వచనానికి విస్తృత రూపం కావటంచేత దీన్ని గ్రహించలేదు. నాలుగవ వచనం ముద్రితప్రతిలోని 3వ వచనాన్ని కొంతవరకూ పోలిఉండటంవల్ల దీన్ని గ్రహించలేదు. ఆరవవచనం ముద్రితప్రతిలోని 40వ వచనంతోనూ, ఎనిమిదవ వచనం ముద్రిత ప్రతిలోని 7వ వచనంతోనూ సంవదిస్తూండటంవల్లా వీట్ని తీసుకోలేదు. మొదటి అనుబంధంలో మొత్తం 4 వచనాలు చేర్చేను. ఇవి కృష్ణమాచార్య సంకీర్తనలే అనటంలో సందేహం అక్కరలేదు. వీట్ని ప్రస్తుతానికి యథాతథంగానే చూపించేను. పరమపద వర్ణనాత్మకమైన వచనం, దశావతార వృత్తాంత వచనం ఎంతగానో పరిశీలించి వివరణం వ్రాయవలసినవి. ఇందులో చివరివచనం శ్రీ ఆరుద్రగారు పేర్కొన్న వచనమే.

ఈ గ్రంథముద్రణం జరుగుతున్న సమయంలో యాదృచ్ఛికంగా కంట పడింది "సింహగిరి నరహరి వచనములు" అన్న మరో లిఖితప్రతి. తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోఉన్న దీవిప్రతి వాల్తేరు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు గ్రంథాలయంలో R1255 గా ఉంది. ఇందులో 43 వచనాలున్నాయి. వీటిలో ఆరువచనాలు 'దేవా' అన్న సంబోధనతో ప్రారంభం కావటంలేదు వచనాల చివర సింహగిరి ముద్రకూడా కొంచెం భిన్నంగానేఉంది. 'నమోనమో దయానిధీ'—అన్నది వీటిలోలేదు. 'అనాథపతి'గా కాక సింహగిరినరహరి వీటిలో 'అనాదిపతి'గా గోచరిస్తాడు. చాతుర్లక్ష ప్రసంగం వీటిలోనూ ఉంది. కృష్ణకువ్వారుస్వామి, యతివరులూ వీటిలోనూ ఉన్నారు. ఐతే ఈ వచనాలభాష కొంచెం సరళంగా మనకు దగ్గరగా కనబడుతుంది, ఇవి సింహగిరి నరహరివచనాలే. అందుకు సందేహంలేదు. వీని కర్తకూడా కృష్ణమాచార్యులే. ముద్రితవచనాలశైలితో కొంచెం విభేదిస్తున్నా మరికొన్ని వచనాలు ఇంకాబయటపడి అన్నిటిపై సమగ్రమైన పరిశోధనం

జరిగినతరువాతకాని ఒక నిర్ణయం—వీటిపై చెయ్యటం సాధ్యంకాదు, ఏమైనా ఇవీసింహగిరి వచనాలే, ఇవీ కృష్ణమాచార్య కర్తృకాలే అన్న ప్రత్యయంతో వీట్ని యథాతథంగానే ఇందులో రెండవ అనుబంధంగా చేర్చేను. సహృదయ విమర్శకులు వీటినిఆదరించి వివరాలు, విశేషాలూ వెలికితేవాలి.

సింహాచల దేవస్థానంవారు ఈ సింహగిరివచనాల ముద్రణ భారాన్ని, బాధ్యతను వహించటం ఎంతో ముదావహం. సింహాచలం వచ్చి కృష్ణమాచార్యులవారిపై ప్రసంగించి ఈ వచనాల ముద్రణకు దేవస్థానంవార్ని ప్రోత్సహించిన మాన్యులు, ఆచార్యమిత్రులు, శ్రీమాన్ కొర్లపాటి శ్రీరామమూర్తి, శ్రీమాన్ కులశేఖరరావుగారలకు ప్రణామాలు. వచనాల సేకరణలో పరిష్కరణలో ప్రూఫులు సరిచూడటంలో నాకు తోడ్పడిన నా రెండవ కుమారుడు చి. శ్రీనివాసరామానుజము(ఎం. ఏ., (సంస్కృతం:) ఎం. ఏ., (తెలుగు):)నకు ఆశీస్సులు.

కృష్ణమాచార్యులవారిపై విశేష గౌరవాదరాలుకల నాకు ఈ అవకాశాన్ని కల్పించిన శ్రీ సింహాచల దేవస్థానం వారికి కృతజ్ఞత నివేదించుకొంటూ కృష్ణమాచార్యవాఙ్మయ పరిశోధనకు విశేషావకాశాలు కల్పించ గోరుతూ ప్రస్తుతానికి సెలవు తీసుకొంటున్నాను.

విభవ—ఆషాఢ—శుక్ల. ద్వాదశి. శ్రీరామచంద్రాచార్య



# సింహగిరి వచనములు

## 1

దేవా, ఇంద్రాదిదేవతలు నూఱును, హిరణ్యగర్భులిన్నూఱును, కాశ్మీరగిరులు మున్నూఱును, తిలదాంచనగిరులు నన్నూఱును, పతివ్రత లేనూఱును, అగ్రహారంబు లాఱునూర్లును శ్రీమూర్తు లేడునూర్లును, ఉభయస్తోమకులెనిమిది నూర్లును, హేమస్త్రీగర్భంబులు తొమ్మిదినూర్లును, కపిలధేనువులు వేయిని, కాలచక్రంబులు లక్షయును, తులాపురుషంబులు కోటియును, కన్యకాదానంబులు పదికోట్లును, నివియన్నియుఁగూడిన మీ దివ్యనామసంకీర్తన వినినందులకు వేయిలో నొక్కభాగంబునకు సరి గావు, ఈ సంకీర్తన ఫలంబెవరు వ్రాసిరి, యెవరు చదివిరి, యెవరు వినిరి, వారి కాయురారోగ్యైశ్వర్యంబులు కృపచేతువు, అటుమీదట నా కిచ్చిన వైకుంఠంబు కృపచేతువు. మాయతి రామానుజ మునివరము. దాతారు. అనాథపతీ స్వామీ, సింహగిరినరహరీ, నమో నమో దయావిధీ.

## 2

దేవా, వేయిపుణ్యంబులు నేసి నరుండై జన్మించును, దేవా, రెండువేలు పాపంబులు నేసి స్త్రీయై జన్మించును. దేవా, మూఁడు వేలు పాపంబులు నేసి యంగడివేశ్యయై జన్మించును. దేవా, నాలుగువేలు పాపంబులు నేసి యొకరింటిదాసియై జన్మించును. దేవా, ఆయిదువేలు పాపంబులు నేసి యాడుచు పాడుచు నగ్నిలో దుమికెడు [illegible] జన్మించును. దేవా, ఆఱువేలు పాపంబులు నేసి సుంకరి[illegible] జన్మించును



దేవా, ఏడువేలు పాపంబులు సేసి మతచోరుండై జన్మించును. దేవా, ఎనిమిదివేలు పాపంబులు సేసి నట్టడవిలో చాఱపులియై జన్మించును. దేవా, తొమ్మిదివేలు పాపంబులు సేసి చోరుండై జన్మించి తలగొట్టఁబడును. దేవా, పదివేలు పాపంబులు సేసి పంచాంగము చెప్పెడు బ్రాహ్మణుండై జన్మించును. దేవా, పదునొకండువేలు పాపంబులు సేసి గురుద్రోహియై యంధుఁడై జన్మించును. దేవా, పండ్రెండువేలు పుణ్యంబులు సేసి శ్రీమద్భాగవతులై, శ్రీవైష్ణవులై జన్మింతురు. దేవా, ఇది కృష్ణమాచార్యులు చెప్పిన సంకీర్తనఫలంబు. ఇందుకుఁ దప్పదు. మాయతి రామానుజముని వరము. అనాథపతీ, స్వామి సింహగిరినరహరీ, నమో నమో దయానిధీ.

దేవా, మధ్యాహ్నకాలంబున జన్మించిన మనుజుండు కడుదుష్టుండై జన్మించును. దేవా, అస్తమానంబున జన్మించిన మనుజుండు క్షీణాయుష్కుం డగును. దేవా, తదుత్తరంబున జన్మించిన మనుజుండు నూతంపురోగి యగును. దేవా, ఆపిండంబును నొక్కొక్క పాపం బొక్కొక్క వ్యాధిగా సంక్రమించును. దేవా, పూర్వజన్మంబున గృహముల కగ్ని సంధించిన మనుజుండు వెనుకటి జన్మంబున కుష్ఠరోగియై జన్మించును. దేవా, జననీజనకులకన్నం బిడని మనుజుండు వెనకటి జన్మంబున గూబయై జన్మించును. దేవా, ఘనముగా గోవుల సంపాదించి వానికి మేపులు, నీళ్ళను పరామర్శింపకయున్న మనుజుండు వెనుకటి జన్మంబున పిరంగి వ్యాధివాఁడై జన్మించును. దేవా, ఘనమైన రొక్కంబు సంపాదించి తాను భుజింపక యొక్కరికి దానధర్మంబు, పరోపకారము సేయకుండినయతండు చచ్చి బ్రహ్మరాక్షసియై యాధనంబునకు కావలికాయుచుండును. దేవా, కూపంబుల పడవేసిన మనుజుండు వెనుకటి జన్మంబున భూతమై జన్మించును. దేవా, చాడిచెప్పిన మనుజుండు వెనుకటి జన్మంబున దానభ్రష్టుండగును. దేవా, తగవున కూర్చుండి పక్షపాతము లాడిన మనుజుండు వెనుకటి జన్మంబున ఒల్లియై జన్మించును. దేవా.

ధాన్యంబుమీద కడు తత్పరత్వముండెనేని వెనుకటిజన్మంబున శోణకంబై జన్మించును. దేవా. వావివరుస నెఱిఁగియెఱుఁగ నడచిన మనుజుండు వెనుకటిజన్మంబున వారకాంతయై జన్మించును. దేవా, తనపురుషుండు దైవంబని యెఱిఁగి యెఱుఁగక యెదురుమాట లాడిన కాంత వెనుకటి జన్మంబున గ్రామసూకరంబై జన్మించును. దేవా, హరికీర్తన మరోచకం బని, పరదైవతముకీర్తనము వినిన మనుజుంతు వెనుకటిజన్మంబున చెవిటి వాఁడై జన్మించును. దేవా, వివాహంబులు చెఱిచిన మనుజుండు వెనుకటిజన్మంబున సంతానంబుఁ (బొంద) లేకపోవును. దేవా, కులమున నేనే ఘనుండనని గర్వించిన మనుజుండు వెనుకటిజన్మంబున కులహీనుండై జన్మించును. దేవా, చదువుల నేనే ఘనుండనని గర్వించిన మనుజుండు వెనుకటిజన్మంబున మతిహీనుండై జన్మించును. దేవా, రణమందున నేనే పరాక్రమశాలినని గర్వించిన మనుజుండు వెనుకటిజన్మంబున వైశ్యుండై జన్మించును. దేవా, రణమందు పారిపచ్చిన మనుజుండు వెనుకటిజన్మం బున పిశాచంబై జన్మించును. దేవా, రణముపొడిచిన మనుజుండు వెనుకటి జన్మంబునరాజై జన్మించును. దేవా, రణమందు తన్నేలిన రాజుకొఱకై చచ్చిన మనుజుండు వెనుకటిజన్మంబున నారాజుకడుపుననే పుట్టి యాపట్టణం బేలును. దేవా, షోడశమహాదానంబులు హరికి పుణ్యంబని చేసిన మనుజుండు వెనుకటిజన్మంబున మోక్షమే పొందును. దేవా, తనకు పుణ్యంబని చేసిన మనుజుండు వెనుకటిజన్మంబున మాయల, నింద్రమాయల పదునారింటికి గురియై ముక్తికిం దెరువుచూడనేరడు. దేవా, మూలమంత్రమున తూలిన (మనుజుండు) తైలమందు వటపిటశాస్త్రమందణురేణువుపాటియగ్ని సంధించిన చందం బగును. దేవా, శ్రీవైష్ణవులే బ్రాహ్మణులు, శ్రీవైష్ణ వులే పరమసాధకులు, శ్రీవైష్ణవులే శోభితశుభదాయకులు, మీకులగోత్రం బెన్న నేమిటికి ? మీదాస్యంబె కాంణంబు. మీదాస్యంబె వివాహంబు. శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరినరహరీ, నమో నమో దయానిధీ !

# 4

దేవా, తనువులు మాయ, తలపోసి తలపోసి చెప్పెద నంటివా కలకలల మోహ మిది. ఆశలపాషాణం బిది. ఆతుకులజల్లెడ యిది. తన బ్రతుకుకొఱకు పోరాడి పోరాడి యొరులం జెఱచెడు దగ్గరంధపు డొంక యిది. నీరుబుగ్గ. ఊటచెలమ. తూంట్లబాన. తొడరి దుర్గంధమునఁ బొలు(చు)ను. మాటలేకాని మఱియొందును బస లేదు. నోఁటను ముఱికి. దంతంబుల పాఁచి, నాసికంబున ఊశె. నయనంబున పీశె. చెవిలోని గుల్మి చెట్టలకొంప. మూటగట్టికొన్న మలమూత్రముల తిత్తి. చీము నెత్తుటి జడి పురుగుల జలదారి. చిచ్చుటిరోత. పైత్యపుగోళ. పైఁగలపంచారం బిది. తోలుగప్పిన డొలుసు మ్మిది. నమ్మికలేదు. నమ్మిక లేదు. ఇది నాటక ములాడెడు. బూటకములబొమ్మ. అమ్మమ్మా ! ఈబొమ్మయుత్తమ (గుణము) లెంచి చూచెదనంటినా, కామియై, పామై, గ్రామసూకరమై, యెలుకయై, ఊతయై ఊతలోని మ్రానై, కత్తికోతలం, బడి, చచ్చి చచ్చి. పుట్టి పుట్టి, యీఁగయై, దోమయై, యెగిరెడు పక్షియై యనేకజీవజంతువుల యోనియందు బుట్టి, బండై, లండై, లండు పసరంబై, ఆలోనమీనై, మ్రానిమీద మర్కటంబై, వెక్కసంబు డేగయై, డేగకాలితొండయై, గండ భేరుండ గజసింహశరభ శార్దూలంబులై, రాగియై, కంచై, యినుమై, యిక్కునై, పులినోటి రాయియై, చకచకలుగాను, పకపకలుగాను, చక్కిళ్ళంబడి, చక్కని కోటయై, గుడిగోపురంబై, కారమై, వికారమై, మధువై, చేదై, యతిమధురంబై, యలసి సొలసి యంగడిసరుకై యీ వెనుక శోణకంబై జన్మించును: దేవా, యదియు విడుపై నరుండై జన్మించును. దేవా, అప్పప్ప ! ఇందో యందో యనుచు తప్పించుకపోను సందు లేక, ఎనుబదినాలుగులక్షలకోట్ల జీవజంతువుల బోనులో తగిలి, గంగలో నోడ పగిలినట్లు మహాపాతకంబునం దగిలి, కుమ్మరిసానవలె, దిమ్మదిరుగుచు, మునుంగుచు లేచుచు నీవిధంబై యున్నది, హరీ, నాథా నన్ను కావుమీ. ఈదేహం బనెడులంకపై దండు దిగి, చిత్తమనెడు నింద్ర-జిత్తుపై రణించి. దుర్బుద్ధులనెడు దుర్మార్గపురాక్షసుల హతము సేసి.

యోశలనెడు రాక్షసుల పేరడంచి, మమతమండోదరని బట్టి దాసిగా నేలి, యాచార్యుండనెడు హనుమంతునిఁ, బంపి, యాలంకఁ, జొచ్చి, సాధించి, జీవుండనెడు సీతను దెచ్చి మీపాదారవిందముల భక్తికి హత్తించి దరి చేర్పుమీ, యతి రామానుజముని వరము, దాతారు. అనాథపతీ. స్వామీ. సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

# 5

దేవా, పెద్దతనంబు చేసి మిమ్ము మెప్పించెద నంటినా, జాంబవంతుడు మీసన్నిధినే యున్నాడే. దేవా, బుద్ధిని నే మెప్పించెద నంటినా, విభీషణుండు మీ సన్నిధినే యున్నాడే. దేవా, బంటుదనంబు నేసి మిమ్ము మెప్పించెద నంటినా, యంజనాసుతుండు హనుమంతుండు మీ సన్నిధినే యున్నాడే. దేవా, తీర్థంబు లాడి మిమ్ము మెప్పించెద నంటినా, గంగా భవాని మీ యంగుష్ఠంబు నందే యుద్భవించి యున్నదే. దేవా, ప్రదక్షిణములు చేసి మిమ్ము మెప్పించెద నంటినా. సూర్యచంద్రాదులు మీసన్నిధినే యున్నారే. దేవా. వేదవేద్యుండనై మిమ్ము మెప్పించెదనంటినా, బ్రహ్మ మీ నాభి కమలమం దుద్భవించి యున్నాడే. దేవా, గీతప్రబంధముల చేత మిమ్ము మెప్పించెదనంటినా, కిన్నర కింపురుష గరుడ గంధర్వ సనక సనందన సనత్కుమార పరమ భాగవతులు, నారదాదులు మీ సన్నిధినే యున్నారే. దేవా, సత్యంబుల చేత మిమ్ము మెప్పించెదనంటినా సత్య హరిశ్చంద్రుడు మీ సన్నిధి యున్నాడే. ధనధాన్యంబుల చేత మిమ్ము మెప్పించెద నంటినా శ్రీ మహాలక్ష్మి మీ యురమందే యున్నదే. దేవా, శాంత శమదమాది గుణంబుల చేత నోర్పు గలిగి యుండెద నంటినా. భూదేవి మీ సన్నిధినే యున్నదే దేవా, విందులు వెట్టి మిమ్ము మెప్పించెద నంటినా, విదుర భరద్వాజ శబరి మొదలైనవారు మీ సన్నిధినే యున్నారే. దేవా, ఏకాదశీ వ్రతాదుల మిమ్ము మెప్పించెద నంటినా, రుక్మాంగదుండు మీ సన్నిధినే యున్నవాఁడే. దేవా, భక్తివైరాగ్యంబులఁ జేసి మిమ్ము మెప్పించెదనంటినా, ప్రహ్లాదుఁడు మీ సన్నిధినే యున్నవాఁడే. దెవా,

వాహనరూండనై భరింతు నంటినా, గరుత్మంతుండు మీ సన్నిధినే యున్నాడే. దేవా, మీ పాద పద్మంబులు నా కన్నులఁ జూచుకొని మీ ద్వారంబు కాచుక యుండెద నంటినా, ద్వారపాలకులు మీ సన్నిధినే యున్నారే. దేవా, నేనా మిమ్ము నుతించగలవాఁడను? ఎనుబదినాలుగు లక్షల కోట్ల జీవజంతువులలో నే నొక నర జీవుం డనే. దేవా, మిమ్ము వేయి శిరస్సులు, రెండువేల జిహ్వలుగల శేషాహి నుతియించి కొనియాడు కొనవలె నంతేగాక, యతిరామానుజా, అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

# 6

దేవా. పరమపదవాసా, మీ నాభికమలంబున నాదిభీకర నారాయణ బ్రహ్మ జనించెనే ఆదిభీకర నారాయణ బ్రహ్మకు కశ్యప బ్రహ్మ జనించెనే. దేవా, ఆ కశ్యప బ్రహ్మకు సూర్యుండు జన్మించెనే. దేవా, ఆ సూర్యునకు రఘువు జన్మించెనే. దేవా. ఆ రఘువునకుఁ గాకుత్సుండు జన్మించెనే. దేవా, ఆ కాకుత్సునకు మరీచి జన్మించెనే, దేవా. ఆ మరీచికి విశ్వమావు జన్మించెనే. దేవా, ఆ విశ్వమావునకు వికుక్షి జన్మించెనే. దేవా, ఆవికు క్షికి కుక్షి జన్మించెనే. దేవా, ఆ కుక్షికి భానుండు జనించెనే. దేవా, ఆ భాను నకు ననూరుండు జన్మించెనే. దేవా, ఆ యనూరునికి త్రిశంకుండు జన్మిం చెనే. దేవా, ఆ త్రిశంకునకు హరిశ్చంద్రుండు జన్మించెనే. దేవా, ఆ హరి శ్చంద్రునకు లోహితుండు జన్మించెనే, దేవా, ఆ లోహితునకు సుదంతి జన్మించెనే. దేవా, ఆ సుదంతికి దుర్వాసుండు జన్మించెనే. దేవా, ఆ దుర్వా సునకు విదురుండు జన్మించెనే. దేవా, ఆ విదురునకు చదురుణ్డు జన్మిం చెనే. దేవా, ఆ చదురునకు దిలీపుండు నాతనికి నజుండు జన్మించెనే. దేవా, ఆ యజునకు దశరథుండు జన్మించెనే. దేవా, ఆ దశరథునకు శ్రీరఘునాయకులు జన్మించెనే. దేవా, యా రఘునాయకులకుఁ గుశలవులు జన్మిచిరే. ఆ కుశలవులకుఁ గుంచభోజుండు[1] జన్మించెనే. దేవా, ఆ కుంచ భోజునకు శ్రీగోపాలుండు జన్మించెనే. దేవా. శ్రీగోపాలునకు నంద

---

[1] కుంతిభోజుండు ?

గోపాలుండు జన్మించెనే. దేవా, ఆ నందగోపాలునకు వసుదేవుండు జన్మించెనే. దేవా, ఆ వసుదేవునకు శ్రీకృష్ణుండు జన్మించెనే. దేవా, శ్రీకృష్ణునకు మన్మథుంతు జన్మించెనే. దేవా, ఆ మన్మథునకు ననిరుద్ధుండు జన్మించెనే. దేవా, ఆ యనిరుద్ధునకు వ్రతముని జన్మించెనే. దేవా, వ్రతమునికి నీ లోకమున నుండు ప్రజలు జన్మించిరే. దేవా, ఈ సంకీర్తన విను వారలకు వైకుంఠ పదవు లిచ్చి రక్షింపవే. శ్రీకృష్ణ కువ్వారు స్వామి, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

## 7

దేవా, శ్రీమన్నారాయణా, పరబ్రహ్మస్వరూపా, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా, వేద వేదాంతవేద్యా, పురాణ పురుషోత్తమా, పురందర వంద్యా, కపట నాటక సూత్రధారీ, మాయావినోదా, అగణిత మహిమావతారా, సకల కళ్యాణ గుణోన్నతా, సకల జగదంతర్యామీ, ఆశ్రిత కల్పభూజా, శ్రీమదయోధ్యాపుర వరాధీశ్వరా, దశరథ రాజనందనా, కౌసల్య రత్న గర్భాకరా, సోమభువనతాగ్రజా[1] సౌమిత్ర మిత్రా, శత్రుఘ్న వశీకరా, శరణాగత వజ్రపంజరా, కారుణ్యవారాన్నిధీ, భక్తిముక్తిఫల ప్రదాయకా, శంఖచక్రగదాధరా, కోదండదీక్షాగురూ, తారాసేవితా, భక్త పరాధీనా, ఇక్ష్వాకు కులతిలకా, పక్షీంద్ర వాహనా, దేవాదిదేవా, తాటకా ప్రాణాపహారా, విశ్వామిత్ర యజ్ఞపరిపాలకా, యజ్ఞకర్తా, యజ్ఞస్వరూపా, యజ్ఞభోక్తా, 'సర్వం విష్ణుమయం జగత్త'ను శ్రుతి నికర పరివేష్టితా, అహల్యా శాపవిమోచనా, పురహర చాపఖండనా, సీతామనోహరా, పరశురామ బాహుబల్ల పరాక్రమహరణా, అయోధ్యా ప్రవేశా, కైకేయీ[విఘ్న] కల్పిత పితృవాక్య సత్య ప్రతిపాలకా, చిత్రకూటాద్రి నిలయా, కాకాసుర విదళనా, దండకారణ్య ప్రవేశా, విరాధదైత్యహరణా, సుగ్రీవానుగ్రహా, మాల్యవంత ప్రవేశా, లవణాబ్ధిగర్వ హల్ల కల్లోలా, విభీషణ స్థాపనాచార్యా దక్షిణ సింధురాజ బంధనా, సువేలాద్రి ప్రవేశా, రావణ సుగ్రీవ మల్ల యుద్ధ వీక్షణ ప్రమోదా, మహోదర మహాపార్శ్వ కంపన వజ్రదంష్ట్రి

1 భరతాగ్రజా

వజ్ర మస్తక శూలా, కుంభ నికుంభ కుంభకర్ణ కరచణ శిరఃఖండనా, మక రాక్షధూమ్రాక్ష విరూపాక్షాతికాయ మహాకాయ చండమదగర్వ సంహారా, ఇంద్రజిత్తు తలగుంతు గండా, రావణ గిరివజ్రాయుధా, పంక్తి కంధర శిరఃపంక్తి ఖండనా, లంకా పరిపాలకా, విభీషణ రాజ్యసంస్థాపనా చార్యా, జానకీ సంయోగా, పుష్పకారూఢా, భరద్వాజ విందా, నందిగ్రామ ప్రవేశా, భరత శత్రుఘ్న లక్ష్మణ సమేతా, అయోధ్యా ప్రవేశా, పట్టాభిషేక లోక పావనా, మైథిలీసమేతా, ఆనంద జయ జయ రాఘవేశ్వరా, మాయతి రామానుజా, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 8

దేవా, మధుర నారాయణా,ద్వారవతీనిలయా, కాళింగమర్దనా, కంసాసురమర్దనా, కౌస్తుభాభరణా, శ్రీవత్సలాంఛనా, లక్ష్మీకుచ కుంకుమ పంకిల వక్షస్థలా, శ్రీయశోదానందనందనా, చాణూరమల్ల ముష్టికాసుర ధేనుకాసుర వనకుఠారా, శకటాసుర ఘోటకాసుర కుక్కుటాసుర మదభంజనా, మహా నాట్యవినోదా, మహాముని గణసేవితా, అనురూపా, (అక్షయరూపా) అక్రూర వరదా, గజేంద్ర వరదా, ప్రహ్లాదవరదా, అంబరీషవరదా, ఆపద్బాంధవా, ద్రౌపదీ మానరక్షణా, పాండవపక్షపరాయణా, విదురగృహ విమల భోజన గ్రహితా,ప్రణుత వాల్మీకిసనకనందన సనత్సుజాత సనత్కుమారా, కపిల నారదాది పరమ యోగీంద్రవందితా, రాక్షస కుల ప్రళయాంతకా, గరుడధ్వజా. కమలాసన వంద్యా, బృందావన లీలావినోదా, వేణు నాదప్రియా, శ్రీమదన గోపాలకా, అచలాచలాణురూపా, అనుపమా, అవ్యక్తగుణానందా, అభవస్వరూపా, ఆదిమధ్యాంతరహితా, అమృతాబ్ధి శయనా. అనంతశయానా, మకరకుండలాభరణా, కిరీటాలంకృతా, కనక పీతాంబర ధరా. గరుడ గంధర్వ సమస్తదివ్యయుతా, దివ్యాయుధా, దివ్యమూర్తీ, దిక్పాలకులసేవితా, ప్రలంబాసుర ఘాతకి ప్రాణనిర్హితా, గాంధారీ పుత్రమిత్ర గహనదవానలా, పరమపురుషా. పరంధామా, పరమ పావనా, కనకాసురాంతకా, [illegible] దంతవక్త్రి బకాసుర కోలాహలా, బాణాసుర బాహుఖండనా, భవరోగ వైద్యా, భయ నివారకా,షోడశసహస్ర

శ్రీమనోహరా, గోవర్ధన గిరధరా, మత్స్యకూర్మవరాహ నారసింహ వామన రామరామ రామ బౌద్ధకల్కి దశావతారా, లీలావినోదా, వేణునాదప్రియా, సర్వేశ్వరా, సర్వతోముఖా, సర్వజీవదయాపరా, విశ్వంభరా, విశ్వలోకేశా, త్రిభువనవంద్యా, త్రిగుణాత్మకా, త్రిలోకారాధ్యా, మధుకైటభా(ంబుధ) మహాప్రళయ మరుతా, సోమకాసుర హిరణ్యాక్ష హిరణ్యకశిపు నిర్ధామ ధామా, సకల దేవతామునిజన మోక్షరక్షకా, గురులఘు క్రమరూపా, కుటిల రక్ష[1] కారణరూపా, ఓంకార ప్రదీపా, అనంతనామ కీర్తనా, నాదబిందు కళాతీతా, చరణారవింద గంగోద్భవా, ధ్రువ రోమశవ్యాస మార్కండేయ గౌతమ హృదయ జగజ్జ్యోతి ప్రకాశా, జగదేకవీరా, అమిత రవికోటితేజా, భాగవత కల్ప భూజా, అజామిళ ఘంటాకర్ణ దశధ్వజాళ్వారులకు సాలోక్య, సారూప్య, సాయుజ్య సామీప్య కృపాకటాక్షా, పరమానంద భరితా, అనాథ నాథా, దేవతాసార్వభౌమా, అపరిమిత బ్రహ్మాండ రోమకూపా, దుష్టనిగ్రహా, శిష్టప్రతిపాలకా, దేవవేశ్యాభుజంగా, అభయాఽప్రమేయ కృపాంతరంగా, ఓం విశ్వంబులు సృజియించి, బ్రహ్మను అనుభవ కర్త నుండజేసి మీ రంతర్యాములై యందుల నుండుదురు. సూక్ష్మ చరాచరంబైన మీ దాసులం గాచెదరు. కరుణాజలనిధీ! భూకాంతా! లక్ష్మీ సమేతా, సురగణ వందితా, (మా) యతి రామానుజ మునివరము, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

## 9

దేవా, శ్రీరామానుజ సిద్ధాంతంబునకు దేవతాంతరమే హాని, చిత్[3] స్వరూపంబునకు కావ్యమే[4] (?) హాని, పదభక్తికి మోహ విడంబమే హాని. మనస్సునకు చలనమేహాని, వితత వ్యుత్పన్నత్వమునకు (స్వర) కళంకమే హాని. స్వామీ, సింహగిరి నరహరీ, మీ దాసుల కాచార్య కటాక్షము లేకుండుటయే హాని. ప్రాణహాని సమయ మందు భగవద్భక్తి మఱువక విష్ణుపురాణములు, హరికథలు దలంచి,

---

1) విశేష 2) ... 3) సిద్ధ 4) స్వాన్వయమే ?

యితరముఁదలంచక సంసార మోహభ్రాంతి విడిచి సింహగిరిం దలంచి పరమ పదమున కేగుమా చిత్తమా,స్వామీ సింహగిరి నరహరీ,నమో నమో దయానిధీ :

# 10

దేవా,శమ దమాది గుణంబులు గలిగిన బ్రాహ్మణుం డుత్తముండు. శమ దమాది గుణంబులు గలిగిన క్షత్రియుం డుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన వైశ్యుండుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన శూద్రుం డుత్తముండు. అతండే ముఖ్యుండు. ఎట్టి పురాణవాచనలు విన్న నేమి? సకల మెఱిఁగి యెఱుఁగక మార్గమునందు సందుగలిగి యితరముగా నాచరించెడు జంతువున కేదిగతి? అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ :

# 11

దేవా, విష్ణుభక్తి లేని విద్వాంసుని కంటె హరికీర్తనము సేయున తఁడె కులజుండు. శ్వపచుండైన నేమి? ఏ వర్ణంబైన నేమి? ద్విజునికంటె నతఁడె కులజుండు. దృష్టిం జూడగా విద్వజ్జన దివ్యభూషణము, సింహగిరిం దలంచిన యాతండె కులజుండు. సంధ్యాది నిత్యకర్మానుష్ఠానంబులు దప్పక నడిపిన నేమి? చతుర్వేద షట్ శాస్త్రముల్ సదివిన నేమి? శతక్రతువు లాచరించిన నేమి? సకల ధర్మంబులు నేసిన నేమి? మా సింహగిరి నరహరిదాసులకు దాసు లైనం గాని లేదుగతి, స్వామీ సింహగిరి నర హరీ ,నమో నమో దయానిధీ :

# 12

దేవా, నిర్గుణ వస్తువైన మీ మహాత్మ్యంబెన్న నగోచరంబు. శత బ్రహ్మ కల్పంబులు చనిన మీఁదటఁగదా రోమజునికొక్క రోమంబు ఛేదంబ గుట! ఇట్టి రోమజులు నూఱెనమండ్రు చనిన మీఁదఖఁగదా మినజునికొక్క

యహంబు గడచుట! అట్టి మీనజులు నూఱెనమండ్రు చనిన మీఁదటఁగదా, పాదమహాముని కొక్కపాదంబు విమృష్టం బగుట! అట్టి పాదమహామునులు నూఱెనమండ్రు చనిన మీఁదటఁగదా, మహాప్రళయంబగుట! అట్టిమహా ప్రళయంబులు చనిన మీఁదటఁగదా, రుద్రుండు తాండవంబు నటియించుట! అట్టిరుద్రులు చనిన మీఁదట గదా, ఏకార్ణవోదకమై వటపత్ర శయనుండై కృష్ణ కృష్ణావతార లీలలం జీఁకటియౌనఁట! అట్టి చీకటిచనిన మీఁదటగదా, యష్టభుజ నారాయణావతార మనంతకోటి రవి ప్రకాశమై వెలుఁగు చుండు నఁట! అట్టి యాదిదేవుండవు నీవఁట! అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 13

దేవా, (నిన్ను) నెఱుంగని వాని వ్రతోపవాస వర్ణాచారములు విఫలములు. జ్ఞానరహితుండైన నరుండు దా కర్మియైన నేమి ఫలము? మా సింహగిరి నరహరి నెఱుంగని వారి జ్ఞాన మజ్ఞానమగును. ఎఱుకచే మరపుచే మీ మూర్తి ధ్యాన విశేషంబునకు సోపానంబులు. ప్రథమ మన్య దేవతానిరసనము. ద్వితీయము విషయరాహిత్యము. తృతీయము భగవద్దాసుల కైంకర్యము. చతుర్థము మీ మీఁది విశ్వాసము. పంచమము సత్యము, షష్ఠ మాశానిర్ముక్తి. సప్తమము రహస్యము. పరమాణువు రాఘవభాష్య భావవిశేష సుధామృత సంజీవ నిష్ఠ పరమ విభూతి విశ్వమై జయాధికారంబు గలిగి, 'యహింసా పరమోధర్మ'యనెడు నర్థంబు దెలసి, సర్వ జీవ దయాపరుండై, చిత్తములోని జీవుండు చక్రాంకితుండై (యుండవలయు) వ్రతోపవాసంబులు నేసిన నేమి? షోడశ మహాదానంబులు నేసిన నేమి? దేహత్రయ గుణంబులు వదలక కులాభిమాన విద్యాగర్వంబులు కుదురుకొనక, యింద్రియ మోహాంధకారంబు నివారించకయున్న దేహి దుర్మతి. ద్వయము బ్రహ్మజ్ఞానమూర్తిలోను, మా సింహగిరి నరహరి పదధ్యానమందును దొరకును. అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

## 14

దేవా, 'ఆకాశాత్పతితమ్ తోయమ్, యథాగచ్ఛతిసాగరమ్' అందుల కవోహ యనియెడు జలంబు వంటియు నంటనటులుండవలెను. 'సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' అనియెడు స్మృతులుండగా దైవ తాంతర మంత్రాంతర సాధనాంతర ప్రయోజనాంతరముల భజింపనేటికి ? సంధ్యాంతమంన్న దేవుని జప సమాధ్యా నాత్మలోను బరతత్త్వము నిలిపి పరమ రహస్యమైన మార్గమున జగదీశ్వరునిం జేరి, జరా మరణాదులకు లోనుగాక జయమందరేః 'శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే'. అనియెడు స్మృతుల శివమనియెడు మంగళవ్రతములు శ్రీహరియందు సర్వపరిపూర్ణమై యుండగాను, ప్రకృతిం బొందక ప్రపన్నులైన పరమ భాగవతులం గని, 'సర్వంవిష్ణుమయంజగత్త'ని శ్రుతిస్మృతులు మెఱి పెట్టుచున్నవి. 'నారాయణా ద్బ్రహ్మ జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే' యని సర్వలోక రక్షకుండని, త్రిమూర్త్యాత్మకమని, సూత్రగుణ ధారి, యేక స్వరూపంబని, యేకైక స్థితి లయ కారణంబని, యేకమేవా ద్వితీయంబనియెడి వేదశాస్త్రపురాణంబులు సత్యస్వరూపంబులు నిలుపు చున్నవి. ఓ వేదోద్ధారా ................................* ఓంకార స్వరూపా, ఓం విశ్వరూపా, అజ్ఞానమనెడు నంధకారమును బాపి, జ్ఞానమనియెడు సులో చనములను ధరింపజేసి 'తద్విష్ణోః పరమంపదమ్మ'ను వారంలంగను గొనఁ (జేయవేః) శ్రీ రామానుజా, దాతారు, సింహగిరి. నరహరీ, నమో నమో దయానిధీ :

## 15

దేవా, మీ దివ్యజ్ఞాన మెఱుఁగువారు పరమజ్ఞానులు. పరమానంద స్వరూపులు, వైకుంఠపుర నివాసులు. వారే పరమపావనులు. కోటి యజ్ఞ కర్తలు. సర్వదర్శనంబుల, సకల శాస్త్రములఁ జదివిన ఫల మదియే.

* ఇచట నాలుగు పంక్తులస్పష్టముగా నున్నవి.

అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, మీ కైంకర్యపరులకు వందనము చేయుటయే పదివేలు. అనంతములైన ఫలములు కలుగును. ఆచార్య హీనుండై ద్విజుండు కులాచారము విడిచి యనామకురాలి వలన సుఖమంది నట్టిదే, యితర దేవతాప్రపత్తి చేసినవారు, యతి రామానుజ మునివరము దాతారు, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

## 16

దేవా, అనంతపద్మనాభ, వాసుదేవా, నారాయణా, గోవిందా, ముకుందా యనియెడు నిఱువది మూడక్షరము లెఱిఁగిన మహాత్ములు కల లోకో భూమిపైని? సర్వాంతర్యామి సాక్షియని శ్రుతి చాటుచున్నది. బ్రహ్మాండము మీ యందున్నది. 'ఏకో విష్ణుర్నారాయణః' అను నక్షరములు సహస్రముఖములై చాటుచున్నవి. యతిరామానుజ మునివరము దాతారు, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

## 17

దేవా, శ్రీరామానుజ సిద్ధాంతమును బోలు మఱి సిద్ధాంతము లేదు. పరమాచార్యులం బోలు మఱి యాచార్యులు లేరు. పరమ భాగవతులం బోలు మఱి సమోద్మదపరులు లేరు. వారి కైంకర్య పరులంబోలు మఱి కైంకర్య పరులు లేరు. "అస్మద్గురుభ్యోనమః" అను మంత్రమునకు సరి మఱి మంత్రంబు లేదు. పరను రహస్యంబునుంబోలు మఱి రహస్యంబులేదు. పరమద్వయాధికారిఁబోలు మఱి యధికారిలేడు. పరమ నాంచారి బోలు మఱి జనని లేదు. అనాథపతి స్వామి నరహరిఁ బోలు మఱి దైవంబులేదు. స్వామీ, సింహగిరి నరహరీ, నమోనమో దయానిధీ!

## 18

దేవా, పరమ రహస్యకారియగు పురుషాకార ప్రసన్నుని ద్రష్ట

లెన్నుదురు. లౌకికు లెఱుఁగరు. అజ్ఞానులై రౌరవాది నరకమునుండి సంచరించుటయే దీనికి కారణము. నరహరీ. పావనుఁడైన యగ్నిదేవ తను ముట్టినం గాలదే ? ఆ యపచారము క్షమపెట్టిసంగాని పాయదు. అఖిలాండకోటి సర్వము సర్వేశ్వరు మాయాకల్పిత మేమి చేయుదును ? నిరపరాధిని. జంతువు లఖిలాండ పూరితము లైనవి. జరామరణ వ్యాధుల చేత నక్కటా యనుచున్నవి. ఈర్ష్యతగదు. (నైర్మల్యా) స్పదము లయిన యాత్మలందు గుణావగుణములు చింతించుట యవినీతి. సర్వభూత దయావ్యపగత రాగద్వేష మత్సర శమ దమాది గుణము లెన్నండు గలు గునో ! స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 19

దేవా, మీ పాదతులసియందుఁ జవినెఱిఁగినవా రమృతాది రుచులఁ దృణీకరింతురు. దేవా, మీ పాదయుగళ పరిమళ మెఱిఁగిన వారికి, చందన ఘనసార పరిమళము లసహ్యములు. దేవా, మీసౌందర్యము దర్శించిన కన్నుల కితరములైన రూపములు చూడఁ బాపములు. దేవా, మీ యసంఖ్యాక పరిమళ కథామృతము ఘనతరముగా గ్రోలిన జను లితర కథల నెరుంగరు. దేవా, సర్వగంధా, సకల బాంధవుండవై యిటువలె నిఖిలేంద్రియ భోగ్యమై రక్షింపవే. స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 20

దేవా, అంతట నంధుడైన బాలుండు కులాధారుండాయెనని తన జననీజనకులు, తన బాంధవులును, గోత్రాదివరులును, సహోదరులును, పితృపితామహ ప్రపితామహులును జనుదెంచి యాశ్చర్యపడి కువ్వారుం జూచి యప్పుడిట్లనిరి. ఓ మహాత్మా ! యీ బాలుని భవిష్యద్వర్తనంబు లెఱింగి రక్షించి దివ్యదృష్టి నొసంగి పరమభాగవతోత్తమునిగాఁ జేసితిరని యానందబాష్పములు గురియుచు, తమ కుమారుండగు కృష్ణమాచార్యుని కౌఁగిటఁ జేర్చికొని పునఃపునరా లింగనముజేసి, యచటనున్న మహాత్ముల

గనుంగొని,ఓమహాత్ములారా,ఈబాలునికి జాతకర్మాన్నప్రాశనచౌలోపనయ నాదులైన బ్రాహ్మణకర్మములు చేయవలెననికుహ్వారు సన్నిధిని సకలముం జేసి,'ఆత్మావై పుత్రనామాసి'యన్న శ్రుతి చాటంగాను,నావిధంబున దలంచి లౌకిక కర్మము లాచరించిరి. దేవా, యీ వ్యామోహ మేల కల్పించితివి ? దేవా, యీ చాతుర్లక్ష గ్రంథము నేవిఘ్నము చేయక నీదేర్చుము. దేవా, యాచారంబెరుంగ, అనాచారంబుగాఁ దిరుగాడు చుండుదును. జ్ఞానములేని పంచేంద్రియ వ్యవహారిని. దేవా, మీ నామావళి నుచ్చరించు భాగవతులు ధన్యాత్ములు, సంయమీశస్వరూపులు. మూఢాత్ముండైనను నిలిచి వినెనేని దేవా! దురితసమూహము లెల్లం దొలంగును. శాంతులైన మహాత్ములు వినిరేని సకల కోరికలు సిద్ధించును. సాలోక్యము కలుగును. ఏకచిత్తం బున వినువారు యమ ద్వారంబుఁ జూడక వైకుంఠంబు చేరుదురు. నమో నారాయణా. నీ ప్రభావంబున నీ పంచమవేదంబయిన యీ సంకీర్తనము నంతః కరణంబున వినువారు సాయుజ్యంబు చేరుదురు. అనంతంబులు మీ నామంబులు. తెలిసియుఁ దెలియరావు. దేవా, 'ఓం, తచ్ఛమ్ యోరావృణీ మహే, గాతుమ్ యజ్ఞాయ! గాతుంయజ్ఞపతయే!' అని పురుషసూక్తంబున నభిషేకంబులు చేసి మిమ్ము గానలేరు. పురాణంబులు, శాస్త్రంబులు చదివిన నేమి? మీ గుణంబులు తెలియక, మీ దాసుండుగాక మిమ్ము గానలేఁడు. దేవా, జననీ జనకుండవు నీవె. కులగురుండవు నీవె. ఆచార్యుండవు నీవె. ఆప్తజనబాంధవా, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

## 21

దేవా, మీరు జగదంతర్యాములై మీ గుణంబులు భూలోకంబునఁ బ్రసిద్ధిముఁజేసితిరి. దేవా ఈ లోకంబున, శేషాచలంబున వేంకటనామ ధేయుండ వైతివి. ధనాపేక్షపరుండవై విహరించితివి. భోగంబునకు పురు షోత్తముండవై జగత్తు (లకు) నాథుండవై మహాభోగంబు లారగించితివి. దేవా, లోకంబులోని ధర్మాధర్మంబులకుఁ బరమ భాగవతోత్తములపాలికి సింహాచలంబునఁ నిలిచితివి. దేవా, భూలోకంబున వైకుంఠంబును నుభయ

కావేరీమధ్యంబుననుఁ, విభీషణవరదుండవై, శ్రీరంగశాయి వైతివి. ఈ విధంబున జగంబునఁ జతుర్విధ రూపంబులఁ దాల్చి విహరించు చున్నాఁడవు. మీ మహిమ పరబ్రహ్మమని తెలిసితిని. నాభయంబు లడంగెను. అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 22

దేవా, విశ్వంభరా, విశ్వపతీ, విశ్వమయా, విశ్వరూపా, విశ్వాత్మకా, విశ్వజనకా, శాశ్వతైశ్వర్యా, కలావతంసా, త్రిమూర్తీ, మత్స్య కచ్ఛప వరాహ నరమృగ విప్ర భూపతిరామ రామ కృష్ణ బౌద్ధతురగ సమారంభ సహస్ర లీలావిలాసా. అనంతనామా. స్తోత్రాతీతా. దైవదాస ప్రియ ధర్మోపదేశా. నిర్మలతీర్థస్వరూపా. దుర్మద దానవ విదారణా. భాను కోటి ప్రకాశా. పరమపదనివాసా. భాసుర సముద్రప్రపూర్ణా. సకలభువనాధ్యక్షా. నిత్యస్వరూపా. సత్యవాక్య స్థాపనాచార్యా. శరణు శరణు, సింహగిరి నరహరీ. నమో నమో దయానిధీ!

# 23

దేవా, శ్రీమన్నారాయణా. పరబ్రహ్మస్వరూపా. అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకా. వేదవేదాంతవేద్యా. చతుర్దశభువనాధీశ్వరా. పురాణ పురుషోత్తమా. పుండరీకాక్షా, పురందరవంద్యా. సకల కళ్యాణ గుణోన్నతా. పక్షీంద్రవాహనా. శంఖ చక్ర గదా శార్ఙ్గ ఖడ్గాద్యనేక దివ్యాయుధధరా. మత్స్యకూర్మ వరాహ నారసింహ వామన పరశురామ శ్రీరామ రామకృష్ణ బుద్ధ కల్కి సర్వేశ్వరా. సర్వాంతర్యామీ. సకలభూతాత్మకా. సనామాంతకా. సంసారాంతకా. ప్రేతమస్తక ప్రతాపా. (?) చాణూర మల్ల యుద్ధకారీ. రాక్షసగిరి వజ్రాయుధా. కుక్కుటాసుర బకాసుర శకట ధేనుకాసుర విదళనా. భూతకీ ప్రాణాపహారా. శ్రీలక్ష్మీకుచ కుంకుమాంకితా, గోపీ జన ప్రియా,గోవర్ధనగిరిధరా, వేణునాదవినోదా, శిశుపాల శిరశ్ఛేదనా. కాళియ

మర్దనా. కౌస్తుభాభరణా. శరణాగత వజ్రపంజరా. యశోదానందవర్ధనా. పక్షీంద్రవరదా, ప్రహ్లాదవరదా. ధ్రువవరదా. అక్రూరవరదా. గజేంద్ర వరదా. అంబరీషవరదా. ద్రౌపదీమానాభిరక్షకా. పాండవపక్షపాతీ. అక్షయ సంపన్నా. విశాలవక్షా. పురందరవంద్యా. విదురునింటవిందా. ప్రణుత వాల్మీకి వరధ్యానా.అప్రమేయా. ఆదిమూర్తి. ఉరగశయనా. ఈషణత్రయ భువనత్రయ. భక్తిముక్తిఫలదాయకా. శ్రీ వైకుంఠనాయకా. శ్రీ రాఘ వేశ్వరా. శ్రీకృష్ణకువ్వారుస్వామీ. సింహగిరి నరహరీ, నమో నమో దయానిధి !

# 24

దేవా, తొల్లి రత్నబేహారులు బావలు మఱఁదులు సముద్రతీరముసం దుండిరి. అందు కొందఱు రుద్రభక్తులు. ఒక్కఁడే మీ దాసుఁడు. అతఁ డన్నోదక తాంబూల గంధానులేపన వస్త్రములు మీకు సమర్పణసేయక తాను నొల్లండు. అధ్వానమందు విడువని వర్షముచేత సప్తదినంబులు మీ కోవెల లేకుండగాను ఉపవాసమే యుండెను. ఆ బావమఱఁదులు హాస్యము చేయఁదలఁచి, గుడారు కంబము తుండించి, యాతుండు కొంతదవ్వు కొని పోయి యచట ప్రతిష్ఠచేసి తిరుమణి తిరుచూర్ణములు పెట్టి, గంధపుష్పధూప దీపము లిచ్చి, మీదాసునికడకు వచ్చి యప్తదినంబులనుండి యెట్లుపవాస మున్నా' వవినను, మీ దాసుండేమనుచున్నాఁడు— ఈయధ్వానమందు పెరుమాళ్ళకోవెల లేకుండగాను నా కన్నపానాదులుగా'వనెను. 'మే మొక పెరుమాళ్ళకోవెల చూచి వచ్చితి' మని తాము చేసిన గుడారుకంబముఁ జూపిన మీ దాసుండు చూచి, మీ భావ మెఱింగి యీతండె భావనారాయ ణుండని దండము సమర్పించెను. తళిగ వడ్డించెను. మీకు సమర్పించి తాను ప్రసాదపడ్డ వెనుకను నా బావమఱఁదు లేమనుచున్నారు— మేము గుడారు కంబము నాటి ప్రతిష్ఠచేసి వచ్చితిమి. అది మీ పెరుమాళ్ళు కాదు. గుడారు కంబ మింతే' యని హాస్యముచేసినను నాదాసుండు తత్తరపడక 'యాతఁడు భావనారాయణుఁడు, మీరు భావముచేసి నిలిపితిరి. మీరే తిరిగితెచ్చిన నేసు చక్రహస్తుండఁ గాక పోయెద' నవిన నా సమయమున రుద్రభక్తు లువ్వొంగి

తాము స్థాపితముచేసిన గుడారుకొయ్య తిగిచి చూచినను, రాకున్నను, యోజనములోతు త్రవ్వి తిగిచి, ఖండించబోయినను, (దానిని) తాము కన్నులఁగానక, భ్రమించి, తమ గుడారమునకు వచ్చి యా దాసునితో నేమనుచున్నారు.— 'నీవు పరమాత్ముండవు. నీ హృదయమున నాతఁడు న్నాడు. మేము పోయి గుడారు కంబము దిగిచినను, దానిని నారాయణుఁడు కూర్మరూపమున మోసియున్నాఁడు. నీవే మా యాచార్యుఁడ' వని దండము సమర్పించి కడకుఁ జనిరి. సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 25

దేవా, ఒక చోరుండు బ్రాహ్మణుల కనేకహింసలు చేయుచుండెను. కొంతకాలమునకు జ్ఞానము వొడమి యాతఁడు బ్రాహ్మణ సభకుఁబోయి యనేక హింసలు చేసిన పాతకుండను. నాకు ప్రాయశ్చిత్తము జేయుఁ' డన్న బ్రాహ్మణు లేమనుచున్నారు. — నీవు తొల్లిఁ దొమ్మిదినూట తొంబదితొమ్మిది విప్రవధలు చేసిన పాతకుండవు. నీకు ప్రాయశ్చిత్తము లేదు పొ'మ్మనిన చోరుఁ డప్పుడు మహోగ్రుండై యుండి, గృహంబు వెలుపట నిలిచి తన (భార్యతో) నేమనుచున్నాఁడు. — 'నేను విప్రవధఁ జేయు తుమ్మదుడ్డు తె' మ్మనిన నప్పుడా యింతి యేమనుచున్నది. 'నీవు ... పతివి. నేను నీ పతిని, దాన మెఱుఁగవు, ధర్మ మెఱుఁగవు. మనకు ప్రాయశ్చిత్తమెట్లు కలుగును? మన మిక హింసలు మాని, మన గృహంబునం గల ధన ద్రవ్యాదులు దాన ధర్మంబులుచేసి మనము సప్త సంతానములఁ బడయుదము. అట్లుగాక ప్రాయశ్చిత్తము లే' దని యా యింతి హరుసించినను, చోరుం డంతే కానిమ్మని, 'నీవును, నేనుమ గూడు కొని బ్రాహ్మణసభయున్న స్థలమునకుఁ బోయి, యా బ్రాహ్మణు లేక్రమ మునఁ జెప్పిన నా క్రమమునఁ జేయుద'మని, యిద్దరును బ్రాహ్మణ సభ యున్న స్థలమునకుఁ బోయి దండంబువెట్టి 'మే మనేక హింసలు చేసిన పాపాత్ములము, మాకుఁ బ్రాయశ్చిత్తముఁ జేయుండనిన నా బ్రాహ్మ

ణో _త్తము లేమనుచున్నారు. — 'వినుము చోరా, నీచేత దానము పట్టరాదు. మీకుఁ బ్రాయశ్చి_త్తములేదు నీవు సహస్ర విప్రుల వధచేసినాడవు, నీచేత స_ప్తవర్షములనుండి ర_క్తమున దోగిన తుమ్మమొద్దు మూఁడుశాఖలు మొలిచిన నీకుఁ బ్రాయశ్చి_త్తము చేసెదము పొ'మ్మనిన, నా చోరుం డప్పుడాగ్రహముతో 'నరువదియేండ్లు బట్టి ర_క్తమున దోగినను తుమ్మమొద్దునకు త్రిశాఖలు మొలుచునా' యని తన యింతిఁగూడి సంభాషించి తాను విప్రవధ చేయు నరణ్యమునకుఁబోయె. దేవా, ఆ యరణ్యమందొక సుంకరి కలఁడు. అందొక శ్రీవైష్ణవుఁడు తన తిరుకల్యాణ మాప్రొద్దెయని లగ్నము నిశ్చయించుకొనిరాగా, నా సుంకరి 'శోభన ద్రవ్యాదులకు సుంకము వచ్చును, పెట్టిపొ'మ్మనిన, నా వైష్ణవుడప్పు డేమనుచున్నాఁడు,— 'ఓయీ, సుంకరీ, ఇంతకాలమునకు వివాహము గలిగినది. అంకిలిసేయకోయీ. నీకు పుణ్యముగును. లగ్నము తప్పిన వారాకన్యనీయరు.' అని మహాదైన్యపడినను, మఱియును బోనీయక ఆ సుంకరి నిర్బంధము సేయగాను, వారిద్దరి మాటలు విన్న చోరుండు దగ్గరకువచ్చి, 'ఓయీ సుంకరీ, వేయికల్లలాడి వాచాదుర్భాషలు పలికి యొక వివాహము చేయవలె'ననినను, 'నీవైష్ణవుని సుంకముపెట్టక పోనీయను. ఇందుకు నీకేమిపని? నీ వే మెఱుంగుదువు? పొ'మ్మనిన, నాచోరుండు సుంకరితల నెలగి వధచేసి యావైష్ణవుని తిరుకల్యాణమున కంపెను. అప్పుడు చేసినధర్మమున క్రితముచేసిన యధర్మములు పరిహృతమాయెను. దేవదుందుభులు మ్రోసెను. పుష్పంబులు గురిసెను. ఆ దుద్దునకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు త్రిశాఖలై మొలిచిరి. ఆశాఖ లేమనుచున్నవి — ఓం చక్రో చక్రః । ఓం అచక్రో చక్రః । జిత క్షితిపై వేదానామ్ ।' అని ఋగ్వేదమందలి పలుకులు పలుకంగాఁ జూచి యా చోరుండాశ్చర్యపడెను. ఆ సభనున్న బ్రాహ్మణ సమూహంబులును, తుమ్మదుద్దుంజూచి, యాశాఖలు వేదము పలుకఁగా విని మహాశ్చర్యపడి, యోరి చోరుఁడా,నీవు సహస్ర విప్రవధ చేసినవాఁడవు.నీ కీపుణ్య మెందువలన కలిగె'నని యడిగినను, నాతఁ 'డయ్యా, షోడశమహాదానంబులు చేసినవాఁడఁగాను. ఎద్వహింసాపరుఁడను. ఒక వైష్ణవుఁడు తిరుకల్యాణము

నకుఁబోగా, శోభన ద్రవ్యాదులకు సుంకము వెట్టుమని సుంకరి నిర్బంధము చేయగా, ( నేను ) వారిద్దరి మాటలు విని దగ్గరకుఁబోయి, 'ఓయి పుణ్యాత్మ, వేయికల్లలాడి యొకవివాహము చేయుమని రన్నను, నన్ను దుర్భాషలాడెను. ఆ సుంకరి తల (నెలగి) వధచేసి యావైష్ణవుని తిరు కల్యాణమున కంపిన ఫలముకలిగిన పుణ్యంబునను మీకు షోడశమహా దానంబులు చేసెదను. నాకుఁ బ్రాయశ్చిత్తము చేయుఁ'డన్నను, నా బ్రాహ్మ ణులా చోరునియింటికి బోయి దానములుపట్టి ప్రాయశ్చిత్తముచేసిరి. అటు వలె బ్రహ్మహత్యాది పాతకంబులు నాశనమాయెను. దేవా, ఇది మీ మహిమకాదా? మీదాసుల కెవరికయిననేమి? తిరుకల్యాణము చేసినవారల కనంతములైన పుణ్యములు కలుగునయ్యా। ఇది పూర్వభాగవత సంకీర్తన. ఇందు యజుర్వేద సామవేద ఋగ్వేదాథర్వణ వేదము లున్నవయ్యా. ఇది మహారహస్యమే దేవా. ఇది మహాప్రమాణమే దేవా? శ్రీకృష్ణా! సింహ గిరి నరహరీ! నమో నమో దయానిధీ ।.

## 26

దేవా, ఆదిదేవుండవు, సకల బ్రహ్మాండ నాయకుండవు నీవని "ఏకో విష్ణుర్మహద్భూతం" బనిరే, దేవా, సమస్త విస్తారమూర్తివని భావ మందెఱింగిన వారైరి, జాతివర్ణములతోఁ బనిలేదు. మీ భక్తుండైనఁ జాలు నని "శ్వపచోఽపిమహీపాల" అంటిరి దేవా, సకలజీవులకు జతుర్వేద ధర్మము లంటిరి. దేవా, ఆత్మజ్ఞానములేని యాత్మలకు "ఆత్మజ్ఞానం జాయతే" యని తెలిపితిరి. దేవా, వేషధారణమే చాలదు. ఆత్మభక్తియే చాలదు. జ్ఞాన మాత్మభక్తివంటిదని తెలస యందుకు "వేషాన్న విశ్వాసః ప్రభూనామ్" అంటిరి. దేవా, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులరందు పురుష సూక్తం బుండునని తెలిపితిరి. దేవా, కేవలం జ్ఞానము తెలిసి, దూషణము కూడదని యందుకు దూషణయంటిరి దేవా మీ భక్తుండై యుండి రుద్రభక్తుల దూషించుట దోషంబని తెలిసి యందుకు "మద్భక్త శ్శంకరద్వేషీ. మద్ద్వేషీ శంకరప్రియః, తావుభౌ. నరకం యాతః

యావచ్చంద్ర దివాకరౌ" అనియెడు వాక్య ప్రమాణంబులు తెలిసి యందు కుచ్చారణ తారకవేషములకు శూద్రుండైనను జాలునని "శూద్రాశ్చ భగవద్భక్తా విప్రా భాగవతాః స్మృతా" అంటిరి. దేవా, దూషకానుష్ఠాన దూషక రహితుండు త్తముండు. నిరపేక్ష నిశాంతంబంటిరి. దేవా, సకలజగదంతర్యామివి సకల భూతాంతర్యామి వగుదువు. "సిద్ధం కేశవా, పురుషలోకేశమ్" అంటిరి. దేవా, మీభక్తులు మిమ్మెచ్చటఁ గొనియాడుదురో యచ్చట(మీరు)వసించి యుందురని తెలిసెను. అందులకు "నాహం వసామి వైకుంఠే" అంటిరి. దేవా, మీ భక్తులు ఎక్కడ స్థిరమై వసించిన అక్కడ స్థిరమై యుందురనుటకు "తులసీకాననంయత్ర" అంటిరే[1]. దేవా, "సదాచార్య కటాక్షేణ భజ సిద్ధిమ్". ఆచార్యులే నరహరి. (మీ) సాక్షాత్కార మెందున్న నందుల ప్రేమఁజూచిన బీజాక్షులు, సతులవలన ప్రేమఁజూచి రక్తమాంస క్రిమికీటక శల్యాదులఁ గానరు. ఇవియన్నియు నెఱింగిన మహాత్ములకు సర్వము హేయము. ఎఱుంగని తామసులకు సర్వము భోగము. అనాథపతీ, స్వామీ సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

# 27

దేవా, అకార ఉకార మకారములుం గూడఁగా ప్రణవము. ఇందు బీజాక్షరి గాయత్రి. ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తుల మహామహిమను నరుడెరుంగ వశమా? 'అనంతావై వేదాః' యని శ్రుతి పలుకుచున్నది. శాస్త్రములు లోకోపవాదములు. అడియేని దాసిన్ తొండండను శబ్దములు మీ దాసానుదాసులకు కారణమైనవి. మీపాదములాన, ఈయర్థము తప్పదు. అనాథపతీ, స్వామి, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 28

దేవా, మీచరణయుగళ సేవకే కులజుండైననేమి? హృదయ కమల కర్ణికా(ర) మధ్యమందు రత్నసింహాసనస్థునింగాఁజేసి, పురుషసూక్త

---

1 తులసీకాననం యత్ర, యత్ర పద్మవనానిచ, యత్ర భాగవతాస్సంతి తత్ర సన్నిహితోహరిః.

ప్రకారంబున నావాహనార్ఘ్య పాద్యాచమన స్నానవస్త్రోపవీత సుగంధపుష్పాక్షత ధూపదీప పరిమళ నైవేద్య తాంబూలాది షోడశోపచారముల నర్చన చేసి, కంకణకేయూర కౌస్తుభాభరణాలంకృతునిగాఁజేసి, మకరకుండల మణిమయకిరీటహార ఝుణఝుణాత్కార నూపురాది భూషితునింగా వామాంక స్థితకమల ముఖావలోకన కుతుహల తుష్టమానసునిగా ధ్యానంసేసి,ఓంనమో నారాయణాయేతి వాక్యములచేత వందనము చేయునతండు పరమభాగవతోత్తముఁడని శ్రుతివాక్యములు చెప్పెడుంగావున నట్టివానికి మీరు,మీకతండు దక్క నితరులు గలరె? కృపాంబుధీ. అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 29

దేవా, మీయురంబున నిరవై వెలింగెడు శ్రీమహాలక్ష్మియు, కౌస్తుభమాణిక్యము, మీనాభికమలమందున నవబ్రహ్మలు నింద్రాగ్నియమ నైరృతి వరుణ వాయుకుబేరేశానులైన యష్టదిక్పాలకులును, నష్టదిగ్గజంబులును, భుజంగంబులు, సప్తకులపర్వతంబులు, సప్తమహర్షులు, సప్తజలనిధులు, సప్తవాయువులు, ధరణియు, గగనంబును, దీపంబును, సురుములు మెరుములు, మేఘంబులు దివి భువి పాతాళ దేవదానవ లోకములయందున్న చరాచరాద్యఖిల జంతుజాలములు మీ నాభికమలోద్భూతునివలన లిఖితంబు గావె. శ్రీకృష్ణకువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 30

దేవా, ధాత్రి ఉదక మనలము, మారుత మాకాశము, జీవాత్మ, భూతాత్మ, యనియెడు భేదస్వరూపంబు లేక త్రిగుణానందమైన యిట్టి యాలయమై, జీవుండవై , దశప్రాణుండవై, దేహమునకు, మనమునకు మానసోల్లాసమైన మునిజననాథుల మనంబులఁ జేరుదువు, జిహ్వాచాపలంబునకు. మదన మాయాంధకారమునకు సుజ్ఞాన దీపమవ నారాయణపదము

స్థిరమ్' అనియెడు దానంబును గొంటిని. రోగ దారిద్ర్యంబుల చెంపలు గొట్టితిని. ఈ యపకారాదుల మనిచి, చంద్రకాంత పర్వతముమీద నీలపు సింహాసనమట్లు నీవు నాలోపలం బాయకుండవే! అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 31

దేవా, నిర్మలమైన మీకృతుల నెఱుంగక కర్మాదులం బొందెదరు. ఇతర దైవాముల శ్రుతులందులఁ దగిలి నిషేధమును బొందెదరు. నారాయణుండే పరబ్రహ్మమని తర్కవాదములయందు దలంచి చూచిన దైవాదులు మఱిలేరు. ఏకస్వరూపంబైననాఁడు, ఏకోదకంబైననాఁడు, బలిని మెట్టిననాఁడు, వటురూపమునుమాని త్రివిక్రమావతారమున నవతరించిన నాఁడా బ్రహ్మాండములు తానే యగునట. ఒక పాదంబున భువనంబులెల్ల గొనునట. మూఁడు మూర్తు లేకమూర్తియైననాఁడు నడుగులో రుద్రాదు లడఁగిరో, దైవాదులు మునిగిరో, పాతాళముఁ జొచ్చిరో, భస్మమైపోయిరో జయవిజయులు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాలదంతవక్త్రులు శ్రీవల్లభుని చక్రముచేత హతమగుట నెఱుంగరా! ఇతర దైవాయలిచ్చిన పదవులు నిత్యమగునా! శ్రీనాథుం డియ్యఁడా పదవులు? బలి విభీషణులకు, నంబరీష ధ్రువాక్రూరులకుఁ, బ్రహ్లాద నారదులకు, నహల్యా, ద్రౌపది మొదలైన పుణ్యకాంతల కిచ్చిన పదవు లభివృద్ధిఁ బొందుచున్నవి. శ్రీకృష్ణ కువ్వారుస్వామీ. సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 32

దేవా, మీకు మొఱపెట్టి విన్నపము చేయుచున్నాఁడను. సంసార మోహబంధములఁ దగులువడితిని కర్మానుకూలంబులం బెనగొంటిని. కాంతలమీఁది కోరిక కడవదాయెను. కామాంధకారము కన్నులఁగప్పెను. తల్మవారిధి గడువదయ్యెను. అపరకర్మములకు లోనైతిని అజ్ఞాన జడుండ

నైతిని. అధమాధముండనైతిని. అందని ఫలముల కఱ్ఱులుసాచితిని. దుష్ట
దురాచారుండనైతిని. మూఢుండనైతిని. చపలుండ నతిపాతకుండను.
మహాపాతక విశ్వాసఘాతుక పంచమహాపాతకుండను. అరణ్యమునఁదిరిగెడు
మృగంబువలె తన నీడకుఁ దా నదరిపడుచు, నజ్ఞానంబనియెడు చీకటిం దప్పు
కొనుచు నాచార్యకృపకుఁ జేరనీయక, భాగవత కైంకర్యమున కీడేరక,
మోక్షార్థుండఁ గానేరనైతిని. కామాతురుండనైతిని. కూపములో బడిన
శిశువువలెఁ గూయుచున్నాఁడను. తల్లిలేని బిడ్డవలె కలవరించుచున్నాఁడను.
తైలములోని మక్షికముచందం బాయెను. ఉరిఁబడ్డ మెకంబువలె
నుపాయ మెఱుఁగక యున్నవాఁడను. పసిరిక కాయ పురుగువలె
తేలలేక సంసార బంధములఁ దగులువడి, వికల్పగుణాదుల కెదురు
గాననేరక వితరణ చెడి విరజానది దాట నుపాయంబు చాలక
వారకాంతల రుచులందగులుచు, ప్రాకృతపుచెలిమి విడువలేక లజ్జాభి
మాన కులాభిమాన దేహాభిమానంబులు ఖండించనేరక వారకాంతలవలనం
జిక్కువడితిని. నా కేది యుపాయము చెప్పవే దైవమా! నీ వుత్తమ
సాత్త్వికుండవు. సకలాచార్యుండవు. జగదీశ్వరుండవు. సర్వ జీవ దయా
ళుండవు. పవిత్రుండవు. వాలినిగ్రహుండవు. విభీషణ ప్రతిష్ఠాపనా
చార్యుండవు, రావణగిరి వజ్రాయుధుండవు. ద్రౌపదీమాన రక్షకుండవు.
పదునారువేల గోపస్త్రీ ప్రియుండవు. తాటకాప్రాణాపహారా! లక్ష్మీమనోహరా!
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆది పురుషా! పురాణపురుషోత్తమా!
వేదవేదాంతస్వరూపా! పరబ్రహ్మస్వరూపా! పరతత్త్వ పరమప్రకాశా!
పరమపదనివాసా! శరణాగత రక్షామణీ! శరణాగత చింతామణీ! పరంజ్యోతీ!
సింహాచలనాథా! నీకు విన్నపము చేయుచున్నాఁడను. ఎనుబదినాలుగు లక్షల
జంతురాసుల దొంతులను అనేక యోనిముఖముల వెడలితిని. ఆ కర్మలను
సుఖదుఃఖచరితుండనై యనుభవించితిని. యముని వశంబున నెంతకాలము
వృథయాయెను జన్మము! తర్కవాదంబు లనెడు కూపంబుల మునుగుచుం
దేలుచు, మగుడ జన్మాదుల జనింపుచు మూరికిం బాటకుం జోటికి వెడలు
తుచును, నంత్యమున నరజన్మమున జనియించి యంధుండనై కొన్ని వర్షంబు

లనుభవించితిని. కొన్ని దినంబులు కామక్రోధ లోభమోహ మదమత్సరం
బుల నభిమానహీనుండనై (యుంటిని) కొన్నినాళ్ళెదుటివాని నెఱుంగ
నేరక తన్ను దా నెఱుంగక, నిన్ను నెఱుంగక, నీ మతం బెఱుంగనేఱక,
భాగవత ద్రోహుండనయి, పరమాచార్య కృపచేర నేర్పులేక, యాచార్య
శేషముదొరుకక, యజ్ఞానజంతువునై యగోచరంబైన పాపంబుల విహార
వ్యాపారచిత్తుండనై, పంచేంద్రియాదుల బంధించనేరక, పంచతురగంబులఁ బట్ట
నేరక, నైదుఘాతంబులకు నోడంబడికగా, నవద్వారంబులు బంధించనేరక,
(యుంటిని) (అప్పుడు) జన్మాంతర కర్మాంతర పవిత్ర పరమవంద్యులైన
మీ స్వరూపులైన పొతకమూరి భాగవతులు, నారాయణయ్య, యాళువయ్య,
యచ్యుతయ్య, యనంతయ్య, శ్రీ చెన్నమయ్యంగారలు, శ్రీకృష్ణమాచార్యులేరా
దశావతారంబైన మహామహిముఁడుగాను, చాతుర్లక్ష గ్రంథస్వరూపుండనను
గాను, నతని సందర్శనసేవ దొరకునో యని యపేక్షించి, ఎంపెరుమా
నార్ల స్వరూపులైన తదీయులు నడపెరుమాళ్ళస్వరూపులైన స్వాములు,
పరమపదనివాసులు పరమపదరాజులు, కాషాయవస్త్రములు ధరియించి,
కమండలంబులతోడ, దండెయుఁ దాళంబులతోడ, భాస్వరనామంబులఁతోడ,
లలాటంబుల తిరుమణి శ్రీ చూర్ణంబులు ధరియించి, యాదివ్యస్వరూపులు
సింహాచలమునకే తెంచిరి. ఆ సింహాద్రి జగదీశ్వరుం డంగరంగ వైభోగదా
యకుండు, శ్రీరంగశాయి, శ్రీపరమపదనివాసుండు. శ్రీ జగన్నాథుండు
సింహాద్రియప్ప తిరుపట్టణమందు సూర్య సోమవీధుల శ్రీపొతకమూరి
భాగవతులు కృష్ణమాచార్యుల తిరుమాళిగను గానవేక నెమకులాడుచున్న
సమయమం దా పడునొకండవ యవతారుండు లేడొకో! దశావతారుండైన
మహాత్ముండు లేడొకో! చాతుర్లక్ష గ్రంథ వ్యూహపు సందర్శనము తమ
కేవేళ దొరకునొక్కో! ఆ మహాత్ముని తిరువడిగళ్ళెపట నుండునొక్కో!
అతని తిరువడిగళ్ళు సేవించుభాగ్యము తమ కెప్పుడు దొరుకునొక్కో!
తమ కగోచరంబైన కన్నుల కరవెప్పుడు తీరునొక్కో! తమ జన్మంబు
అపునర్జన్మంబుగానెన్నడీడేరగలుగునొక్కో! అనితమలో తాముసంభాషణచేసి,
అన్వయింపగాను, నా సమయమందున కృష్ణమాచార్యులు తనకు ప్రియకాంత

యైన జగన్మోహనాంగి యను వార కాంత కుచభరంబులమీఁద హస్తంబులు వహించి, తనువెఱుఁగక, నవరత్న ఖచిత కంకణము (ధరించి), పసిడి కుందనపు[1] పావాలు పాదంబుల మెట్టికొని, క్రొన్నెల నామంబు కొసర కస్తూరిబొట్టు దీర్చికొని, యుదయకాలమందు చెక్కిళ్ల వెంట చెమటకారఁగా, కనకపీతాంబరంబైన పచ్చడపుచెరగు తిరుముఖారవిందమునకు మఱుగు చేసికొని, నఖములు చెక్కిళ్ళ సందడింపుచు, నాతుల బింబాధరముల రుచులు గొన్న యధరములు కెంపులై కనపడంగా, నొకరూపున నరకేసరియై, యొకరూపున నాదివరాహంబై, యొకరూపున కూర్మావతారుండై, యొకరూపంబున కృష్ణమాచార్యులుగానే జనియించి, చాతుర్లక్షగ్రంథ సంకీర్తనలు సేయుచున్న కృష్ణమాచార్యులు, చీనిచీనాంబరములు ధరియించిన యనేక చెలికత్తెలైన వార కాంత లిరుపార్శ్వంబుల కైదండ నీయఁగా, నా కాంతావైభవంబులకుఁ జొక్కుచు, నా మహాత్ముండు మదోన్మత్తుండై నవ్వుచు, నా సల్లాపంబులకు సంతోష చిత్తుండై తామసగుణంబుల వేంచేసిన సమయంబున, బొతకమూరి భాగవతులు పొడగని, కృష్ణమాచార్యులంగూడి సంభాషణచేయ దొడంగిరి 'ఓ మహాత్మా! కృష్ణమాచార్యుల తిరుమాళిగ యెచట నున్నది మాకుం జెప్పు' మనిరి. అప్పుడు కృష్ణమాచార్యులు విభ్రాంతుఁడై కడు నింద్య (మయ్యె) నని తనలో తలపోసి తలపోసి, చింతాక్రాంతుండై, 'యడియని యజ్ఞానగుణకథ లడుగుచున్నారు. ఈ మహామహులతో నెటువలె సంభాషణ చేయుదును? ఎటువలె బొంకుదును? ఎటువలె విన్నపము సేయుదును! నే నజ్ఞాన చిత్తుండను. నాకేది యుపాయము? దేవా, వీరిస్వరూపములఁజూచిన నాళ్వారులస్వరూపులై యున్నారు. నేనేమి సేయుదును? చెప్పవె దైవమా!' అని యప్పుడు కృష్ణమాచార్యులు దుఃఖజీవుండై, కన్నుల జలంబులు భూకాంతమీదఁబడంగాను, దనహస్తంబులఁ దనచెక్కిళ్లు తటతటఁ దాటించుకొని, మూర్ఛాక్రాంతుండై, కొంతవడిం జింతిల్లి, తెలివిఁగాంచి యంతటను బొతకమూరి భాగవతులఁగూడి సంభాషణ సేయ దొడంగెను.

ఒ మహాత్ములారా, (మీరు) కృష్ణమాచార్యుల తిరుమాళిగ నడుగుచు

---

1) కుందల ?

న్నారు. (ఆ) యాచార్యుని శ్రీ పాదసేవకుండ నేను. మీకా మహాత్ముని సందర్శనము శీఘ్రమే దొరికింతును. మీ మహత్త్వ మాతనితో నానతీయుఁడు. ఆ యాచార్యునకు నమ్మిన హితుండ. మీ రెచటనుండి వేంచేసితిరి? మీ యాచార్యులెవ్వరు? మీ దైవంబెవ్వరు? మీ నామధేయంబులేవి? ఆనతీయుండు. ఆ మహాత్ముడున్న తావునకు పనివినియెదను. అప్పుడు పొతకమూరి భాగవతులన్వయించి (యిట్లనిరి.) 'పదునొకండవ యవతారుండగు కృష్ణమాచార్యుల సందర్శనము మాకేవేళ దొరకునో! మా పూర్వాచార్యులనామములు విన్నపము సేయుదుము. ఓ మహాత్మా! వినుము. మా పూర్వాచార్యులుత్తమ సాత్త్వికులు. సప్తసాగరములకును, స్థావరజంగమాదులకును, సకలాచార్యులకును, పదునాల్గుభువనములకును, పదుగురాళ్వారులకును, పదముగ్గురు భాగవతులకును, పరమపదనివాసుని పరంజ్యోతియైన స్వామికిపట్టు, ప్రమాణస్వరూపజ్ఞాని తిరుమలాచార్యులు, మాకు పరమాచార్యులైన మహాత్ముండు. జన్మాదులు మగుడరాకుండను మంత్రోపదేశం బానతిచ్చిరి. ఆ యాచార్యులు పరమపదముఁ గనిరి. శ్రీ రామానుజుల శ్రీపాదసేవకులము, శ్రీయౌబళ నారసింహుని నాట్యవినోదులము. పొతకమూరి భాగవతులము. నారాయణయ్య, యౌబళయ్య, యచ్యుతయ్య, యనంతయ్య, లక్ష్మయ్య, శ్రీ చెన్నమయ్య. మా నామధేయములు, కృష్ణమాచార్య లేకాదశావతారంబైన మహాత్ముఁడనంగాను, చాతుశ్లిష గ్రంథస్వరూపుఁడనంగాను, నా యాచార్యుల సందర్శనము మాకు దొరకునో దొరకదోయని, శ్రీ యహోబిలమునుండి సింహాచలమున కేతెంచితిమి. అనిన్నవిని కృష్ణమాచార్యులు సంతోషమున నెరగండి, 'యీ పొతకమూరి మహాత్ముల మహత్త్వము వినియుంటిమి. పటము పన్నించి, శ్రీ యహోబిలేశుని పటముచాటున నాట్యమాడింతురఁట. అట్లుగనుక, వీరి తిరువడిగళ్ళు సేవింపవలయునని యపేక్షించి యుంటిమి. నా భాగ్యవశంబున నిచ్చటికి వేంచేసిరి. కృతార్థుండనైతిని. నా జన్మము సాఫల్యమాయెను. కాలము కడఁగంటిని. మా పరమాచార్యులైన పొతకమూరి మహాత్ముల వలన విరక్తిని బొందవలయు' నని (యెంచి) యంతట వార కామినులమీద

మోహము విడిచి, 'వైష్ణవదాసులతోడి సరసజ్ఞత చాలించవలయును. ప్రా కృతపుచెలిమిని పరిహరించవలెను. సంసారము నిస్సారము.[1] 'తల మీస ములు వపనక్రియ చేయించి, యాడుకట్టుకట్టి, యహంకార మమకారంబులు వీడి,యుత్తమ సాత్త్వికంబుఁగైకొనెదను. నరహరిదాసానుదాసులకు దాసుఁ డను. తొత్తును. తొండఁడను. బంటును స్వామి శ్రీపాదసేవకుండ' నని కృష్ణమాచార్యులు దృఢచిత్తుండై, శుచిర్భూతుండు గావలెనని యెంచి యప్పుడు, పౌతకమూరిభాగవతులను దోడ్కొనివచ్చి, 'యిదిగో కృష్ణమా చార్యుల ద్వార వాకిళ్ళు. ఇచట మీరు వేంచేసి కూర్చుండుడు. ఆ మహా త్ముం డీ సమయమున,సంధ్యానుష్ఠాన జపతపాది నిత్యకర్మముల ననుసరిం చునో తెలిసి విన్నపము చేసెద' నని, పోవునట్లే పోయి, తా పెడద్వారంబున వెడలి, క్షవరకునిం బిలిపించుకొని, తల మీసములు బోడించుకొని, స్నాన మాచరించి, శిఖా యజ్ఞోపవీతములు ధరించి, కటిసూత్రమున కాషాయవస్త్రు మాడుగట్టుగా ధరియించి, లలాటంబున తిరుమణి తిరుచూర్ణములు ధరి యించి, దండెయుఁ జిటితాళంబులు సంధించుకొని, సంకీర్తనవాక్పూజలు సేయునంతట, పౌతకమూరి భాగవతులఁ బిలువనంప నవధరించిన సన్ని హిత కైంకర్యపరులు పోయి 'పౌతకమూరి మహాత్ములారా, కృష్ణమాచార్య సందర్శనము మీకు శీఘ్రమున దొరుకును. ఈవేళ వేంచేయుం' డని పిలి చిన సంతోషచిత్తులై యంతఃపురమునకు వేంచేసి కృష్ణమాచార్యుల తిరువడి గళ్ళు సేవించి యడియేని దాసులమని యాచార్యుని శ్రీపాదయుగళమునకు సాష్టాంగ దండప్రణామములు సమర్పించిరి. తమ ఫాలప్రదేశమునఁ గృష్ణ మాచార్యుల తిరువడిగళ్ళద్దుకొని, యో మహాత్మా, మా జన్మంబులు పునర్జన్మంబులుగా నీదేర్చితిరి. అడియేలకు జన్మపవిత్రం బాయెను. మీనేఁ ప్రసాదించితిరి. మిమ్ముఁగనెడు భాగ్యము చేసితి'మని కృష్ణమాచార్యులఁ బౌతకమూరి భాగవతులు స్తోత్రము చేయగా నపుడు కృష్ణమాచార్యు "లడి యేని తొత్తును. తొండఁడను. జీలంబెందును. అపచారద్రవ్యము మూటఁ

---

1 ఇచ్చట కొద్ది గ్రంథపాతము.

గట్టవద్దు. ఓ మహాత్ములారా, మీవలన నడియెడు సర్వవిరక్తిం బొందఁ గలిగెను. అడియేని జన్మంబు పునర్జన్మం బాయెను. మీ దాస్యము నాకు దొరకెను. ఓ మహాత్ములారా, లెండు.' అని పౌతకమూరి భాగవతులను కృష్ణమాచార్యులు లేవనెత్తి స్తోత్రము చేసెను. అంతటఁ బౌతకమూరి భాగవతులులేచి, కృష్ణమాచార్యుల సందర్శనముచేసి నిలుచుండి, వారి ముఖారవిందంబు బొడగని, తమలో తా మొండొరులఁ జూచికొని, పరమ రహస్యముగా భాషించి, 'యితండె (యాతఁ) డౌననియుఁ దప్పదనియు నిశ్చయించి, 'మనవలనంగదా యీతనిభోగములు వికల్పమైన'వని తమలోఁ దాము నిశ్చయించి, 'మనము కృష్ణమాచార్యుల సేవింపవచ్చిన ఫలమింతకు వచ్చెఁగదా! ఇతని శృంగారవైభవములు మనవలన విఘ్నంబాయె'నని పౌతకమూరి భాగవతులు తమ దవడలు తటతటఁదాటించుకొని, యీ యపచారద్రోహము లెన్నడు తొలంగునో యని దుఃఖించుచుఁ, గృష్ణమాచార్యులతో సంభాషణము సేయఁదొడంగిరి. 'ఓ మహాత్మా! ఇటువంటి వికల్పము నీకేటికి? నీవు మహాత్ముండవు. నీవు పవనౌకండవ యవతారుండవై చాతుర్లక్షగ్రంథ నామసంకీర్తనలతో వాక్పూజలు సేయగా గృష్ణమాచార్యులై యవతరించినావు' అనగా "నడియని భాగ్యవశమున నిచ్చటికి వేంచేసితిరి. కనుక నేను గృతార్థుండనైతిని. మీ రిచ్చట సింహాద్రినాథుని సన్నిధిని స్వామిని తాండవమాడించవలెను. మీ మహత్త్వము సింహాద్రి యప్పుడు వినవలెను" అనినఁ బౌతకమూరి భాగవతులంజలిచేసి "యడియేల కథికారంబులేదు. మీ యానతిక్రమమున నటులే విన్నపము చేయుదు" మని, జగదీశ్వరునిపటముగట్టించి, శ్రీ యౌబళనాథుని సంకీర్తన వలన స్వామికి తాండవవినోదుండై, నాట్యప్రమోదుండైన శ్రీ యౌబళనాథునిఁ బౌతకమూరి భాగవతులు తెరచాటునఁ దాండవ మాడించినప్పుడు కృష్ణమాచార్యులు భీతిఁజెంది, "మిమ్ము నెఱుంగలేక మీతో సంభాషణచేసితిని. నేను మూఢుఁడను. కఠినచిత్తుండను. ప్రహ్లాద నారదాదులైన పరమ భాగవతులు మీతో సంభాషణ చేయవలె. నేను నరజంతుఁడను. సర్వాపరాధంబులు క్షమించుఁ'డని పౌతకమూరి భాగవతులకు కృష్ణమాచార్యులంజలి చేసి,

వాక్పూజలచే దండంబు సమర్పించెను. మీ సంకీర్తన పూజలు
చాలింపుఁ" డని పౌతకమూరి భాగవతులను కృష్ణమాచార్యులను
చరించెను. పౌతకమూరి వైష్ణవులు దండెలు తాళంబులు ధరణిపై
దించిరి. "అయినను మా నేరుపులు నేరములు, మీ తిరువుళ్ళమున చేపట్టుఁ"
డని పౌతకమూరి భాగవతులు కృష్ణమాచార్యులకు దండము సమర్పించిరి.
అప్పుడు కృష్ణమాచార్యులు దండెయుఁ జిటితాళములు సంధించుకొని,
పౌతకమూరి భాగవతుల సన్నిధిని యడియేని విన్నవింతునని, యాలాప
వర్ణనలతో "నమోనారాయణా" యని (మీ) నామ గుణ కథలు వచన
భావంబునఁ గీర్తించను, ఘుమ ఘుమ ధ్వనులు మ్రోయఁగాను దండె
మీటుచుఁ దాళంబు లుగ్గడించుచు, పంచమవేదస్మృతులును, చాతుర్లక్ష
గ్రంథ సంకీర్తన వాక్పూజలును చేయంగాను, సింహాద్రినాథుండు నిజ
రూపంబున లీలా వినోదుండై, బాలత్వంబునఁ బురబాలురలోన బాలుండై,
కృష్ణమాచార్యుల తిరుమాళిగ సన్నిధినుండి యాడుచుఁ బాడుచు వచ్చి
కృష్ణమాచార్యుల తొడలమీదఁ గూర్చుండెను. ఆ శిశువుం జూచి పౌతక
మూరి భాగవతులు వితానులై లేచి మెలమెల్లన సంభాషణ సేయం
దొడంగిరి. "కృష్ణమాచార్యులకు సంతానప్రీతి కలదనివిందుము. ఆ బాలుఁడు
గాబోలు"నని కడువేడ్కతోఁ దమలోఁ దా మన్వయించిరి. ఆ సమయమునఁ
గృష్ణమాచార్యులు "తిరువళియందున్న యీ బాలుం డెవ్వఁడొకో? నిత్య
కృత్యంబుగా స్వామిద్వార సన్నిధిని సంకీర్తన విన్నపము చేతును. ఈ
బాలుని స్వరూప మెన్నడును సేవింపలేదు." అని యా పౌతకమూరి భాగ
వతులు వేంచేసిన సమయమందు సింహాద్రి యప్పని సంకీర్తన చేయు
చున్నప్పుడు నవరత్న పంచరత్న సంకీర్తనలఁ జెప్పగాఁ, దొడలమీదఁ
గూర్చుండియున్న బాలుండు గంటమును, నాకులును జేతఁబట్టుకుని వ్రాయఁ
దొడంగెను. అంతటఁ బౌతకమూరి వైష్ణవుల యనుజ్ఞను గృష్ణమాచార్యులు
సింహగిరి నరహరి సంకీర్తన పూజలు చాలించి స్వామికి దండప్రణా
మములు సమర్పించి, పౌతకమూరి వైష్ణవుల సమీపించి, "పెద్దలు
బడలితిరి. అడియని గుడిపెకు వేంచేయుఁడు. మీ సేవ యడియనికి ప్రసా

దింతురు గాని, మీ శ్రీపాదతీర్థము, తళియ ప్రసాదము నడియనికిఁ గృప సేతురుగాని, శీఘ్రమే వేంచేయుఁ"డని పౌతకమూరి వైష్ణవుల వెంటఁబెట్టు కొని తిరుమాళిగకు వేంచేసి బాహ్యారంగమునఁ బటము గట్టించి, పటము చాటున పౌతకమూరి భాగవతులను బంతిగట్టుఁడని, యంతరంగమునకు వేంచేసిరి. అంతరంగమునఁ బటముపన్నించి, పటముచాటున సింహాద్రి జగ దీశ్వరుని తిరువారాధన, యారగింపుతళియ నిడి, భగవానుఁడారగించిన మీఁదటఁ బౌతకమూరి భాగవతులకు తళియప్రసాదమును శ్రీపాదతీర్థ మును (నిచ్చి) "స్వాములారా, యడియని కైంకర్యమును గై కొనుఁడని," కృష్ణమాచార్యులు పౌతకమూరి భాగవతులకు దండము సమర్పించెను. పౌతకమూరి భాగవతులులేచి, కృష్ణమాచార్యుల కినుమడి ముమ్మడిగా దండములు సమర్పించిరి. తిరుగ బంతిగట్టిరి. తిరువాయిముడి చదివిరి. అష్టాక్షరి నుచ్చరించిరి. ద్వయమును బఠించిరి. తిరుమంత్రమును విన్న పము సేసిరి. కృష్ణమాచార్యులు కృపచేసిన శ్రీపాదతీర్థ తలియప్రసాదము లడియేలకు మహాప్రసాదమాయెనని తెరలెత్తి తమకించిరి. అంతట బాలుని సందేహము కలిగి తమలోఁడాము తెరలెత్తిక నిలుమనిరి. అప్పుడు కృష్ణమా చార్యుల చేరంబిలిచి, "యో మహాత్మా! సింహాద్రినాథుని ద్వారసన్నిధిని మీరు సంకీర్తన పూజ లానతీయు సమయమున మీ శిశువు తిరుమాళిగ యొద్ద నుండి యాడుచును బాడుచును మీదరికి శీఘ్రమే వేంచేసి మీ తొడల మీఁదనెక్కి కూర్చుండెను. ఆబాలుని సల్లాపంబుల సద్దు తిరుమాళిగలో వినరాదు. అతఁడెచ్చటికి వేంచేసినాఁడు? అతని నిచ్చటికి వేంచేయు మనుఁడు. అత్తని శ్రీపాదములకు దండము సమర్పించవలయునని యపేక్షించియున్నారము" ని కృష్ణమాచార్యులంగూడి విన్నపము చేసిరి. అప్పుడు కృష్ణమాచార్యులు పౌతకమూరి భాగవతుల సందేహమును దెలిసి "యాతండు మా శిశువు కాఁడు. మీ శిశువుం డని యుంటిమి. అడియనికి నటువంటి యధికారము లేదు. అడియనికి మీరు శిశువును గృపసేసి యేడవ వర్షంబు పెదలు సమయమందే మీ సాయుజ్యమున కీడేర్చుకొంటిరి. ఆ బాలునికిని మాకును బనిలేదు. మీ రహోబలేశుని పటముచాటునఁ దాండవ

మాడించఁగాను మీ నాట్యవినోదమున నుదయించెను. ఆ పరమపద నివాసుఁడు వేంచేయఁబోలును. భగవానుని మీవలన నీవిధముగాఁ గంటిని. భాగవతకృపఁ గానము. భగవానుని కృపగానము. మీరు మా పరమాచార్యులై యన్నియుఁ దెలిపితిరి. తెరలెత్తుఁడు స్వాములారా", యని కృష్ణమాచార్యులు దండము సమర్పించెను. అప్పుడు పొతకమూరి వైష్ణవులు గడు సంతుష్టిఁబొంది యుప్పొంగి కృష్ణమాచార్యులం గొనియాడిరి. "ఓ మహాత్మా, నీవు దక్క దైవములేదు. నీవే కృతయుగ త్రేతాయుగ ద్వాపరయుగ కలియుగములకు కృష్ణావతారుండవై జనియించినాఁడవు. నీవు మహాత్ముండవగుదువు. మీ మాహాత్మ్యమును మేము గనుగొంటిమి. మీయనుజ్ఞవలన శ్రీపాదతీర్థ తళియప్రసాదములను బ్రసాదించుఁ'డని యా యాచార్యుని తిరువడిగళ్ళకు నొరగి యంగుష్ఠ ప్రమాణంబు పట్టుకొని దండ ప్రణామంబు సమర్పించిరి."మీ శ్రీపాద తీర్థమును,తళియప్రసాదమును మా జన్మవిమోచనముగా భుజించితిమి. అడియేలకు నెట్లానతిచ్చెదరు? నాగుడ శ్రీ యహోబలమునకు పనివినవలెను. అంపకమవధరించుఁ'డని యాచార్యులకు విన్నపము సేసిరి.అప్పుడు కృష్ణమాచార్యులు వైష్ణవులతో," నో మహాత్ములారా! చాతుర్లక్షగ్రంథ సంకీర్తనలకు కొదువ లక్షయేబదివేలు విన్నపము సేయవలెను. ఆనాటికి మీసేవ దొరకునో దొరకదో యని చింతించగాను, నీసమయమందు మీరు వేంచేసితిరి. మీసేవకలిగెను, గనుక నెవ్వరికి వెరవను. యమునకు వెరవను. కొదవగాకుండను చాతుర్లక్షగ్రంథ సంకీర్తన వాక్పూజలు మీవలన మీభండారమునకు (?) విన్నపముసేతును. మా పితృపితామహులు ప్రపితామహులు నరకమునుం గొంతగాంచిరి.మీ(వంటి) దయాళులవలననే నరక హేతువు వీడ్కొని సాయుజ్యమును బొందిరి. మీద్వారముల సన్నిధిని యధికారము నాకుఁ (గలదు.) అదే నిత్య నివాసముగాను మఱిమఱవకుండను పరమపదము కృపసేయుఁడు. పరమపదమునకు సాలోక్య సామీప్య సాయుజ్యములు మాకుండును. అంతరంగ బాహ్యాంగములకు మీయనుజ్ఞ ప్రసాదించుఁడు. నూటయెనిమిది తిరుపతులను మీ లీలావినోదములు. ఇఁకమీఁదట మి తిరునాళ్ళను మీతిరుమేనను.

కీ తిరువ_క్త్రిమునను నన్ననుగ్రహించుఁడు. ఇంతే నా విన్నప" మని, పొతకమూరి భాగవతులకు సాష్టాంగదండప్రణామంబు సమర్పించి, "యో మహాత్ములారా, వేంచేయుం"డని యనినప్పుడు పొతకమూరి వైష్ణవులు హస్తంబులఁ దమదవడలు వాయించుకొనుచు, 'మాకాచార్యాపచారంబు లేల మోపుగట్టెదవు? ఓ మహాత్మా' యని, కృష్ణమాచార్యుల కినుమడి ము మ్మడి దండములు సమర్పించి, యాతని యానతి యుంచుకొని మగుడ శ్రీయహోబలమునకు వేంచేసిరి. పొతకమూరి వైష్ణవుల వీడ్కొని సింహా ద్రినాథుని నగరికి నేతెంచి, సింహాద్రినాథుని సందర్శించి దండప్రణామంబు సమర్పించి., 'యీ మాయాప్రపంచం బెఱుంగలేను. పుట్టించుచు గిట్టించుచు యమునిచేత దెబ్బలకు లోనుజేతువు. యమునిచేత నన్ని (బాధల) నేకవేలేండ్లనుభవించితిని. నాడు మీరులేరో? నేనులేనో? సుఖదుఃఖంబులఁ బొంది, దుఃఖజీవుండనై మీదయకులోనై మిమ్ముగానలేక, పంచమహాపా తకంబులలో మునుఁగుచుండఁగాను, మా పరమాచార్యులైన పొతకమూరి భాగవతులు వేంచేసి మిమ్ముం గనిపించిరి. వారి మహత్త్వమువలననే వెను కటి కర్మములు వీడ్కొంటిని. నీవు బొంకుల కంచమవు. లంకచెఱుపు మర్కటుండవు. నిన్ను నమ్మలేను. నీ చాతుర్లక్షగ్రంథసంకీర్తన పూజలకు లక్షయేబదివేలు కొదువ. ఆ సమయమందు మీఋణం బెట్లుండునో? మీయ నుజ్ఞ యెట్లుండునో? ఇప్పుడే నాకు సాయుజ్యము గృపసేయుఁడు. సర్వాప రాధములు, పొతకమూరి పరమాచార్యుల కృపవలననే మీతిరువుళ్ళమున ననుగ్రహింపుడు. ఇంతే నావిన్నపము. విన నవధరింపుఁడ'ని క్షీరాబ్ధిశయ ముని వీడ్కొనెను. క్షీరాబ్ధివటపత్రశయనుండు భూకాంతసమయ ప్రశస్తుండై సింహాద్రిజగదీశ్వరునకు విన్నవించె. పొతకమూరి భాగవతులయనుజ్ఞ వల ననే యీ యపచారానపచారములు—మాతిరువుళ్ళమున కొలిపిన మీకు సాయుజ్యమిత్తును. సర్వమునకును, సర్వమైన యెందులకును నవధరించి నట్టి నాయురమున వెలింగెడు (శ్రీకాంతకును) భూకాంతకును దప్పుదును. సాలోక్య సామీప్యసారూప్య పదవులిత్తును. సమయ మొనరింతును. ఇందుకుఁదప్పితినా, పదుగురాళ్వారులకును, పదముగ్గురు భాగవతులకును దప్పుదును. (మీకు) పదవిగనిపింతును. ఇందుకు దప్పితినా పొతకమూరి

భాగవతులకుఁ దప్పుదును. ద్వారవాకిళ్ళ సన్నిధిని జతుర్భుజంబులును శంఖ చక్ర గదా శార్ఙ్గఖడ్గాద్యధికారంబిత్తును. సర్వమును తిరునాళ్ళను తిరుమేనను దిరువక్త్రింబు దెరిచి యవధరింతును.ఇందుకు దప్పితినా, పరమపదనివాసుని పరంజ్యోతియైన స్వామికిఁ దప్పుదును. సర్వమునకును దప్పు' నని సింహగిరినాథుఁడు శ్రీకృష్ణమాచార్యులకు నభయహస్తము గృపఁసేసెను.అనుజ్ఞ, ప్రసాదించెను. అప్పుడు కృష్ణమాచార్యుల విన్నపము నవధరించెను. 'నేడు గదా, నేనుభాగ్యము చేసితిన' (ని) వారి సాగరము లుబ్బినట్టివిధ మనుభవించెను. మహామేరువు శతయోజనములు పెరిగినట్లు కృష్ణమాచార్యులు పొంగెను. 'నేడుగదా, పరమాచార్యులైన పొతకమూరి నారాయణయ్యా యోబళయ్యా, యచ్యుతయ్యా, యనంతయ్యా, లక్ష్మయ్యా, శ్రీచెన్నమయ్యా గారల వలన పితృపితామహులకును, వైఖానసులకును, ద్రావిడులకును, కనుగొని సేవించిన యార్యపెరియలకును[1], శత్రుమిత్రులకును, పరమపద మిప్పించి(తి)రి. కనుక వారి మాహాత్మ్యమువలన పరమపద మొకవరము జేసితిని. పరమపదనివాసుని గడు గుత్తఁగొంటిని. పరంజ్యోతి నామనబున నిలిచెను.నేడుగదా పరమభాగవతుల శ్రీ పాదపద్మంబులు సేవింపగలుగుట! నేడుగదా, దాసానుదాసులకు దాసుఁడసనగలుగుట! నేడుగదా, సింహాద్రి నాథుని వాకిళ్ళగాచెడు భాగ్యముగలుగుట! నేడుగదా, యతిరామానుజముని వరదస్వామి సింహగిరి యనియెడు దివ్యౌషధము నా హృదయమునకు దొరకుట! నేడుగదా నూటయెనిమిది తిరుపతులను వెలయంగలుగుట! నేడు గదా, మీ తిరుమేను నవధరింప గలుగుట! నేడుగదా, కృష్ణమాచార్యులఁ గాచి రక్షింపగలుగుట! ఆర్తజనబాంధవా, అనాథపతీ, స్వామీ! సింహగిరి నరహరీ, ఇంతే నా విన్నపము.

# 33

విష్ణూ. ముకుందా. అనంతా, భగవాన్, అచ్యుతా, నారాయణా, హరీ, మురారీ, శ్రీరామా, నిరంజనా. పరమా, పరిపూర్ణా. పరమేశ్వరా,

1. శ్రీకార్యపరులకు?

పరవాసుదేవా, నిర్మలస్వరూపా, పరమపురుషా, పరంతపా, పరంధామా, పరబ్రహ్మ, అను మీనామంబులుగల యష్టోత్తరశతనామంబులు శ్రియఃపతి ముఖ్యనామంబులు. కేశవా, నారాయణా, మాధవా, గోవిందా, విష్ణూ, వాసుదేవా, అనిరుద్ధా, సంకర్షణా, హృషీకేశా, విశ్వంభరా, వైకుంఠవాసా, వేదాంగా, వామనా, అహల్యాశాపవిమోచనా, చక్రధరా, జనార్దనా, పరంధామా, వేదాత్మకా, కపిరాజా, యజ్ఞపురుషా, అను మొదలుగాఁగల నామంబులు శ్రీ కేశవుని యుపనామంబులు. శ్రీకృష్ణా, త్రివిక్రమా, పుండరీకాక్షా, ఉపేంద్రా, నారసింహా, పీతాంబరా, శార్ఙ్గధరా, శౌరీ, దైత్యారీ, వనమాలీ, విష్వక్సేనా, మధుసూదనా, తీర్థనాథా, శేషశయనా, అంభోనిధీ, వేదోద్ధారా, యజ్ఞవరాహా, ఆదికూర్మా, లంకేశ్వరా, హంసనయనా, సప్తాంగా, అను మీ యిరువదియొక్క నామంబులు మొదలుగాఁగల క్రియానామంబులసంతములు.'అకారార్థో విష్ణు'వనెను.'వేదాక్షరం శివయంతి' యనెను, 'సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' యనెను. ఆ శ్రుతివలన ఇతిహాసపురాణ రహస్యములు చెప్పిరి. అకారాది సర్వవర్ణముల కర్థములు (మీ) నామములే. రాజస తామస దైవములకుఁ గలిగెనేని, యర్థాంతర రూపవర్ణములంతర్యామి ప్రతిపాదకములు. ఇతరదేవతల యందు వేదార్థములుగావు. అదియెట్లన్న శంఖంబింద్రజితేంద్రచంద్ర కౌమండూకరూపములందున్నను నర్థములు వేరైనట్లు, 'బ్రహ్మ[1] విష్ణు. మయం జగత్.' శ్రీ కృష్ణకువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.[2]

# 34

దేవా, ద్వయమున కధికారి యెంతటివాఁడు? కోపము, శాంతము, నిర్లజ్జయునింద్రియ జయపరుండు గావలెఁగాక ద్వయాధికారి తన్ను నానెఱుంగక దూషించు కపటాచార డాంబికపరుండు ద్వయాధికారియగునె?

---

1. సర్వం?
2. ఈ వచనము సర్వశబ్దములు విష్ణువాచకములు-అన్నయర్థమును ప్రతిపాదించునదిగా నున్నది.

వికార దూషణరహిత హృదయాభిమాన పరుండు దాఁ గాక, కీటకాంకుర జన్మంబున హతుండు దాఁ గాక? భాగవతాపచారంబును దాఁ బొందక? అనాథపతి, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 35

దేవా, శ్రీరామమంత్రోచ్చారణంబున వాల్మీకి పురాణపురుషోత్తము డైన యాదినారాయణమూర్తి దివ్య శ్రీపాదపద్మంబులంజూచి యపేక్షించి నప్పుడే రామమంత్ర రహస్యమునఁ గృతార్థుండయ్యె. అదిగాక శ్రీ జగద్భ రితుండైన దేవుం డొకండెయని వ్యాసులు[1] "సత్యం సత్యాత్మకమ్ దైవమ్! సత్యవాక్య దృఢవ్రతమ్। సత్యం సత్యంపున స్సత్య ముద్ధృత్య భుజ ముచ్యతే। వేదశాస్త్రాత్పరం నాస్తి"నదైవం కేశవా త్పరమ్॥"అనిన శ్రుతి వలన భాష్యకారులు విజ్ఞానులు. అత్యంతవిభవమున పరాశరపుత్రుండు చాటిన లక్షణములు బ్రహ్మంబని వశిష్టుడు తాత్పర్యంబునఁబరిగె. దూర్వా సుండు 'మాధవ శ్రీధరములను, వామదేవుండు 'హృషికేశమును, బ్రహ్మ రుద్రాదులు 'సంకర్షణ గోవింద' మంత్రములను. విశ్వామిత్రుండు పురాణ పురుషోత్తమమును, శ్రీకశ్యపాదులు దామోదరమును, శాండిల్యుఁడు శ్రీ నాథమును, గౌతముండనిరుద్ధత్రి తయమును, నారదుండు శ్రీ నారాయణ మంత్రమును, పుండరీక కణ్వాదులు త్రివిక్రమమును, మాండవ్యుఁడు జనార్ద నమును, నాత్రేయుండు శ్రీకృష్ణమంత్రమును, సనకసందన సనత్సుజాతులు వామన మంత్రమును, జమదగ్ని శ్రీరామమంత్రమును, శుక్రుండు శ్రీనార సింహమును, బృహస్పతి నమోనారాయణమును (నుపాసించిరి.). వీరు మొదలైన పుణ్యులు సహస్రనామంబులను, మఱియును మహాత్ములనంతం బులు గూడి యనంతవేదములనియెడు వేదవేద్యుం డనంతంబులం బ్రబలి యుండునని యనంతకోటి రవిప్రకాశంబైన దేవుని యనంతనామంబులఁ గొనియాడిరి, వాల్మీకిఋషిపుంగవుండు భరద్వాజున కెఱింగించె, నీవు నృ సింహమంత్రంబు పఠించి పరమపుణ్యుండవై తనవెనుక భరద్వాజుండును

1. ఇచట "దశాధ్వరం తెక్క" అని కలదు, కాని యర్థము పొసగదు.

సుత్రవిహారమున కుతూహలుఁడై ఋష్యశృంగుని సేవించి యతనిచే సకలపుణ్యంబులు విన'బోయి'[1] శ్రీవత్సమహాఋషీశ్వరుండును, భృగుండును (?) నగు (నాతనికి) నేత్రమున తారకు (నకు) దండప్రణామంబు సేసి మునీశ్వరునితో, 'భృగువెవ్వఁడు ? అది మూలంబేది? అతఁడు, దేనికొఱకు భూలోక భువర్లోక సువర్లోక (ంబులదిరిగె?) కైలాసవాసుని నేలశపించె? బ్రహ్మ నేలశపించె[2]....వాసుదేవుని శరీరంబున కెరిగిన శిశుపాల దంతవక్త్రిల.........[3]స్వామి నిజమంటపంబునకేగి దేవదేవుని భావించి పరిపరిగుణంబుల సేవించి, సకలలోక వృత్తాంతంబును విన్నవించి, జగద్భరితుని నామామృతరసమును సేవించినవాఁడై, యాత్మసంతోషంబున వారిమీద పాదంబులు చాచిమఱచి నిద్రించిన, పాదంబున నమరిన నయన పంక్తి సహస్రముల (హరి) నీరుగావించె. భృగుఁడు నిద్రమేల్కాని నివ్వెరగంది, చిక్కితినని, శ్రీకాంతుని శరణుజొచ్చినఁగాని పనులుతీరవని తెలిసి యాదేవు పాద పద్మంబులకొరగి, భీతుండై 'పరమాత్మా, నిన్ను బాధించి తన్నితి. లోపమూలంబని నాసేరమెంచకు. నన్ను గృపఁజూడు. నీబంటునైన నేను నీనమతులైన మునులకెల్ల నాత్మలోపల మూలంబు నీవని మీచరిత్రము జెప్పి, కన్నులఁగప్పిన కర్మపాశములూడను స్తోత్రంబు లుర్వింజేసెద. అచ్యుతానంతుని దివ్య శ్రీపాదపద్మంబుల నమరిన తీర్థ ప్రసాదంబుల భువిధారుల కెల్లఁబుణ్యంబుల నీయ దసువు (ము). అమరేంద్రవంద్యా, అని యాదిమూర్తిచే నలరిన పేర్కలెల్ల సమకూడ నానంద మంది, జిహ్వాశుచిగా శ్రీజగన్నాథుని పాదతీర్థములఁగాని పాపములు వీడ తావని మునులకెల్ల నెఱిఁగించి పుణ్యులంజేసె. ఇదియుత్తర[4].........యతి రామానుజా, అనాథపతీ, స్వామీ, సింహగిరినరహరీ, నమోనమో దయానిధీ !

---

1. "వినఁదలచి" యను నర్థమున ప్రయుక్తము

2, 3 ఇచట గ్రంథపాతము. కొన్ని వాక్యములు పోయినవి.

4. ఇచ్చట కొద్ది గ్రంథపాతము.

## 36

దేవా, (ఏక) శిలానగరంబనియెడు నొకపట్టణమందు నగసాల పరమ సేవ్యుంతుత్తముండు. (అతఁడు జీవయాత్ర) ను సమాప్తంబు సేసె. అంతట నాతని ప్రియపత్నియైన సతి శవంబునకు విమానంబు గావించి, చిత్రవిస్తారముగా శృంగారములు తనప్రాణవిభుని దేహంబున నొనరించి కనకమయ ప్రాకారపట్టణ మధ్యవీధియందు[1] సమాధి కెక్కించుకొని, సమాధి క్రియలకుఁబోయెడు కామిని, శ్రీకృష్ణమాచార్యులఁ గనుగొని సాష్టాంగ దండప్రణామంబు సేయఁగాను, నంత నేను 'దీర్ఘాయుష్మంతు రాలవై యుండు'మని యాశీర్వాదము సేసితిని. ఆయింతి 'నాకెక్కడి దీర్ఘాయుష్యము? ఓ మహాత్మా! నాపతి కైలాసమున కేఁగెను. నేను సమాధికిఁ బోవుచున్నదానను.' అనిన నేను మహాశ్చర్యమంది, మీ దాసుని వాక్యము వృధాపోవచ్చునాయని, 'ఓన్నమోనారాయణా, శ్రీమన్నారాయణా,' యని దండెయుఁజిటి తాళంబుల ఘుమఘుమ ధ్వనులతో మీ దివ్యనామ సంకీర్తన చెయగాను, గొంత తడవునకు శవమునకుఁ బ్రాణమువచ్చి దిగ్గన లేచి శ్రీ కృష్ణమాచార్యులకు దండమువెట్టి, యోమహాత్మా, మీ మాహాత్మ్యంబునను కైలాసవాసుఁడు (కరుణించె). నీ నిమిత్తంబున శ్రీకృష్ణమాచార్యులు వైకుంఠపతినిఁదారుచున్నాడు. నీవు శతవర్షంబులు లోకమందు భోగభాగ్యము లనుభవించుమని యానతిచ్చి శివకింకరులచేత మఱలఁ ద్రోయించగా వచ్చితినని విన్నవించెను. శ్రీకృష్ణమాచార్యులు కరుణించిన కరుణాకటాక్ష వీక్షణంబుల నోదేవా, యీజీవిని రక్షింపఁజేసితిరి. మీ మహత్వంబు నుతింప నేనెంతవాఁడను? ఆశ్రిత రక్షకుండవు. అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

## 37

దేవా, అన్నమయంబుల వలనఁ ద్రిగుణాత్మకంబైన పంచేంద్రి

---

1. "కనకమయి పట్టణప్రాకార గగనమధ్యవీధియందు" అని కలదు.

యంబులుదయించు. పంచేంద్రియంబుల కొలయంబై సప్త[1] హితవుల నివాసంబై విషయాతుర మమతలఁదగిలి జీవుండు సకలాశాబంధ కరుండై యుండు గావున పుత్రేషణ దారేషణ ధనేషణంబని యెడు మాయయాత్మ తిరుమంత్రాపేక్షలను, నరిషడ్వర్గంబులను జేజిక్కించుకొని బడలెడు జీవున కెక్కడికులము? తనువుచే మనము, మనముచే ధనము, ధనముచేఁ గనకము; ఇట్లు జనులకు దమోగుణం బుదయించుఁగాన ననుదినము మీ పదధ్యానమునందగిలి యుండఁదగును. మీ మాయ,నిర్మలోదకంబునఁ బ్రతిబింబంబు గానవచ్చినక్రియ మనంబునఁ గానవచ్చును. దేవా, ఘనతరంబగు నాచార్యకరుణావిశేషంబువలన నష్టాక్షరి మంత్రోపదేశము చేసినను, సూర్యప్రకాశంబుచేతఁ జీకటిబాసిన క్రియ నాసంసారార్ణవము గడచితిని. శ్రీకృష్ణ కువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ :

## 38

దేవా, ఇక నేనేమి చేయుదు? దైవమా, నా పూర్వకర్మంబులన్ని యుంగూడుకొని సతులై, సుతులై, సహోదరులై, బంధువులై, హితశత్రువులై, యనేకతెఱంగుల నన్ను బెనఁగొని పోనీయక వేపుచున్నవి. నే నేమి చేయుదునో దైవమా? కామములై,క్రోధములై, లోభములై,మోహములై, మదములై, మాత్సర్యములై, చలములై, విద్యావిడంబంబులై, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులై, యనేక తెఱుంగుల నన్నుబోనీయక వేపుచున్నవి. దైవమా, ఇట్టి నాదుష్కర్మంబులన్నియుం బెడఁబాపి, మీ దాసాను దాసునింగాఁజేసి రక్షింపవే. అఖిలజగన్నాథా, అఖిలజగదానందమూర్తీ, జగజ్జీవనా, జగన్నివాసా, అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ :

## 39

దేవా, ఘనత్రిమూర్తులాదిగా నీవిశ్వమజాండము లోపలిది. ఈరీతి ననంతములైన బ్రహ్మాండకటాహములే నీ మేనియణువులు. ఇవియే దిగ్వ

---

1. ధాతువుల.

లయంబులై యన్నిటిలోపల వెలుగొందు. ఓ సింహగిరి నరహరీ, తేజో మహితమై మీమహిమలిట్లు బ్రహ్మాండములై పరగుచు నాదిమబ్రహ్మమై రంజిల్లు. పరబ్రహ్మమై శోభిల్లు. తారక బ్రహ్మమై వర్ధిల్లు. ఇదినిర్గుణమై పరమాత్మమున నణగు. ఇది సగుణమై విరాట్పురుషరూపంబుతో నుండు. ఇది గుణసంయుక్తమై త్రిమూర్త్యాత్మకము దానగు. అట్టి నారాయణ మూర్తియై యఖిలాత్మ తానగు. అట్టియనంత వేదాగమముల కునికి. ఇట్టి యపవర్గ మోక్షమునకు ముముక్షుముక్తి. కైలాస వైకుంఠ బ్రహ్మలోక గీర్వాణములు మా సింహగిరి నరహరి యిచ్ఛా విహారములు. స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 40

దేవా, నిత్యపదంబైన మీ దివ్యనామ సంకీర్తనఁ బఠియింపనేరక (సర్వదేవతలు సాక్షియైన) భర్తను విడచి పరపురుషుంగోరు వ్యభిచారిణి విధంబున నున్నవాఁడను. నన్ను గృతార్థుఁజేయవే! అనాథపతీ స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 41

దేవా, స్వస్తి, సమస్తలోక నిస్తారకా, శ్రీపురాణ పురుషోత్తమా, శ్రీలక్ష్మీకుచ కుంకుమాంకిత వక్షఃస్థలా, గాంభీర్యధైర్యా, సనకసనందన సనత్కుమార కపిల నారద మునీంద్రవందితా, విభీషణ ప్రహ్లాదార్జునాంబరీష ప్రియా, రుక్మాంగద గజేంద్ర సేవాలాలితా, భృగుభరద్వాజ మాండవ్య మార్కండేయ గౌతమ శౌనకాదిముని గణసేవితా, శ్రుతిప్రియపూజితా, బ్రహ్మాదిసురముని హృదయస్థితా, త్రిమూర్త్యాత్మకా, నైరృతవరుణ వాయుకుబేరేశానాది దిక్పాలేశ్వరా, లక్ష్మీనారాయణా, యమునోత్పల లోక పాళారా, బింబాసమ నవరత్న ఖచిత పాంచజన్య భవ్యజ్వాలాభిరామా, బాలా ర్కమణి గణాంకితసందర్శన గరుడధ్వజా, అనంతశయనా, క్షీరాబ్ధిశయనా, అనేకదైత్యనిర్జిత దోర్దండా, మత్స్యకమఠ వరాహ నారసింహమూర్తివామన

జామదగ్నిరామ దశరథరామ రామకృష్ణ బుద్ధ కల్క్యవతారా, కార్తవీర్య సహస్రబాహుఖండనా, విలువిద్యా విక్రమ ప్రియానుగ్రహణోత్తరణా, గంగాప్రవాహోద్బాధిత[1]లోక జాతశ్రేష్ఠా, జ్వరాకరాళ వైశ్రవణ తదీయ రచితార్థరాక్షస ప్రళయాంతకా, హేమసుచరిత్రాసమేతా, సకల (లః) రక్షణ సంపూర్ణా, హలాయుధధరా, దేవకీవసుదేవప్రియాత్మజా, యశోదా నందవర్ధనా, కుక్కుటాసుర భస్మాసుర శకటాసుర ధేనుకాసుర ప్రలంబాసుర గర్వమదదర్వీకరా, బలభద్రానుజా, బృందావన లీలావినోదాబ్ధి రామాభిరామా, సకలాంధకారమార్తాండా, (రుక్మిణీ) మనోవల్లభాః సత్యభామా మన స్సరోవర రాజహంసా, జాంబవతీముఖ సంపూర్ణచంద్ర చంద్రికా చకోరా, మిత్రవిందాప్రమేయా, భద్రాప్రాణనాయకా, సుదంతీమనోరంజకా. కాళిందీకందర్ప స్వహాసా, లక్షణాసకల కళాప్రమేయా, షోడశసహస్ర (గోప)స్త్రీ హృదయానుకూలా, అనాదిబ్రహ్మచారీ, పాండవపక్షపాతీ, గాంధారీ పుత్రమిత్రదవానలా, సకలసన్నుతా, ఆపదుద్ధారకా, శ్రీకృష్ణా, శరణాగత వజ్రపంజరా, దివిజబ్రహ్మాదివంద్యా, ఉగ్రనఖత్రిపుర భేతాళా, కరినిర్వాపణా, దుష్టనిగ్రహా, శిష్టప్రతిపాలకా, ధర్మరక్షకా, అశ్వపురఘట్టన నిపుణా, అనంతావతార లీలావినోదా, శంఖచక్రగదాశార్ఙ్గ కోదండ సకలాయుధప్రచండా, పద్మవనమాలికాధరా, వేదవేదాంతవేద్యా. కుసుమిత మకరతోరణాలంకారా, శ్రీపుండరీకాక్షా, శ్రీనృసింహమూర్తీ, శ్రీసహస్రనామా, శ్రీయనంతనామప్రసన్నా, శ్రీమద్భగవాన్, శ్రీనివాస, సర్వేశ్వర, శ్రీలక్ష్మీసమేత, శ్రీకృష్ణ కువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ ః

# 42

దేవా, జయజయ, పరమపురుషా, పరమపదనివాసా, పరంధామా, పరతత్త్వప్రకాశా, అచలాచలా, అనుపమా, ఆదిపురుషా, అపరంపరా,

---

1) హోద్బాధిత ?

అవ్యక్తా, అగణితగుణానందా. అమరేంద్రవంద్యా. అభయస్వరూపా, అఖిల బ్రహ్మాదిజనకా, విశ్వంభరా, విశ్వతోముఖా, శాశ్వతసచ్చిదానందా, ఏక రూపా, త్రయరూపా, పంచరూపా, అష్టరూపా, దశరూపా, శతరూపా, సహస్రరూపా, అక్షయలక్ష విచక్షణ ప్రమోదా, విచక్షణాలంకారా, నమో విభీషణ మోక్షకారణాయ. శ్రీకృష్ణకువ్వారుస్వామీ, నమో నమో దయానిధీ!

# 43

దేవా, మీ దివ్యమంగళంబైన ద్వయతిరుమంత్రాచార్య కృపా కటాక్షములవలనఁ బుట్టినమనుజుండు క్రితమున సుజంనుఁడయిననేమి దుర్జనుండయిననేమి? అతండె మీదివ్యపదంబును బొందును. అదియెట్లన్నను, సకలలోహముల ఖండించెడు లోహమును, వేదశాస్త్రపురాణములు వ్రాసెడు లోహమును పరుసవేది సోకిన సువర్ణమైనట్లు పెద్దలైన ప్రపన్నుల మేదినీసురుల నాచార్యులఁ దల్లిదండ్రుల నవమానముజేసి తిరస్కారములొనరించిన దుర్మార్గుండనంతకోటి బ్రహ్మకల్పంబులందు క్రిమికీటకాదుల సంగతి నొక్కఁడే చరించుచుండు. అదియెటులన్న వినుఁడు. తొల్లి యింద్ర(ద్యుమ్న?) మహారాజు మహాత్ముల తిరస్కార రూపంబునఁజేసి కుంజరయోనియందు జనియించి మహాకుటిలపడి మఱియెట్లు ఖర (మకర) వంశంబున ముక్తుండాయెను. ఇది మీరెఱుఁగరా? సకలజగద్విదితము. శ్రీకృష్ణకువ్వారుస్వామీ, సింహగిరి నంహారీ, నమో నమో దయానిధీ!

# 44

దేవా, మీ ముఖారవిందంబున వెలసిన బ్రహ్మ లోకాధి (కార) పరుండై యనంతకోటి వేదశాస్త్ర పురాణేతిహాస వర్ణంబులు వర్ణించి యూహించి యనేకయిడుములఁ బొరలుచుండె. మీమాయ దలంప నెవ్వరి వశము? దేవా, నిత్యవినోదా, నిత్యకళ్యాణా, భోగభాగ్య సంపన్న దేవతా మూర్తివి. దేవదేవోత్తముండవు. నిధానకల్పుఁడవు. దేవకీపుత్రుఁడవు.

నిర్మల చరితుండవు. పారిజాతాపహార పరమపురుషుండవు. పరంజ్యోతి పరబ్రహ్మరుద్రాదులు మీపాద యుగళంబులు, కానంగలేని మాయాప్రకాశంబువై విహరింతువు. దేవా, కాశిలోన, తారకబ్రహ్మ రామమంత్రముల రుద్రుండు మిమ్ము నుతియింప, దొడంగె. ఆకాశిలోన పార్వతీదేవి సహస్ర నామములొనర్చి భక్తిఁబ్రత్తమునఁజేర్చి గ్రక్కునమోదాటె.[1] ఓం రామ రామ రామ రామా, అనాద్యఖిలలోకారాధ్యా, నిత్యజగత్త్రాణా, నిత్య నిర్వాణా, సత్యవ్రతాధీశా, ఆత్మబంధుజనరక్షకా, పరమాత్మా, వినుము. తల్లివి తండ్రివి దాతవు నీవు. భ్రాతవునీవు. నీవంటి తేజోమణి నాకు గలుగంగా పాశబంధములూడెను. మోక్షసాధనంబులు మునిగణవర్గజాలంబుల కుపదేశించిన నుపనిషద్వాక్యంబుల మిమ్ముగానంగలేరు. మీకథ వెల్ల(?) మీ నయనంబులు. సూర్యచంద్రమండలంబులఁ బ్రకాశంబులై యుండును, మీతిరుమేనిదీప్తుల,ఋషులు, ద్వాదశాదిత్యులు, నవబ్రహ్మలు, నేకాదశరుద్రులు,చతుర్దశ భువనంబులు, నింద్రాదిదేవతలు ననేకముఖంబులై యుండుదురు. దేవా, మీతిరుమేన గలిగిన దివిజులకు మాయ మహోన్ముఖంబులై తోఁచు. దేవా, మీ మాయా దివ్య స్వరూపంబులై నట్టి తేజోమణి రవిప్రకాశంబున రవి నిద్రమేల్కనం దివిజులకుఁ గనిపించె. మీమాయలుగానక దేవా, తిరుగుచుందురు. ఇంద్రాది దేవతలు తిరిగి మీయందు గలిగిరి. శ్రీకృష్ణాయని స్తోత్రము జేయఁగలిగిన మఱి తక్కిన దైవతంబుల మీదంగానరు. బ్రహ్మరుద్రాదులు మిమ్ము వర్ణించలేరు. అనాథనాథాయని స్తోత్రంబుసేయ నీ జన్మంబుగలిగెను. మీ నామసంకీర్తనమువలన మిమ్ముగంటిని. మీ దాసులఁగంటిని. చాతుర్లక్ష గ్రంథసంకీర్తనములలో నొక్కసంకీర్తన పలికిన వారికి, పలికించినవారికి, విన్నవించినవారికి, లిఖించినవారికి సాలోక్య సామీప్య సారూప్య పదవు

1. "మోదాటు" దీనియర్థము కాన్పించదు. "ముక్తిఁజెందు" కావచ్చును.

# 45

లిత్తురు. దేవా, మీరు నాకిచ్చిన వైకుంఠం బిత్తురు. మీయాన. మీచరణంబులాన. తప్పదు తప్పదు. సుకృతమే సాక్షి. అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ :

దేవా, నేను భూప్రదక్షిణంబు నేసి లోకములు సూచి, మాతా పితామహులకు పుణ్యక్షేత్రంబులం గృష్ణార్పణబుద్ధిగాను దానధర్మంబులు నేసి, శ్రీ యహోబిలమును, శ్రీరంగంబును, వేంకటాచలంబును, కాశీక్షేత్రంబును, ద్వారకంబును, నయోధ్యయును, శ్రీపురుషోత్తమమును జూచి, దేవా, మీగృహంబున కరుగుదెంచిన కవాటంబులుమూయ మీకుందగునా? అజ్ఞానిని, యపరాధిని, సర్వేశ్వరా, నీవేతప్ప నితఃపరంబెఱుంగననిన, గవాటంబులు దెఱచిన, స్వామి సన్నిధికింజని స్తోత్రంబు సేయందొడంగిన స్వామి ప్రత్యక్షమై, నీవు నా సన్నిధిని దాసుండవలెంగాక పొడగనవాయని యానతిచ్చిన, దేవా (నీవు) జననీజనకుండవు, దేవా, శిశువునంతటి తప్పుచేసినాను. తెగనాజ్ఞ చేయవచ్చునా యనిన స్వామి తిరోహితుం డాయెను. కృష్ణమాచార్యులు తన గృహంబునకుం బోయెను. కృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ నమో నమో దయానిధీ :

# 46

దేవా, మీదివ్యనామ సంకీర్తన మెవ్వండాయెనేమి, చేయగా విని యిదిహీనము. ఇదిహెచ్చు. వర్ణంబులుగావని నిషేధించినవారరువది వేలేండ్లు నరకగోళంబునుం బొందుచుండి యటమీద పిశాచత్వము బొందు చుందురు. దేవా, మీదివ్యనామ సంకీర్తనమెవ్వరు నుతియించిరి, వారెపో ఘీపరమభాగవతులు. వారెపో యనేకశ్రుతులు పలుకుచుందురు. దేవా, అభ్యసింపరానివి రెండు. ఆచార్యకటాక్షంబొకటి. అటుమీద (మీ) దాసుండగుటొకటి. దేవా, బహుచింతా సంతతమై చరియించెడు వాయువువలెనే యొకమార్గమనక నీమనసు బహురతింబొందు. అనేక వికృతులంబొందు.

చిత్తమా, కైవల్యమునకై నుతింపవే, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ ।

## 47

దేవా, పర్వతంబునకుఁబోయి శైవులగుదురు. తిరుపతులఁజూచి వైష్ణవులగుదురు. శక్తిమతంబునుజూచి కుశాలులగుదురు. ఇటువంటి మన స్పంచలనమునఁగదా రౌరవాది నరకగతిరయై యిహపరములు లేకుండుట. ఆత్మజ్ఞానులైన జనులే మతాభిమానులు. శాస్త్ర వైరాగ్యములలో బాధలు చెప్పంబడు. వానినేయవలంబము చేయుదురు. ఈమతమా మతమన దిరిగెడు నట్టి కుమతుల నేనేమందు. సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

## 48

దేవా, కోశమున నొంటరిగాఁజిక్కి యాక్రోశముఁజేసిన కోకిలం జూచి, కాకులు దాని నటునిటుఁజననీకఁ జిక్కించపఁజేసిన క్రియను జిక్కు పడియున్నాడఁను. సంసారతరంగములు ముంచుఁగు పడనడచిన తెలివిఁ బొందని జంతువును [1]యుషాది నానావిధముల (జంతువులు) నారపీచువలె నప్పలమిపట్టియున్నవి. ఆకర్మలనవరతము హరిభక్తిందేలనీయవు, ఈ జంతువునకు, గర్మములనణంచి సుకర్మిని జేయుమయా, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ ।

## 49

దేవా, బహువిద్యలు (గల)వారినిగాఁజేసి బహురూపంబులఁ బొంద జేయకు. ఏవర్ణమైననేమి ? మీదివ్యనామ గుణసంగతి గలుగఁజేసి, మీ దాసానుదాసునిగాఁ జేయవే. కరుణాంబుధీ, శ్రీకృష్ణకువ్వారుస్వామీ, సింహ గిరి నరహరీ, నమో నమో దయానిధీ ।

---

1. ఈషణాది

## 50

దేవా, గరుడని చేతఁబడియున్న భుజంగముక్రియను, కర్మములనగపడియున్నాఁడను. నిరంతరము దుర్విషయాటవిలోఁబడి వెలువడు త్రోవంగానక చిక్కియున్నాడను. దేవా, సుజ్ఞానఖబను, తెలివిసిఁదొఁడవ (యున్న) యీ దుష్టునకు సజ్ఞానంబను నడవిని ఛేదించి పరమ జ్ఞానమార్గము కరుణించవే. సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

## 51

దేవా, ఎనుబదినాలుగులక్షల జీవరాసుల యోని ముఖములందు ఉని యించిన యాదిజీవుండనట ! ఆమీద మీగుణకథనము తెలిసికొనుట, నామీదట నాచార్యుల కృపఁజేరుట, నాసుదర్శన పాంచజన్యంబులు ధరించుట, నాశ్వేతమృత్తికాచూర్ణ ధారణంబగుట, నావిరజానదిందాటఁజింతఁజేయుట, నా చరమార్థంబనియెడు తెప్పఁగట్టి యాద్వయమనపతరంబు సంధించుచు, నంబుజావతారుండగుట, నామీద నిజపురప్రవేశంబగుట, మీ సందర్శనంబు గలుగుట, మీరునుతానైక్యంబగుట, నాయనంతకోటి సూర్యప్రకాశముతో ప్రజ్వరిల్లెడు (మూర్తి దొరకుట)నిట్టిఫలంబు లొకటొకటియై తోచెడుదేవా, అఖిలాత్మకర్తవై, సింహగిరిపతివై, యనేకజన్మార్జితమైన పాపిని కటుణించవే, పరమమందెన్నడు దొరకునో మీచరణారవింద మకరందము ! దీనబాంధవా, సింహగిరి నరహరీ, నన్నవలోకింపు దయానిధీ !

## 52

దేవా, దేహయాత్రకు మిగిలిన యర్థసమర్పణ ముఖ్యముగాదు. తన్నుడిగిచేయు సమర్పణంబుత్తమాధికారంబు. అనాథపతి సింహగిరి (నరహరీ) ఖండటుగాని ఆవలోకింపఁడుదేవా, జగదీశ్వరుండితఁడేయని నిగమములెల్లను నా యనంతకోటి సూర్యప్రకాశముతో (ప్ర) జ్వరిల్లెడు (మిమ్ముగురించి) చెప్పగానెఱుంగక, దేవతాంతర మంత్రాంతర సాధనాంతర

ప్రయోజనాంతరంబులం గోరెడువాఁడు ద్విజుండుగాడు. శ్రుతిప్రమాణము చాటించుచున్నది. అటుగాన, ననాథపతిస్వామీ, సింహగిరి నరహరీ,మిమ్మెఱుంగని ద్విజునకేదిగతి? ఎఱింగింపవే దేవా, ప్రాణములిహమునఁ జరియింపుచు, దేహాత్మ సెంధముల వసియించి, భుజియించి [నవనిపూత] భువనపాలన రక్షకుండయిన పురుషోత్తముని కృపకు దూరమగుటఁగాన నిహమునకష్టుండుగాడు. మాంసభక్షకులే రాక్షసులు. అటుగాన హింస చేయరాదు. ఇందుకు సాక్షి యేదన్నాయన మా సింహగిరి నరహరి సకలాంతర్యామి యగుట, సకలభూతాత్మకుండగుట, సకలపరిపూర్ణుండగుట, సకలజీవ దయాపరుండగుట, సత్యమేసాక్షి. అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 53

దేవా, పరమపురుషా. దేవా, దయాపరా, పరమధర్మనికరా, దుఃఖవిమోచనా, మంగళాకారా, దోషనిర్హరణా, నిరవద్యా, నిరవధికా, నిత్యనిరంజనా, నిర్వికల్పా, నిరాలంబా, నిరాశ్రయా, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 54

దేవా, సద్విజుండు చండాలసతివలన సంతతిఁబడసి నటువలెను, ద్వైమైకనిష్ఠుండు ప్రసన్నురాలిగాని భార్యనేలందలంచిన, యట్టివారెల్ల ననాథపతీ,స్వామీ, సింహగిరి నరహరీ, పరో.... ..........రు.[1] కాన సింహగిరి దేవా, పరమపదనివాసుని దయను, భూలోకంబునఁ బుట్టవలసి సంతూరను జనియించి, (దుష్ట) నక్షత్రమున వ్యతీపాతయోగంబున జనియించియుండెనని, తన్నురోసి తన జననీజనకు లంధకారంబైన కూపములోవైచిన, రోదనము జేయుచుండగాను, నొకసన్యాసి శిరోమణియైన కువ్వారేతెంచి

1. కొద్ది గ్రంథపాతము.

యద్భుతంబని నన్నుదిగిచి మఠములోఁబెట్టి, యీబాలుండు పురుషాకారము గలవాఁడు. ఇతనినేవిధముననైనను బోషింపవలయునని తలంచి కొన్ని వర్షంబులు పెంచి, యంతట సంతూరువిడిచి సింహాద్రి స్వామి సన్నిధికిఁ జనునప్పుడు నన్ను మఱచకుమని పలికిన కువారపుండు స్వామిసన్నిధికిఁ జనెను. త్రిరాత్రంబులు శిశువుచూచి సింహగిరీశుండైనస్వామి తనమీఁద దయదప్పెనోయని యున్నసమయంబున, బాలరూపంబున వచ్చినస్వామి క్షీరంబులుదెచ్చి యుపయోగింపుమనినఁ బుచ్చుకొని లోపలికేగి హస్తములఁ నయనములు దుడుచుకొన్న సమయంబున నంధత్వముమానె. (అతఁడా) శ్చర్యపడి నిద్రించు సమయంబున స్వామి తనస్వప్నంబున వరాహ రూపంబునఁ బ్రత్యక్షంబై, నాసన్నిధిని సంకీర్తన నామోచ్చరణంబులు, నుపనిషద్వాక్యంబులును, పరమ (భక్తిభరిత) చాతుర్లక్ష గ్రంథ సంకీర్త నములు చెప్పుమనెను. 'నేనెక్కడ ? నామోచ్చారణంబెక్కడ ? జడుండను, మూఢుండను. అనినస్వామి యుపదేశముజేసిరి. తాను పురోహితుని గృహంబునకుంజని తనకు సంకీర్తన నామోచ్చారణం బుచ్చరింప ముహూ ర్తము బెట్టుమనిన విప్రుడుహాస్యముచేసె. స్వామి తనవాక్యములు సలుపు కొని వికృతిసంవత్సరంబున జన్మంబును, (బొందుటయు) పరాభవసంవ త్సర ఆషాఢ శుద్ధ ద్వాదశినాడు చిటితాళంబులను బూని సంకీర్తనచేయు చుండగాను, నంతట కువ్వారేతెంచి, యాశ్చర్యపడెను 'మీ సందర్శనంబున, గృతార్థుండనైతి'ననిన కువ్వారు 'నామోచ్చారణంబు సత్యంబు'ననగా, నన్నేలినస్వామి నన్ను రక్షించుగాక. శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 55

దేవా, (యమునా) గోదావరి యావల శ్వేతద్వీపమందు (?) మా మేనమామ శ్రీరంగాచార్యులు గలరు. వారి (కుమార్తె) యందు తిరు కల్యాణము గాబోవుచున్నాఁడను. ఇది మీకు విన్నపము నేయుచున్నాఁడను తిరుకల్యాణమునకు పనివినవేదేవా, యని మీకు విన్నపము సేసిన 'నేను

వేంచేసెదనోయి కృష్ణమాచార్యా'యని యానతిచ్చిన 'ఓం నమోనారాయణాయ, మీరేల వేంచేసెదరు ! ప్రహ్లాదవరదా,' యటంచు మీకు విన్నపము సేసిన 'నల్లనాడోయి, కృష్ణమాచార్యా, నీవు పదునొకండవ యవతారుండవు. లీలావినోదముతో నీ తిరుకల్యాణము చూడ వేడుకయ్యెను. నేనును వేంచేసెదను.' అని యానతిచ్చిన 'నల్లే కానిండు. ఓం నమోనారాయణాయ. ఇది మీరెఱుంగుదురో యెఱుంగరో, మిమ్మెవ్వండు నమ్మవచ్చునా? ఓం నమోనారాయణాయ. జగన్నాటక సూత్రధారివి గావా! సుగ్రీవుని చేపట్టి వాలిని మర్దించిన వాఁడవు గావా! మిమ్మెవ్వండు నమ్మనే ? ఓం నమోనారాయణాయ. మిమ్ము నమ్మరాదు,' అనిన, 'రావోయీ, నేవచ్చెదను, లక్ష్మి తిరుకల్యాణమునాడు సురాసుర యుద్ధమాయెను. వేదశాస్త్రఘోషంబై యుండెను. రుక్మిణి తిరుకళ్యాణమునకు శిశుపాల యుద్ధమయ్యెను. ఏతిరుకల్యాణమునకు వేడుక చాలదాయెను. నీ తిరుకల్యాణము చూడవచ్చెదనోయీ, కృష్ణమాచార్యా'. ఆ క్షీరసాగర మధ్యమందున్న వైనతేయుని నీవిధమున స్తోత్రము సేసితిని. "భద్రబదంతే జవ్వలతో దృపాఅపస్సమాః । మద్యమకేశవా ఓం హవాం । పాతతవోమధ్యానాత । అఖిలాండజాతజాం" ఆక్షీరసాగర మధ్యమందున్న వైనతేయుండు పనివినియెను. దేవా, వైనతేయునెక్కి మీరును వేంచేసితిరి దేవా. మామామ శ్రీరంగాచార్యులు నాతిరుకల్యాణమేవిధమునఁ జేయుచున్నాఁడు విన నవధరింపుము. కృష్ణార్పణముగా దానములు గావించెను. వైష్ణవులకు మధుపర్కములు సమర్పించెను. నాయింతికి నాకును నిష్టాన్నమును భుజింపఁజేయునప్పుడు మీరు వేంచేసి, 'యిదియేమి? కృష్ణమాచార్యా, మీరే భుజించుచున్నారు? నేను మహాయలపై యున్నాఁడను. తళియవడ్డించవోయి, కృష్ణమాచార్యా'. యని యానతిచ్చినమీకును తళియవచ్చెను. (మీరును) నేనును భుజియింపంగాను నచ్చటికి శ్రీరంగాచార్యులు వేంచేసి, 'యదేమి కృష్ణమాచార్యా, ఇతడు చరముండై యున్నాడు. మీకును యజ్ఞోపవీతములులేవు. ఇతఁడు వైష్ణవుడవి తళియవడ్డించితిని. వైష్ణవులకు మధుపర్కము లిప్పించితివి. శూద్రునకు నిష్టాన్నమును భుజింపఁబెట్టితివి.

నీవువెలి'యని మామామువెలివెట్టి నన్ను తిరుమాళిగనుండి వెళ్ళంద్రోచెను. దేవా ! మిమ్ము నెవ్వండు నమ్మును ? దేవా, ఓం నమోనారాయణాయ, తిరుకల్యాణము విఘ్నముచేయవలసి వేంచేసినాఁడుగాక మిమ్మెవ్వండు నమ్మును? ఓం నమోనారాయణాయ. ఆచార్యుచే గతి నన్ను మేమెల్లమనిన విని, 'ఓయీ, కృష్ణమాచార్యా, నీకెంతప్రలాపంబేమిటికి ? మాకు మనిన నట్టిదే కానిమ్మని ఓం నమోనారాయణాయ యంటిని. ఆరాతిరి (మీరు) శ్రీ రంగాచార్యుల స్వప్నమందుఁబోయి, కృష్ణమాచార్యులయింటికి యీరాయన తిరుమాళిగకు వెంటఁబెట్టుకొనివచ్చి దిగవిడువుమన్న మాటకు (నాతఁడు) దండము సమర్పించెను. శ్రీ రంగాచార్యులు నమతిరుమాళిగకు వేంచేసిరి. ఇదియే నా విన్నపము. ఓం నమోనారాయణాయ. భ్రష్టోపవనా, నీకన్న నధికులులేరు. నాకన్న నధములులేరు. నాయింతిని నాకు నంపించితిరి. వెలియన్న మాటకు దండముసమర్పింపఁజేసితిరి. ఓకగపడి యున్నాఁడను. నాకంతమెన్నఁడు ! విషయాటవిలోఁబడి, వెడలెడు త్రోవఁగానక చిక్కి-యున్నాఁడను. సంకీర్తనమిది. (ఇందు) పరమ రహస్యమున్నది. ఇందు ఋగ్వేద మున్నది. యతిరామానుజముని వరము, దాతారు, అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

## 56

దేవా, విప్రగోవధలనేకంబుఁగొనర్చి సురాపానసువర్ణఘాతుకాది మహాపాతకంబులు చేసినయతండైనఁగాని, యేకనిమిషంబున మీ దివ్య నామ సంకీర్తనచేసినతండే నారాయణశ్రేష్ఠుండుకాఁడుండునా ? ఇతరులు మెచ్చవలెనని మనస్సు వేఱొక్కచోనిలిపి మిమ్ముసుతిచేసెనేని జారిణిని పతివ్రతయని నమ్మవచ్చునా? అట్లేయిట్టివారు అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 57

దేవా, నేను చిన్ననాడు చేసిన యఘాయిత్యము జెప్పుచున్నాఁడను. దేవా, ఒక కోమటి పిన్నవాఁడును, నేనును కోటి కోడిపుంజుల జూదమాడ గాను నా కోమటిపిన్నవాఁడు తొంబదిలక్షల పైకాలకు పందెమొడ్డెను. నేనును, మీ తళియప్రసాదములపై పందెమొడ్డితిని (!) ఇట్లు నా కోమటి పిన్నవాని కోడియు, నా కోడియు నేవిధమున యుద్ధముచేయుచున్నవి. దేవా, "ఘటితముఖవరదధిత సంధిత కౌస్తుభాంశు.... మకుట కఠోరవందిత కుంభినీజయ శోభితమ్। కనకఘనపీతాంబరాచ్యుత కౌస్తుభాజయశోభితమ్ గీతడోలక ఆదిజం । కిణికిణింకిణి । కిణికిణింకిణి । కిణికిణింకిణి । కిణికిణిం కిణ । దేవా, అనాథపతీ స్వామీ, సింహగిరి నరహరీ, ఈ గీతమువిధంబున యుద్ధము సేయుచుండగాను, నా కోమటిచిన్నవానికోడి తన్నెను. నా కోడి మృతమాయెను. కోమటి చిన్నవాఁడు తనకోడి గెల్చెనటంచు తిరువీథులను పౌరుషంబులాడగాను నేను కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యంబుల రొంటి మదోన్మత్తుండనై యా కోమటిచిన్నవాని తిరుకుచ్చుపట్టి[1] మాఱి తిసి. (?) ఆ కోమటి చిన్నవాఁడు మృతుండాయెను. దేవా, వాని ప్రాణ వాయువులు వాని కిచ్చెదవా యియ్యవా యనిన నతని ప్రాణవాయువు లీయ కున్నను జూచి, దేవా, మీరు శబరి ఎంగిలి తిన్నది చెప్పుదునా, యతని ప్రాణవాయువు లిచ్చెదవా యియ్యవా యనిన నతని ప్రాణవాయువు లీయ కున్నను జూచి, దేవా, మీ రంధకాసుర తాటకాసుర విదళితాసుర ధేను కాసుర సోమకాసుర కంసాసుర (వధల) లోపల నపశబ్దంబులు భాషించినవి చెప్పుదునా, యితని ప్రాణవాయువు లిచ్చెదవా యీయవా యనిన నతని ప్రాణవాయువులీయకున్నంజూచి, 'నీకు చాతుర్లక్ష గ్రంథ సంకీర్తన కాయను మాతల్లి కడవాడవా? నీవు మా కెన్నాళ్ళ ఋణస్థుండవో! నీకు నే నెన్నాళ్ళ ఋణస్థుండనో!' యటంచు మీకు విన్నపము సేసిన నాకోమటి పిన్నవాఁడు దిగ్గనలేచి కూర్చుండి యందెలుమువ్వలు మ్రోయుగాను తన

---

1. పరిమాఱితిని (?)

గృహంబునకుఁ బనివినియెను. దేవా, ఏ వాకారసుకృతివి. ఇది పూర్వ భాగసంకీర్తన (?) ఇది దానసంకీర్తన ఇది (?) పరిప రిమాహాత్మ్యము. శ్రీకృష్ణకువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 58

దేవా, దినదినంబులు దుర్భాషలాడిన నాదు ఉపన్యాస మీ దివ్య నామసంకీర్తనం బొకటి చాలదా? పంచమహాపాతకశతకోటి హరింపము చేయను, దూదికొండకు సహస్రభాగ మనలము చాలదా వహింప? శ్రీకృష్ణ కువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ !

# 59

దేవా, పరంజ్యోతిపరతత్త్వంబైన యాదినారాయణ శ్రేష్ఠుండు లోకంబుల విహరించుచు నుత్పత్తి స్థితిలయంబులు సేయుచుండి యొక నాడు లక్ష్మీభూకాంత నీళలతో వినోదించుచుఁ, దారకబ్రహ్మంబైన రహస్యంబులు దెలుపుచు సుఖగోష్ఠిని వైకుంఠ వాసుండై యున్న సమయంబున భూలోకంబున ధర్మాధర్మంబులు లేక ననేకజనులు దేవతా నమస్కారంబు లుడిగి రాక్షసకృత్యంబులు గైకొని దుర్బలులై, వర్ణాశ్రమంబులు లేక చండాల గోష్ఠిం జరియించుచు, గోవధయు, విప్రవధయు ధనచోరత్వంబునను, మద్య పానంబులను, దెగించి శక్తిమయంబైన వివిధభంగుల విహరించుచున్న యాగడంబులుజూచి, యింద్రుండును, దేవతాసమూహంబులను, యక్షులను, గంధర్వులను పన్నగులను, వాసుకి(?) పుండరీక యాజ్ఞ్యవల్క్యులను, భరద్వాజ గౌతమ వశిష్ఠ గార్గ్య దీప్తిమంత నారదాదులైన మునిగణంబులఁజూచి, 'యుగ ధర్మము విపరీతమాయెను. రక్షకుండును, శిక్షకుండును నైన పుండరీకాక్షుఁ డున్న యెడకుఁ బోదము రమ్మ'నుచు, నజాండంబునకుఁ జని బ్రహ్మను గూర్చుకొని, కైలాసంబునకుఁజని, శంకర ద్వారంబునకు వచ్చి శమలజుండు శంకరునితో విట్లనియె. 'యుగయుగంబుల స్వామి యవతారంబు

వెత్తి యోంకార రూపంబునఁ జరియించెడు గానఁ బుణ్యం బిది, పాపం బిది, యని యెఱుంగక జనులధోగతిం బడుచున్నారు. ఇందులకుఁ గర్తయు భోక్తయునైన పురుషోత్తమునికి విన్నపము చేయుదము, రండ'నుచు బ్రహ్మాదులు, శంకరుండును వైకుంఠంబునకుఁ జని, చక్రధారులును, ఫాల ప్రదేశంబున తిరుమణి శ్రీచూర్ణములును జపమాలికా శోభితులైన పుణ్యులును, వేద శాస్త్ర పురాణ నామోచ్చారణంబులం బొదలెడు వారలును, శమదమాది గుణంబులఁ బ్రీతింబొందియున్న వారలును, విష్వక్సేన గరుడ జయ విజయ కుముద కుముదాక్షులును జేరి యుభయ పార్శ్వంబుల సేవచేసి విహరించుచున్న వైకుంఠపురంబు చేరిరి. శ్రీకృష్ణకువ్వారు స్వామి, దేవా, ఓంనమోనరహరీ, యనుచు పరంధాముని నగరివాకిటికిఁ జనుదెంచి, నారదుఁడు వీణియ మీటి యాలాపనచేసి యాడుచుఁ బాడుచు నున్న సమయంబున నాదిశేషశయనుండై యుండి లక్ష్మిని జూచి యిట్లనియె, 'నాదాసులైన వారలు నన్ను బేర్కొనుచున్నారు. శ్రీవైష్ణవులను మన్నన చేయవలె. పోదముర మ్మ'నుచు దేవసంఘంబులున్న కడకు చనుదెంచెను. శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరినరహరీ, నమో నమో దయానిధీ!

# 60

దేవా, ఒకపరి మిమ్ము నెఱుంగఁపడుమయ్యా. ఒకపరి మిమ్ము నెఱుంగమయ్యా, జ్ఞానిని చేయుమయ్యా. అజ్ఞానిని చేయకుమయ్యా. పుణ్యం బిది, పాపం బిది, స్వర్గం బిది, నరకం బిది, యాచారం బిది, యనాచారం బిది, నిషేధం బిది, యనిషేధం బిది, వావియునిది, వరుసయునిది, వర్తనం బిది, వివేకం బిది, యవివేకం బిదియని యనేక కర్మతంత్రంబులు ఘటించి యసంఖ్య జీవకోట్లం బుట్టింపుచు, పెరిగింపుచు, నణగింపుచు, బహుమాయల బహునాటక సూత్రధారివై యాశాపరుండవై, కులజుండవై, నిర్జీవుండవై, జీవంబులన్నియు నీవై, యేకమై, యనేకమై, యాకాశంబై, యనాకాశంబై, నిలకడయై, బయలై,

వినోదించుచు, నింద్రజాల మహేంద్రజాల విద్యలం బచరింపుచు, పశుపక్షి నరమృగ క్రిమికీటక పిపీలికాదుల ప్రాణంబులు నీవై యున్న, నీ మహత్త్వము దెలియ బ్రహ్మరుద్రాదులును, ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్య రుక్మాంగద విభీషణాది పరమభాగవతులు మిమ్ము నుతియింపలేరు. మిమ్ము నుతియించ నేనెంత వాడను? అధమాధముఁడను, నరపశుఁడను, నీవు గాచి రక్షింపవే. అనాథ పతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 61

దేవా, ఆకలి యనియెడు తెవులింటింటికిఁ దప్పు. అసత్యర్పుడే ముప్పు. తగవు. ధర్మము నడిపినదే యొప్పు. అనాథపతీ, నరహరీ, మిమ్ముఁదలంపనిదే తప్పు, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 62

దేవా, హిరణ్యనాభ కమలంబునఁ దామసగుణంబున సరస్వతీ (పతియు) నేనును (?) బుట్టితిమి, ఈవిధంబునఁ గారణకర్త యైన మీ యందు విశ్వప్రపంచంబు పుట్టింపఁదలంచి, పంచశతికోటియోజన పరిమాణంబును, కోటియోజనంబుల యౌన్నత్యమునుం గలిగి హిరణ్మయంబుగా నొక్క యండంబు గల్పించె. అయ్యండంబు బ్రహ్మాండంబనం బరగె, అందాకాశంబు కల్పించె. ఆకాశంబువలన వాయువు, వాయువు వలన నగ్నియు, నగ్నివలన జలంబును, జలంబువలనఁ బంచమహాభూతం బులును గల్పించె. అందాకాశంబునకు శబ్దంబొకటి గుణంబయ్యె. వాయు తేజములను గుణద్వయంబు పుట్టె. తేజంబునకు శబ్దస్పర్శ రూపంబులను గుణత్రయంబు కల్పించె. జలంబువలన శబ్దస్పర్శ రూపరసంబులను నాలుగు గుణంబు లుద్భవించె. పృథ్వివలన శబ్ద స్పర్శ రూపరస గంధంబు

లేసునుం గలిగె. ఇట్టి పంచమహాభూతంబులకు సావధానంబులుగా స్వర్గ మర్త్య పాతాళంబులను జగత్త్రయంబుల నిర్మించె. స్వర్గంబున దేవతలును, మర్త్యంబున మనుష్యులును, పాతాళంబున రాక్షసులును నుండ నియమించె. తదీయాంతర్గతంబులయిన భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక జనోలోక తపోలోక సత్యలోకంబులనియెడు నేడు లోకంబులను, అతల వితల సుతల మహాతల రసాతల తలాతల పాతాళలోకంబులనియెడు నేడులోకంబులును, చతుర్దశభువనంబులును ప్రవర్తిల్లుచుండె. ఆ చతుర్ముఖునకు నాల్గువదనంబుల యందును ఋగ్యజుస్సామాధర్వణంబులను నాల్గు వేదంబులు ప్రవర్తిల్లుచుండె. వానియందనంతంబులై వేదంబులు ప్రభవించె. అంతనయ్యజునకుఁ బ్రపంచ నిర్మాణ సహాయులై మరీచ్యత్రి భృగువిశ్వావస్వంగిరస పులస్త్య పులహక్రతు దక్షవసిష్ఠ నవబ్రహ్మలుదయించిరి. మఱియు విశ్వదేవతలను, విశ్వకర్మ నారద సనకసనందన సనత్సుజాతాశ్విన్యాదిదేవతలుదయించిరి. మఱియు వరుణుండును, ధ్రువుండును, సోముండును, సహాంషుండును, సజయుండును, మృగసుండును,మృగవ్యాఘ్రుండును,ననిలుండును నను నెనమండ్రు వసువు లుద్భవించిరి.స్వాయంభువ, స్వారోచిషోత్తమ తామసరైవత చాక్షుషవైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి రుద్రసావర్ణి ధర్మసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణియను పదునలుగురు మనువు లుదయించిరి. అందొక్కని మన్వంతరంబునకు మనుపదంబున నుండ నియమించి మనుసహాయులైన ధాతయు విధాతయు నుద్భవించిరి. మఱియు శంకరుండును, స్థాణుండును, శర్వుండును, మృగవ్యాఘుండును, నేకపాదుండును, ఐక్షకుండును, సహర్బధ్న్యుండును, పినాకియుఁ, బావకేశ్వరుండును, గహాలుండును, ననపేతుండును ననురుద్రులుదయించిరి. వానియందు గణపతియు, షణ్ముఖుండును, నుదయించిరి.శ్రీమహావిష్ణువునకు మన్మథుండును,మోహ(న). స్తంభన వశీకరణ సంతాప నాకర్షణోచ్చాటన ప్రపంచ పంచబాణ విరచిత సకల ప్రపంచితులు

దయించిరి. అంత మరీచీ పుత్రుండైన కశ్యపప్రజాపతికి దక్షపుత్రియైన యదితికి సూర్య ఖగ త్వష్ట వివస్వత మిత్ర వింధ్యాంశుమతి గభస్తిపర్జన్య విష్ణ్వింద్రవరుణులను ద్వాదశాదిత్యులుదయించిరి. తదనంతరంబు నత్రికి ననసూయకు చంద్రుండుదయించె (దక్షప్రజాపతికి) గూతులైన యశ్విని భరణి కృత్తిక మొదలైన యిరువదియేడు తారలు చంద్రునికి భార్యలైరి. మఱియును నింద్రాగ్నియమ నైరృతి వరుణవాయు కుబేరేశాన్యులను నష్ట దిక్పాలురను సృజించి, వారిని యష్టదిక్కులను నియమించి [illegible] సభాపతి రయమతి గానతి దాంతి దాంతియును (?) పలకయును సింహాస యును నష్టపురంబులు వా(రికి ప్రసాదించితివి),[1] అనాథపతీ, స్వామి, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ.

# సింహగిరి వచనములు

## మొదటి అనుబంధము

### 1

దేవా, 'ఏకో విష్ణుర్మహద్భూత' మ్మనియెడి మీ స్మృతులు సుర
లెఱుంగుదురు. మీ శూరత్వంబసురులెఱుంగుదురు. మీమీది భక్తి తాత్ప
ర్యంబు ప్రహ్లాదుడెఱుంగును. మీ మూలంబు రుక్మిణీదేవి యెఱుంగును.
మీకు గంధం బొసంగుట కుబ్జ యెఱుంగును. మీ పరమ దయాళుత్వంబు
గజేంద్రుండెఱుంగును. మీ బాలప్రభావంబు యశోదాదేవి యెఱుంగును.
మీ బాలస్నేహంబు కుచేలుండెఱుంగును. మీ కృప ఘంటకర్ణుడెఱుంగును.
మీ మహత్వంబు విశ్వామిత్రుడెఱుంగును. మీ శాంతి శమదమాది గుణం
బులు భృగుండెఱుంగును. మీరు కుంటెన నడచినతనంబు-తొండరడిపొడి
యాళ్వారెఱుంగుదురు. మీ విలువిద్య యింద్రధనస్సు ఎఱుంగును. మీ
తెంపుపైనతేయుండెఱుంగును. మీ (జి) హ్వా రుచి విదురుడెఱుంగును.
మీ పండు ఫలంబుల రుచి శబరి యెఱుంగును. మీ పరాక్రమంబు రావణు
డెఱుంగును. మీ సత్యంబు విభీషణుండెఱుంగును. మీ కిరవుకొన్న స్థలంబు
వైకుంఠంబెఱుంగును. మీరు శయనించిన స్థలంబు క్షీరాబ్ధియెఱుంగును.
మీరు పోషించిన భావంబు శేషుండెఱుంగును. 'మీ హస్తంబుల రుచి
యమృతంబెఱుంగును. మీ వాక్కుల రుచి పురుషసూక్తంబెఱుంగును.
మీ కంఠంబుల రుచి కౌస్తుభమణి యెఱుంగును. మీ నాసికంబుల రుచి
పారిజాతంబెఱుంగును. మీ కన్నుల రుచి పరమ భాగవత ప్రపత్తి యెఱుం
గును. మీ భుజపరాక్రమంబు శంఖ చక్రమంబులెఱుంగును. మీ లలాటంబు
(రుచి?) తిరుమణి శ్రీ చూర్ణంబులెఱుంగును. మీ నామరుచి పార్వతీదేవి
యెఱుంగును. మీఋుగ్యజుస్సామాథర్వణవేదంబులెఱుంగును.సనక, సనందన
సనత్కుమార యోగీశ్వరులెఱుంగుదురు మిమ్ము పూజసేయ నేనెంతటి
వాడ. అధమాధముడ. నరపశువును. అజ్ఞానిని. నీనాపదుద్ధారకుండవు
అనాథపతి, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!

# 2

దేవా, మీ యవతార వినోదంబులు సహస్రంబులు. పంప శత కోటి భూమండలంబు జంతురాసులయందు జనియించి సన్యాసి రోమపవి యైన సిరికృష్ణువలన మిమ్ము నెరింగితిని. నా కర్మంబులు విసర్జింపితిని. దేవా, భూలోకంబునగల యవస్థలన్నియు జూచి నిర్దయాధికారినై పరమ రహస్య పురాణేతిహాసాగమ మంత్రాక్షరంబులు పరివేష్టించి చూచిన మీదివ్య నామ సంకీర్తన గతిగాని మరి యితరంబులేదు. చాతుర్లక్ష గ్రంథ సంకీర్తన నామోచ్చారణంబులు పరిపూర్ణంబైన నాకు పరమపదంబు ప్రసాదింపు మనిన, అట్లె కానిమ్మని యా సర్వేశ్వరుండు శంఖ చక్ర గదాధరుండై ప్రత్యక్షంబై వైకుంఠంబు సహస్ర ద్వారంబులు మీ దాసానుదాసులైన పరమ భాగవతులకు వైకుంఠంబు ప్రసాదింపుము. ఇందు ఒక వాకిట పుణ్యతీర్థసారంబైన దేవసమూహంబులు శత సహస్రంబులు సంఖ్యలు కాచుక యుందురు, ఒక వాకిట తిరుపల్లాండు మొదలైన యాళ్వారులు, హరిదాసులు అరువదివేలు లక్షలు గాచుకయుందురు. ఒక వాకిట గోవింద తొండరులు తొంబదిలక్షలు గాచుకయుందురు. ఒకవాకిట పంచమాధవులు మూడు లక్షలు గాచుకయుందురు. దేవా, ఒక వాకిట జయవిజ యాదులు డెబ్బది లక్ష సంఖ్యలు మిగిలి వేత్ర దండ హస్తధరులై సేవింతురు. ఒక వాకిట కుముదకుముదాక్షులు శతసహస్రంబులు గాచుక యుందురు. ఒక వాకిట ఋగ్వేదంబును, ఒక వాకిట యజుర్వేదంబును, వాకిట నానాగమ ఒక వాకిట సామవేదంబును, ఇంకొక వాకిట అథర్వణవేదంబును, ఒక పురాణేతిహాస మంత్రాక్షరంబులును, ఒక వాకిట ఉప నిషద్వాక్యంబులును. ఇవ్విధంబున తమ తమ నిజాకారంబు గైకొని ఒక్కొక్క ద్వారంబున కోటి సంఖ్యలు గాచుకయుందురు. ఇటువంటి పరమ పదమునకు జనియెడి మార్గంబు – భూలోకంబుననుండి చరమ దేహంబు దిగనాడించి నిర్మలంబైన దివ్యదేహంబు ధరియింపంబడి భూలోకంబునకు సూర్యమండలంబు లక్షయోజ నంబులు గడచి, తారామండలంబునకు, ధృవమండలంబు డెబ్బది మూడు లక్షల యోజనంబులు గడచి, ధృవమండలంబునకు పితృలోకంబు మున్నా

టముప్పది లక్షల యోజనంబులు,పితృలోకంబునకు సత్యలోకంబు సహస్ర లక్షలు గడచి, సత్యలోకంబునకు సర్వేశ్వరుండున్న సన్నిధా నంబునకు సహస్ర కోట్లు గడచి, యిటువంటి పరమ పదమునకు అనేక లక్షయోజనంబులు చనుచుండఁగాను, ముందరనొక తిల వృక్షంబు గలదు. ఆ తిల వృక్షంబు నలువది నాల్గు లక్షల యోజనంబుల పొడ వును గల (తిల వృక్షంబు గల)దు. ఆ తిలవృక్షంబు తన మోక్షాపేక్షి తులై త్రియంబకవాసు (మః) దేవాదులు త్రింశత్కోట్లు గాచుక యుందురు. ఆ తిల వృక్షము ప్రదక్షిణముచేసి మరియు అనేక లక్షయో జనంబు (లు) చనుచుండగాను ఆముందర మద్ది వృక్షంబు గలదు. (ఆ మద్ది వృక్షంబు) అరువది యెనిమిది లక్షల యోజనములు విస్తా రమును ముప్పది లక్షల యోజనముల పొడవునుంగల మద్దివృక్షంబు క్రింద భూలోక, భువర్లోక, సువర్లోక, జనోలోక, తపోలోక, సత్య లోకంబులనియెడు మీదేడు లోకంబులును; అతల, వితల, సుతల, తలా తల, రసాతల, మహాతల, పాతాళ లోకంబులనియెడు క్రిందేడు భువనం బులును (మీదేడు భువనంబులును) గూడుకొని, యొకబ్రహ్మాండంబని పించును. ఇట్టి బ్రహ్మాండంబులు అనంతకోట్లు. ఆమద్ది వృక్షంబు క్రిందను మోక్షాపేక్షితులై తపంబొనర్చెడి మహాత్ములంబొడగని ఆ మద్ది వృక్షంబునకు ప్రదక్షిణంబుచేసి, మద్దిగడచి యనేక లక్షయోజ నంబులు చనుచుండగాను, ముందరనొక అంధకారమైన నది కలదు. అంధకారమైన నదిని తీర్థమాడెను. అక్కడనుండి అహంకార మమకార షడాకార (అరిషడ్వర్గ?) షడోన్మయ (షడూర్మిమయ?) శ్రీలింగ(?) ఈషణత్రయ, మఖత్రయ, అవస్థాత్రయ, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధి దైవిక సుఖదుఃఖ సముద్రములు గూడి వర్తించెడి మాయా పురుషుండు మరిచి చనుదెంచి మహత్తనియెడి లోకంబు ప్రవేశించి యుండును. అంధ కారమైన నదిగడచి మరియు ననేక లక్షల యోజనంబులు గడచి చన చుండగాను ముందరనొక నిప్పులయేరు గలదు. ఆ నిప్పుల యేరు సమీపమ నకుంజని కృతాంజలియై యిమ్మహావైతరణి తరియింప నేదియుపాయ

మని చింతించుచున్న సమయంబున వైశ్వానరుండును అగ్నిభట్టారకుండు ఎదురుగా జనుదెంచి ఆ భాగవతోత్తమునకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి అనేకకాలమునాటి బాంధవులు వేంచేసిరని (న) దివ్య విమానారూఢులంజేసి యా నిప్పుల యేరు ఆవలికి వెడలించెను. ఆ నిప్పుల యేరు ఆవలికి వెడలి మరియు అనేకలక్షల యోజనంబులు చనుచుండగా ముందట నొక వృక్షంబు గలదు. ఆ వటవృక్షంబు ఇరువదితొమ్మిది లక్షల యోజనముల విస్తారమును,ఎనిమిది లక్షలయోజనంబుల పొడవుంగల (వటవృక్షంబుగల) దు. ఆవట వృక్షంబు క్రింద చతుర్భుజావతారులైన హరిదాసులు అనంతకోట్లు వేంచేసియుందురు. ఆవట వృక్షంబునకు ప్రదక్షిణాకారంబు (ప్రదక్షిణ నమస్కారంబు?) చేసి ఆవట వృక్షంబు తూర్పు భాగంబున విరజానది గలదు. ఆ శ్రీ విరజానది మున్నూటముప్పది మూడులక్షల యోజనంబులు విస్తారమును దశలక్షల యోజనముల పొడవును గల శ్రీవిరజానదితరియించెడిది యేది యుపాయమో దైవమాయని చింతించుచున్న సమయంబున భూలోకంబున తాజేయు ధర్మపరోపకార భగవద్భాగవత కైంకర్య(ములు), శ్రీయేకాదశి, శ్రీరామనవమి, శ్రీకృష్ణజయంతి మొదలైన(వి); అన్నదాన, గోదాన, భూదాన, హిరణ్యదాన, వస్త్రదాన, హిరణ్యగర్భరత్నదానాదులు మొదలైన మహాపుణ్యమార్గంబులన్నియుం గూడి యొకనావయై వర్తింపుచుండును. హరిపదధ్యాన, పురాణశ్రవణ, నక్షత్రహరిదర్శనంబనియెడు, ఆత్మజ్ఞానంబనియెడు పరమాత్మ పిపీలికాంచై అ(ఆ?)ధర్మనావ చనుదెంచును. ఆనావయెక్కి చరమజ్ఞానంబనియెడి వాయువేగమనోవేగంబున ఆశ్రీవిరజానదికిదరిని తీర్థంబొసరించిన ఆ శ్రీ విరజానదిని ఆతిరుమేనువైచి, పసిడి తిరుమేను ఎత్తి నిలువంబడియున్నంత శ్రీవిరజానది ఆవలిదరివెంట అరువదికోట్ల హరిదాసులు ఎదురుగా వేంచేసిరి. ఆ భాగవతోత్తములను గాఢాలింగనంబు చేసినమేనునిమిరి, అనేక కాలమునాడు బంధువులు వేంచేసిరని మహావైభవంబుతోడను శ్రీవిరజానది దరివెంట మరియు అనేకలక్షల యోజనంబుల పొడవుంగల అశ్వత్థనారాయణుండు గలదు. ఆయశ్వత్థమునకు ప్రదక్షిణాకారముచేసి' అక్కడకు లక్షయోజనంబులుచనుచుండగా ముందర దివ్యపదంబైన పరమపదంబు గానుపించెను. ఆపరమపదము మున్నూట

ముప్పదికోట్ల విస్తారమును, ఏడుకోటున్నర (ఏడున్నరకోట్లు?) పొడవుం గల దివ్యపదంబైన పరమపదంబు పొడగని, అనంతములైన సాష్టాంగ ములు చేయుచున్న, అనంతకోటి సూర్యప్రకాశంబున ప్రజ్వరిల్లెడు పొడ గనిన సన్ను త్రింశత్కోటి ద్వారపాలకుల సేవించిన, ఆ త్రింశత్కోటి ద్వారపాలకులు ఎదురుగా జనుదెంచిన ఆ భాగవతులకు దండ ప్రణామంబు లాచరించి అనేకకాలమునాటి బంధువులు వేంచేసిరని, మహావైభవంబుల తోను పరమపదములోపలికి వేంచేయుచున్న ఆ పరమపదములోపలి మణి గోపురము, మణిధ్వజమణి ప్ర(ప్రా)కారము జేగీయమానంబులైన చిత్ర జాలకంబులైన తిరువీధులు, అనంతకోట్లు తిరువీధులవెంట చనుదెంచెడి సమయంబున అధ్యాంతరారంబున (అభ్యంతరంబున?) రత్నాలసావడి గలదు. ఆసావడిమీదను సాలోక్య, సామీప్య, సారూప్యధారులు సహస్ర కోట్లువేంచేసియుందురు. ఆరత్నాలసావడికి ప్రదక్షిణాకారంబు చేసివారిల యనుమతిని మూడుముహూర్తంబులు ఆ రత్నాలసావడింగూర్చున్న సమ యంబున అక్కడసర్వేశ్వరుని శ్రీనగరిలోపల వేంచేసియున్న దివ్యపురు షులు సహస్రంబులు ఆ రత్నాలసావడింజనుదెంచ అందున్న భాగవతులం బొడగని సర్వాభరణ భూషితులుంగా నలంకరించి దివ్యవిమానారూఢులం జేసి ఓం..........పరమపదమనియెడి వైకుంఠంబు తిరువీధులయందు చనుచుండగా పుష్పవృష్టి సాంద్రమై వర్షింపగా వైకుంఠ తిరువీధులయందు చనుదెంచెడి సమయంబున ఆ పరమపదమందున్న నిత్యముక్తులు ఎదురుగా జనుదెంచి తమతమ తిరుమాళిగకు తోడ్కొనిపోయి ముత్యాల గద్దియపై గూర్చుండబెట్టి పసిండిచెంబుల తిరుమంజనంబులు తెచ్చి ఆభాగవతోత్తముల శ్రీపాదతీర్థంబుల చేర్చుకొనియున్నంత అక్కడికి జగదీశ్వర సన్నిహిత దాసులు సహస్రకోట్లు ఎదురుగా జనుదెంచి దివ్య విమానంబులెక్కించి ఆపరమపదరాజులనగరి ద్వారంబున నిలుపంబి(చి?) నిలిపి యా నగరి ద్వారంబుముందరను తిరువాయిముడిమండపంబుగలదు. ఆ తిరువాయి ముడి మండపంబు అయిదులక్షల యోజనంబుల విస్తారమును, మూడు లక్షల యో జ న ం బు ల పొ డ వు ను గ ల దు. ఆ తి రు వా యి ముడిమండపంబు (వాకిట?) ఋగ్యజుస్సామాధర్వణ అనుత్తులైన (వేత్తు లైన?) వేదార్థంబులు ప్రసంగించెడు హరిదాసులు అనంతకోట్లు ఉందురు.

ఆ తిరువాయిముడిమండపంబునకు ప్రదక్షిణాకారంబు చేసి నిలువంబడి యున్నంత ఆ భాగవతులు శ్రీనగరి లోపలికి వేంచేయుడని యానతిచ్చిరి. ఆముందరనొక భద్రపీఠంబుగలదు. ఆ భద్రపీఠంబునకు దండము సమ-ర్పించిన ఆభద్రపీఠంబునకు తూర్పుభాగంబుగ సహస్ర ఫణావళుల శేషుండుగలడు, ఆ శేషునిమధ్యాంతరాళంబునందు రత్నసింహాసనంబు గలదు. ఆ యనంతకోటి సూర్యప్రకాశంబు(న) ప్రజ్వరిల్లెడు రత్నసింహాసనంబుమీదను అప్రమేయు(డగు)ఆదినారాయణమూర్తి వేంచేసియుండును. ఆ జగదీశ్వరుని యుభయపార్శ్వంబుల అజభవరుద్రాదులు అనంతకోట్లు సూర్యచంద్రాదులు సహస్రకోట్లు కరయుగంబులు చనిన మనుష్యులు దేవ సంఖ్యలు వేత్రదండహస్తులై సేవింప పరమపదనివాసులు పరివేష్టింపయున్న ఆ పరమపదరాజులంబొడగని అనంతములైన సాష్టాంగములు సమర్పించి కృతాంజలియై గజగజవణకుచు నిలువంబడియున్న యూదాసునింగాచి ఆ జగదీశ్వరుండు ఏమనిబుషించెను.—'ఇంతకాలంబు ఏల ఆలస్యమాయె'నని ఆనతిచ్చిన 'స్వామీ ! యింతకాలంబు భూలోకంబున సంసారంబనియెడు నరక కూపమునంబడి మునుగుచుండేలుచునున్నారమని, రక్షింపవేస్వామి' యని పలికిన 'ఈ(ది)వ్యపదంబునకు ఏవ్వరియుపదేశంబు వల్లను వచ్చితి' వనిన 'స్వామీ మీదాసుండైన కృష్ణమాచార్యులు కలియుగమందు నానా గమశ్రుతి పురాణేతిహాస మంత్రాక్ష(ర)రహస్యంబులు తెలిపె, [illegible] దేహంబుదిగనాడించి నిర్మలమైన దేహంబు(దిగనాడి!) అవధరింపించి మీదివ్యపదంబు గానుపించె'నని పలికిన ఆ సర్వేశ్వరుండు గాఢాలింగనంబు చేసి మేనునిమిరి పరమ(పద)నాంచారు దిక్కుచూచి యనేక కాలంబునాటికి 'కౌమాళ్కు' కలిగిరని పరమపదనాంచారు శ్రీహస్తమునకిచ్చి ఆ పరమ నాంచారు ఎత్తుకొని స్తన్యపానాదులచేత అమృతపాలంబు సేవింపజేసి వీరల నప్పటప్పటికి మనకొలువు కూటంబునకు తోడుకరమ్మని యానతిచ్చిన (శ్రీ) నగరిలోపల ఉండుమని యొప్పగించిన అంతట నా సర్వేశ్వరుండు(నారాయ ణుండు?) శ్రీ కృష్ణమాచార్యులకు సాలోక్యసారూప్య కైంకర్యము దయ చేసితిమి తోడుకొనుచు రమ్మని(న) భాగవతులంబనిచి (పిలచి) తమ చేతి

పారిజాతంబు గురుతిచ్చిన ఆ పరమభగవతులు పారిజాతపుష్పంబు గురుతు గొంచువిమానారూఢులై పరమపదంబువెడలి ఆ క్రిందట బ్రహ్మలోకంబు దాటి ఆక్రిందట ఈశాన్యంబు కైలాసముగడచి యాక్రింద ధ్రువమండలంబు భేదించి ఆక్రిందట నక్షత్రమండలము ప్రవేశించి. ఆక్రింద చంద్రమండలంబుగడచి, ఆక్రిందట సూర్యమండలంబు గడచి, ఆక్రిందట మేఘమండలంబుదాటి ఆక్రిందట భూలోకంబున సింహాకారంబైయున్న సింహాచలంబు నకు చనుదెంచి కృష్ణమాచార్యులను పొడగని తద్వృత్తాంతంబెరిగించి, పారిజాతపుష్పంబులు గురుతు ఇచ్చిన మహాప్రసాదంబని, సింహాచలంబు నకు దశయోజనంబులునుగల వైష్ణవులను ఆచార్యులను, గల వైష్ణవులను, పరమభగవతులను, వైఖానసులను, కాంతలను, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రజాతి సంఘంబుల రప్పించి, దివ్యమంత్రోపదేశంబువలన చరమ దేహంబులు దిగనాడించి, నిర్మలంబైన దివ్యదేహంబు ధరియించి, దివ్య విమానారూఢులై పరమపదంబునకుంజనుదెంచెను. ఇంటిటింగృతార్థుల జేసెను, ఆందరికి దివ్యమంత్రోపదేశంబు ప్రసాదించెను. అని దివ్యదేశంబుల జనులు ప్రసంగింతురు. మీరును నవమాసంబులు వేంచేసియుండి యీ భూమినేలు రాజునకు జ్ఞానోపదేశంబుచేసి మహాప్రసాదంబును ఉభయ కావేరి మధ్యంబున రంగనాథుల సన్నిధియందు తిరువధ్యయనంబొనరించి ఆ మీదట సాలోక్య సామీప్య సారూప్య కైంకర్యపరులై పరమపదంబునకు విచ్చేని గడియలు పదునాలుగింటను ఒక్కముహూర్తంబున సా లో క్య సా మీ ప్య సారూప్య కై ం క ర్య ప రు లై పరమ పదంబునకు జనుదెంచిరి. అంతట పొతకమూరి లక్ష్మయ్యగారు మరలి వేంచేసి యీ భూమినేలెడు రాజునకుం జెప్పిన ఆనందబాష్పపూరిత నయనుండై తన భృత్యులం బిలిచి, కృష్ణమాచార్యులు తమ దాసులు, దాను సాలోక్య సామీప్య కైంకర్యపరులై శ్రీ పురుషోత్తమము మొదలైన నూటయెనిమిది దివ్యతిరుపతులకు జనుదెంచి వైకుంఠవాసులగుట సత్యం బని పలికిన ఆ రాజు విరక్తుండై తన యింటగల ధనద్రవ్యాదులు భాగవ తార్పితంబు చేసి కాషాయవస్త్ర కమండలధారులై పొతకమూరి లక్ష్మయ్య

సుం గూడుకొని దివ్యదేశంబులయందు స్వామి ప్రపత్తిపంబు గొనియాడుచు ఉభయకావేరి మధ్యంబునందు రంగనాయకుల సన్నిధియందు శ్రీరంగనాథా చార్యులకు తిరుపధ్యయనం చొనరించి, ఆ మీదట సాలోక్య సామీప్య సారూప్య కైంకర్యపరులై పరమపదంబునకు చనుదెంచిరి. ఇది ఉత్తరభాగ సంకీర్తన. అనుదినంబును మీ దివ్యనామ సంకీర్తన మెవ్వరు పఠించిరేని, ఎవ్వరు వినిరేని, ఎవ్వరు వ్రాసిరేని ఆయురారోగ్యైశ్వర్య సంపదలు దయచేసి ఆమీదట కాలాంత్యంబున పరమపదంబు ప్రసాదింతుమని (ప) జగదీశ్వ రుండు ఆనతిచ్చెను. యతిరామానుజ మునిపరం (దా) వాసు. అనాదికాలపు సింహగిరి నరహరి, నమో నమో దయానిధీ !

# 3

హరిః ఓం. దేవా, మీరు దిరువవతరించితిరి. మత్స్యావతారమునకు పూర్వఋషి తండ్రి, శంధావతి తల్లి, మహీంద్రుండు గురువు, ద్వారకాపట్టణము, సోమకాసురుని వధించుట, బ్రహ్మకు వేదంబులొసంగుట. 1. కూర్మావతా రంబునకు డంబకాఋషి తండ్రి, కస్యకావతి తల్లి, సంతానందనుండు గురువు. మధురాపట్టణము, సముద్రము తరచుట, దేవరాసమూహమునకు అమృతము పంచిపెట్టుట.2. వరహావతారామునకు దిక్కుమాఋషి తండ్రి, పద్మావతి తల్లి. తర్కవాసనుండు గురువు, గుహిపంగలా పట్టణము, హిరణ్యాక్షుని వధించుట, భూమిపాలనము సేయుట. 3. నరసింహావతారము నకు అతిదావదన తండ్రి, చంద్రావతి తల్లి, ఫాలలోచనుడు గురువు జంబ ఋషిపట్టణము, హిరణ్యకశిపుని వధియించుట, ప్రహ్లాదునికి ప్రసన్నమగుట. 4. వామనావతారమునకు అందమాఋషి తండ్రి, నీలావతి తల్లి. ఆకాశ ఋషి గురువు. ఆకాశమే పట్టణము. బలివధించుట, ప్రజారక్షణము సేయుట. 5. పరశురామావతారమునకు జమదగ్ని తండ్రి, (జమ) రేణుక తల్లి, మహీంద్రుండు గురువు, కొల్లాపురి పట్టణము, కార్తవీర్యుల వధించుట, రేణుక శోకవిలాస (వ)ము జా (వా) పుట. 6. రామా వతారమునకు దశరథుడు తండ్రి, కౌసల్య తల్లి, వసిష్ఠు గురువు, అయోధ్య

పురి పట్టణము, రావణకుంభకర్ణాదుల వధించుట, విభీషణునికి పట్టము గట్టుట. 7. కృష్ణావతారమునకు వసుదేవుడు తండ్రి, దేవతి తల్లి, గాంగేయ (గార్గేయ?) మహర్షి గురువు, ద్వారకపట్టణము, నరకాసురుని వధించుట, నాటకవిహారువేల గోపికాస్త్రీల సంభోగముజేయుట, 8. బుద్ధావతారము నకు అమృతకీర్తుండు తండ్రి. మాతంగావతి తల్లి. ఆకాశధృవుండుగురువు, త్రిపురాపురి పట్టణము, అంతకా రాకాసురుల వధించుట, స్త్రీల వ్రతమాన భంగముసేయుట. కలికావతారమునకు హిందావతి తండ్రి, సోమావతితల్లి, అమోఘసుండుగురువు, జంబావతిపట్టణము, భస్మాసురుని వంధిచుట, శంకరుని అభిమానము రక్షసేయుట (10). (కృతయు)గ త్రేతాయుగ, ద్వాపరయుగంబుల, కలియుగంబుల బుట్టుచు, చేసిన దోషం బులు, స్త్రీహత్యలు, బ్రహ్మహత్యలు, భ్రూణహత్యలు, సహోదరగమనంబున మాతృగమనంబున, సురాపానంబున, బ్రాహ్మణోత్తముండు చండాల యోనియందు ఇంద్రియాదుల విడచిన దోషంబులు, తొలంగునె దేవా! ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, శౌనక, భీష్మ, దాల్భ్య, రుక్మాంగదార్జున, వశిష్ట, బలి, విభీషణ, భృగు, గాంగేయ, అక్రూర, విదురాదులును పరమభాగవతోత్తములు నారాయణస్మరణ వలన కృతార్థులైరి. కాన 'ఏడురామాయణంబులు, పదునెనిమిది పురాణంబులు, ద్వాదశస్కంధములు, భగవద్గీతలు, సహస్ర నామంబులు మొదలైనవి చదివిరేమి, వినిరేమి, వ్రాసిరేమి సంకీర్తనకు వెయ్యిపాలింటికి సరిరావు. కడమసంకీర్తనలు అనేకులు (అనేకములు?) వినినారు. ఇందుకు తప్ప రాదు. మీచరణ(పాద)పద్మంబులాన.[1] యతిరామానుజముని వరందాతారు. స్వామీ సింహగిరినరహరీ, నమోనమో దయానిధీ!.

## 4

దేవా! పదికోట్లయజ్ఞాదిక్రతువులు నడపంగానేమి? తొమ్మిదికోట్లు తులాబురంబులు తూగంగానేమి, యెనిమిదికోట్ల సువర్ణదానంబులు సేయం గానేమి, యేడుకోట్ల గోదానంబులు సేయంగానేమి, ఆరుకోట్ల భూదానంబు

1. కలికావతారమునకు .... అనునది లిఖితప్రతిలో ఇచట కలదు.

లు సేయంగానేమి, అయిదుకోట్ల కన్యాదానంబులు సేయంగానేమి, నాలుగు కోట్ల వస్త్రదానంబులు సేయంగానేమి, మూడుకోట్ల సత్యాది వ్రతంబులు నడుపంగానేమి। రెండుకోట్ల అన్నదానంబులు సేయంగానేమి, కోటిస్నానం బులు సేయంగానేమి.

దేవా, మీనామోచ్చారణంబు సేయక పదికోట్ల యజ్ఞాదిక్రతువులు నడిపిన దేవేంద్రుండు నిలువల్లామానులయ్యెను. దేవా, మీనామోచ్చారణం బు సేయక తొమ్మిదికోట్ల తులాభారంబులు తూగిన దుర్యోధనుండు యమ పురికేగెను. దేవా, మీనామోచ్చారణంబు సేయక యెనిమిదికోట్ల సువర్ణదానం బులు చేసిన కర్ణుడు పసిమి కొండయంది అన్నంబులకు అపేక్షించెను. దేవా, మీనామోచ్చారణంబు సేయక యేడుకోట్ల గోదానంబులు సేసిన [illegible]- డు గోహత్య బ్రహ్మహత్య పాతకములు పొందెను. దేవా, మీనామోచ్చారణంబు సేయక ఆరుకోట్ల భూదానంబులు చేసిన బలియుండు(బలి?) విష్ణుపాదంబున పాతాళంబునకేగెను. దేవా, మీనామోచ్చారణంబు సేయక అయిదుకోట్ల కన్యా దానంబులు చేసిన ధ్రువుండు కాశీక్షేత్రంబున పంద్రెండువేల యేండ్లు భిక్షం బెత్తెను. దేవా, మీనామోచ్చారణ సేయకనాలుగు కోట్ల వస్త్రదానంబు సేసిన మార్కండేయుండు మతిహీనుండయ్యెను. దేవా, మీనామోచ్చారణంబు సేయక మూడుకోట్ల సత్యాదివ్రతంబులు నడపిన వా ........ రిపుండు (హరిశ్చంద్రుండు?) కులహీనునియింట కాపుగాంచెను. దేవా. మీనామోచ్చార ణంబు సేయక రెండుకోట్లన్నదానంబులు సేసిన ధర్మజుండు యమపురి తొంగి చూచెను. దేవా, మీనామోచ్చారణంబు సేయక కోటిస్నానంబులు సేసిన కుమారస్వామి కోరిక సిద్ధించదాయెను. దేవా, మీనామోచ్చారణంబు సేసిన ప్రహ్లాద, నారద, పుండరీక, వ్యాస, శుక, శౌనక, భీష్మ, దాల్భ్య, రుక్మాంగద, అర్జున, బలి, విభీషణ, భృగు, (గాంగేయ?), అక్రూర, విదురాదులను పరమ భాగవతోత్తములు (నారాయణ స్మరణవలన) కృతార్థులైరి గాన [illegible] [illegible] వరం. [illegible] [illegible](డ) [illegible] స్వామి సింహగిరి నరహరి, నమో నమో [illegible]

# సింహగిరి నరహరి వచనములు

## రెండవ అనుబంధము

### 1

శ్రీ పురుషోత్తమము, శ్రీ కూర్మము, రో (జూ?)లార్కము, శ్రీరంగము, వేంకటము, వైకుంఠగిరియు, అనంతరంగనాథుని కొండ, పుష్పగిరము. కనకగిరి, కనకాంబరగిరి, గోవర్ధనగిరి, అంజనగిరి, హస్తిగిరి, శేషాద్రి, ఆళ్వార్లగిరి, పండరంగగిరి, పసిండిగిరి, కోరుకొండగిరి, గరుడగిరి, శ్వేతాద్రి, హిరణ్యాద్రి, వృషభాద్రి, ఘటికాచలము, వారణాచలము, ఇంద్రాచలము, శ్రీ రామము, శ్రీ రంగము, ప్రమోదము, సత్యలోకము, శ్వేతద్వీపము, ఆకాశనగరము, కావురి ప్రయాణము, విభావము, పాతాళము, ఉత్తరాపథము, శ్వేతహృదయము, అగ్నిపూర్వము, శరణ్యము, క్షీరాబ్ధి, బదరికాశ్రమము, నారాయణాశ్రమము, నైమిశారణ్యము, బృందావనము, ఇప్పారణ్యము, మహారణ్యము, భూతస్థానము, మేఘపటస్థలము, గజస్థలము, కటస్థలము, శ్రీనివాసస్థలము, పార్థివస్థలము, దర్భస్థలము, భ్రమరస్థలము, భక్తిశిఖము, భార్గవాక్య(ఖ్య?)ము, హనుమంతము, అనంతశయనము, కుంభకోణము, అయోధ్య, ప్రయాగ, మాధవ, ద్వారవతి, మాయ, కాశి, అవంతి, ప్రదుకాళి, గయ, గంగాసాగరము, చక్రతీర్థము, తులసీ హృదయము, ఘృతసరసి, ప్రధానము, నందిగ్రామము, చిత్రకూటము మదికూటము, ధర్మపురి, వ్యాఘ్రపురి, నందిపురి, కృష్ణపురి, కోష్టపురి, పృథివీపురి, దారుణము, హరిపురాశ్రమము, కురుక్షేత్రము, హరిక్షేత్రము, గృధ్రసరసి, భక్తిసాగరము, పద్మనాభము, గోపతి భక్తినాథము, శ్రీముష్ణము, తుహోతము, స్వర్ణమందిరము, కృష్ణకోవిల, సంగమగ్రామము, మణిమంటపము, నిఖిలాకారము, మహారము, మధురాపురి, శ్రీమద్ద్వారము, కురుకాయము, పుంగళికము, అపూర్ణము, గ్రిద్ధినందినము, బృందావనము కలి మంత్రలము, ప్రియమోచనము, గోమంతము, హరిద్వారము, అహోబిలము, వెంకటాచలము, అంతర్వేది, విష్ణుకంచి, సింహాద్రి మొదలయిన

నూటయెనిమిది తిరుపతులను స్వామి తిరుమేను నందవ(ధ)తరించితివి గాక! కావేరి రంగనాథుని అన్నిటను వహించి మిగిలిన శేషము స్వామి తిరుమేనునందు కలిసితివి గాన — ఈ సంకీర్తన మెవ్వరు పఠియించిన వారికి ఆయురారోగ్యము—ఈ గ్రంథ స్వరూపము. ఇదియే వంశము. ఇదియే గోత్రము. ఇదియే నాకు పుత్రమిత్రకళత్రాదులు. ఇదియే నాకు బాంధవులు. ఓం నమోనారాయణ యని పఠియించిన పరమభాగవతోత్తములకు శుభం భవతు. చాతుర్లక్ష సంకీర్తన యిదియె. పంచమవేదమిదియే, దివ్యమంత్ర మిదియె. ఈ నూట యెనిమిది నామములను ఎవ్వరు స్తుతియించిరేని వారి లకు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాదవులు కృపజేసి రక్షించుదు గాన అనాది (ఘః) పతి, సింహగిరి నరహరి!

## 2

ఓమ్ భూనరసింహా! ఓం జయనారసింహా! ఓం దార్గప నారసింహా! ఓం జ్వాలా నారసింహా! ఓం పరమయోగానంద పావన నారసింహా! ఓం భయనివారణ నారసింహా! ఓం దుఃఖనివారణ నారసింహా! ఓం శ్రీమన్నారాయణ నారసింహా! ఓం లక్ష్మీపతి నారసింహా! ఓం వరాహ నారసింహా! యను మీ దివ్యనామసంకీర్తన సమర్పించిన భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ చోర వ్యాఘ్రవరాహ భల్లూక సర్పవృశ్చిక సర్వజ్వరదోషాది భయంబులు తొలంగును. నరహరి! సింహగిరిపతీ! మీ దివ్యనామసంకీర్తన సర్వమైన పీడలను నివర్తించును. ఈ సంకీర్తన యే యింట నున్న నా యింటను ఏ ఆపదలు జొరవెరచును. ఎక్కడనైనను పయనమైపోవునప్పుడు ఈ సంకీర్తన వ్రాసి రక్షగా కట్టుకొనిన మోసకట్టు, దారికట్టు, వాకట్టు. ఈ సంకీర్తన పఠియించినవారిని జూచిన ఆవలవారికి అనేకంబై కనుపట్టును. అనేక భయంబులై తోచిఉండు. బ్రహ్మరక్షస్సు మొదలయిన భూతప్రేత పిశాచ గ్రహపీడలు చొంపెరచును. ఉగ్రగహో! ఉగ్రనారసింహ స్తోత్రము పరమ మంత్రోచ్చారణంబు. అనాథపతి సింహగిరి నరహరీ నమో నమో!

[illegible]

# 3

దేవా! హరి(శ్రీమన్నారాయణా, పరబ్రహ్మస్వరూపా, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకా, దేవా! తాటకి ప్రాణాపహారా, విశ్వామిత్ర యజ్ఞకర్తా, యజ్ఞభోక్తా, యజ్ఞస్వరూపా, సర్వం విష్ణుమయం జగ (త్తను శ్రుతినికరపరివేష్టితా), విలువిద్యా (దీక్షాగురూ), మారీచమృగ వేటకాడా, మహామాయా వినోదా, ఖరదూషణత్రిశిరఃఖండనా, అతికాయమహాకాయ కుంభ నికుంభ కుంభకర్ణ వజ్రదంష్ట్రి వజ్రికవచ మహోదర మహాపార్శ్వ కోలాహలాపహార, ఇంద్రజిత్తు తలగుండుగండా, రావణగిరి వజ్రాయుధా, సకల దేవతా మోక్షరక్షకా, విభీషణ ప్రతిష్ఠాపనాచార్యా, శ్రీ మద్ద్వారకాపురి నిలయా, గోవర్ధన గిరిధరా, గోపీజన మనోవల్లభా, వేణునాదవినోదా, పారి జాతాపహారా, శిశుపాల శిరశ్ఛేదనా, కాళింగమర్దనా,కౌస్తుభాభరణా, శ్రీ వత్స లాంఛిత కుచుకుంకుమపంకిలా, యశోదానందనా, మధురానాయకా, మహా మునిగణసేవితా, వాల్మీకి ప్రయోగసన్నుతా, ఓ గజేంద్రవరదా, ఓ ప్రహ్లాద వరదా, ఓ యక్రూరవరదా, ఓ యంబరీషవరదా, ఆపద్బాంధవా, ద్రౌపద్యభి మానరక్షకా, పాండవపక్ష ప్రతిపక్షపాలకా, విదురునింటివిందా, ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష సనకసనందన సనత్కుమారాది యోగీంద్ర బృందారక వంద్యా, ఆదిమధ్యాంతరహితా, అధోక్షజా, క్షీరాబ్ధి శయనా, వటపత్రశయనా, వారిజనాభా, భక్తిముక్తి ప్రయోగసన్నుతా, శ్రీ కృష్ణ కువ్వారు స్వామీ, సింహగిరినరహరీ!

# 4

దేవా! మీ చరణారవిందసేవకు నే కులజుండైన మిమ్ము హృదయ కమలకర్ణికా (ర) మధ్యమందు పరబ్రహ్మంబుగా భావించి రత్నసింహాస నాసీనునిగా జేసి పురుషసూక్త ప్రకారమువలన ఆవాహనాసనార్ఘ్యపాద్యాచ మనస్నాన వస్త్రయజ్ఞోపవీత గంధ పుష్ప ధూప దీప నైవేద్య తాంబూల నీరాజన ప్రదక్షిణ నమస్కారము (మొదలై)న షోడశోపచారంబుల నర్పించి. కంకణ కేయూర కౌస్తుభాభరణ మకరకుండల హార మణిమయ

కిరీట విరాజితగాత్రునిగా, కిన్నర కింపురుష గరుడగంధర్వ యక్ష సురసిద్ధ-అఖిల దేవతా సంసేవ్య పాదపద్మములు గలవానిగా, అనంత గరుడ విష్వక్సేనాది పరిజన పరివృతునిగా భావించి, (కమల?) శేష తల్పునిగాను, శంఖ చక్ర గదా ఖడ్గకోదండ పద్మ వనమాలికాధరునిగాను, పరబ్రహ్మస్వరూపునిగాను, ఆత్మజ్ఞానమునను శ్రీ అష్టాక్షరీ మంత్రంబుల నిత్యంబు ఉండబ్రహ్మా మంబుల సేయుచుండునతండే పరమభాగవతుండు. అతనికి మీ పరమపదంబే గాని యితరంబులేదని శ్రుతిపురాణములు చాటుచున్నవి. అనాథపతి స్వామీ, సింహగిరి నరహరీ!

## 5

దేవా! శ్రీమన్నారాయణుండే సకలదేవతలకు, సకలజంతు జీవ కోట్లకు జనకుండు. నారాయణ, నారాయణ యని శ్రుతులు పల్కుచున్నవి. గాన తప్పదు. ఇట్లని యెరుగక ఇతరదేవతల గొలిచెనేని వ్యభిచారికొడుకు తండ్రినెరుంగని క్రియను పరమాత్మని యెరుగక జీవాత్మలే యనేక బ్రహ్మకల్పంబులు జన్మజరామరణాదులం బొందుచునుండును. అనాథపతి సింహగిరి నరహరిని సర్వకార.... మీ దాసులు మిమ్మే కొలుతురు. దయానిధీ!

## 6

దేవా! దేహంబు మృత్తికజలంబులచే శుద్ధి చేసెదనంటినా? - మూత్రంబు మలభాండము. చిత్తశుద్ధి చేసెదనంటినా, విషయేంద్రియము లుండవు. దేహంబును, చిత్తంబును మా సింహగిరి నరహరిందలంచినగాని పవిత్రము గాదె, దేవా!

## 7

దేవా! శ్రీమన్నారాయణ కథామృతము పరమపదంబునకు సోపాన [illegible] నడిపింపబడి. ఇదితే సత్యము. మనసా! నీవను మంత

ముదిగి మా సింహగిరినరహరి నామమొక్కమారు దలంచినచాలును. ఇదియే సత్యము, సత్యము. ఇదియె, నాకును జపము. ఇదియె, నాకును తపము. ఇదియె, నాకును నిత్యకర్మానుష్ఠానమయినది. ఇదియె, నాకును పరమ మంత్ర రహస్యము. ఇదియె, పరమ ధర్మము. ఇదియె, నాకును వేదశాస్త్రపఠనంబిదియె, సింహగిరి నరహరీ! మీ దివ్యనామము. ఇదియే నాకు జపము, దయానిధీ!

## 8

దేవా! వ్యాస పరాశర శుక శౌనకాదులైన ఋషులందరు గూడి వాసుదేవుడే పరతత్త్వమని వైకుంఠనివాసుం గొలిచిరి. దైవమాయయో! నరులపాలిటి కర్మమో! పెక్కు దైవములు గలవని తిరిగిచెంచెదరు. ఎక్కడఁగలఁడన్న అక్కడనే హరి గలడను మాట నిక్కమో లోకములనాథా! ఎక్కడి ద్రౌపది? ఎక్కడి ద్వారక! ఎక్కడికెక్కడ!! శరణన్న గాచుట యెరుంగరా! జగములేలేడు గల్వానోపిన మగలేగురు తలలెత్తి అలుగకుండంగ ద్రౌపది తనమనంబున గదర, "కృష్ణా! నీవే గతి. నీ చెలియలింగావు" మనినం గాచెను. కరి మకరితో పోరుచు, కరిలావుతరిగి మొరపెట్టుచో, గలరో దేవతలైనం గావవే హరీ! యన్నను గాచుట యెరుంగరా? ఇట్టి సింహమందిరుం గొలిచి ఇంద్రాది దేవతలైరి. శ్రీ కృష్ణ కువ్వారు స్వామి, సింహగిరి నరహరీ!

## 9

దేవా! ఇతడే అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండు. ఇతని నాభియందు బ్రహ్మాండంబు పుట్టె. బ్రహ్మాండము లోపల బ్రహ్మపుట్టె. బ్రహ్మ లలాటంబున హరుండు పుట్టె. హరుని యుగ్రమున కూర్మము మోచిన కుంభినిధరణి ఉష్ణమున జలధిపుట్టె. జలధి కల్పమున మండలము పుట్టె. మండల సర్పమునందు వేదశాస్త్ర పురాణకల్పములు పుట్టె. వేదశాస్త్ర

పురాణకల్పమున నీయల్పదై వములు పుట్టె. మీ కరుణానిధి మీ సప్తరి కాలచక్రములు కర్మములుదుర్చించి హతాహతంబు చేసియు మీరే పరబ్రహ్మ మని తెలిసితెలియరు. అనాదిపతి సింహగిరి నరహరీ!

# 10

దేవా! నరహరీ! మీ చరణారవిందము సేవించెడి మనస్సు నాకెన్నడు కలుగును? నరహరి! మీ నామము దర్శించి చూడనున్నాను. నయనానందకరము నాకెన్నడు కలుగును? నరహరీ, నీ నామకథాగుణములు వీనులకు వినంగ జిత్తము పల్లవించెడి తలంపు నాకెన్నడు కలుగును? నరహరీ, మీ నగిరి కైంకర్యపరుండనై అంజలి చేసుకొని నమోనారాయణా యను బుద్ధి నాకెన్నడుకలుగును? నరహరీ, మీ దాసుల దాసుండనై యుండెడి చిత్తము గాని, అన్యచిత్తము లేకుండ జేయుమయ్యా. నరహరీ! సింహగిరిపతీ! అకారణసుకృతివై యీ జంతువు నీ కరుణాంబుధి దేలించి మీ దాసులదాసునిగా కరుణజూచి కరుణింపుమయా. సింహగిరి నరహరీ, మీ చరణములకు శరణు, శరణు.

# 11

దేవా! జలచర కీటకము (క్రియం)జరియించిన విధమున నా జన్మ మెరుంగక తిరుగుచునుండగ, నీ మంత్ర రహస్యమను జీవనము దొరుకుట వివేకింపగాను, లోహము పరుసము సోకి కాంచనంబైన విధమున ఏమో మీ భావమెరుంగలేను. అవియె నాకు మీ గుణాంబుధి గొనియాడ గోచరం బైనది. చాతుర్లక్ష గ్రంథసంకీర్తన నుతియింపగనది యతిరామానుజ ముని.........అనాదిపతీ, శ్రీ కృష్ణకువ్వారు. స్వామీ. సింహగిరి నరహరీ!

# 12

నరహరీ! మీ నామసంకీర్తన చేయుచుండగాను మెవ్వరు రామనేమి [illegible] అది ధర్మముగాదని హాస్యంబు చేసిన

యతండు అరువది వేలేండ్లు నరకకూపంబున బడి పిశాచత్వమును బొంది అనేక వికారంబుల బొందు. నరహరీ! మీ నామసంకీర్తన నేర్చి చేసిననేమి, నేరక చేసిననేమి? నారాయణయను శబ్దమాత్రంబు దలంచినయతండే నిజ దాసుండని అనేక స్మృతులు మొరయుచున్నవి. శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ!

# 13

దేవా! గృహాగతులైన ప్రపన్నులంగని వందనము చేయకుండుట, పురుషాకార ధర్మము విడుచుట, ఉపచరింపకుండుట, భగవద్వైభవము గొల్పదుట, గృహాగతులైన మనోరథంబు నష్టిబొందుట, దేహాభిమానము విద్వేషించి యుండెనేని గృహాగతులైన అనాదిపతి, సింహగిరి నరహరీ!

# 14

దేవా! శునకమునకు ఘృతము వోసిన, ఆ శునకము ఘృతపానము చేసి అదియింపుగాక మదియించినట్టువలె సధర్ములే మెరుంగుదురు? చిత్త ధర్మస్వరూపులైన ధర్మలెరుంగుదురు గాక! అధర్ములే మెరుంగుదురు? ఇది పరతత్వంబని సింహగిరి నరహరి నామమెరింగిజరుగును.........గుదురు గాక! అజ్ఞానులెరుంగుదురే, దేవా!

# 15

దేవా! ఆచార్య పరమ భాగవతప్రపన్నులైన వారి ఇతర దేవతాంత రంబులంచగిన నరుండు దూషకనిందితుడైన కుమతికి స్వర్గతిలేదు. అది యెట్లనినవినుడు—తొల్లి భగవానుడు ద్వారపాలకులై జనియించియున్న జయవిజయాదులు స్వామి చిత్తమునకు యెడమై అసురజన్మబెత్తెంచి శిశు పాల దంతవక్త్రులై, హిరణ్యాక్ష హిరణ్యకశిపులై, రావణకుంభకర్ణాదులై సమసిపోయిన విధమెరుదురుగాన, సంభాషణ సేయవలదు. చేసినారేని వారున్ను హ.........బొందుదురు. అనుదినమును అగ్నిపైని ఆజ్యము

చల్లిన అనలంబారునే? అధికంబౌగాక! వెనుతగిలి అవివేకిని ఉపాధులను బోధించిన మదిగొన........దుండాగాక రాజజ్వరమునను శ్రీ గంధము పూసిన అప్పుడే మానునా? దరిగొని కాలుగాక. చెట్టిశ్వానికి శ్రీరంగేశ్వరు జూపిన దీవించనేర్చునపలమున నిర్భాగ్యుడౌగాక........యేరిగతి. అనాది పతీ! సింహగిరి నరహరీ!

# 16

దేవా! తిరుమణి తిరుచూర్ణంబులు లేని యావిప్రుండు ఉండుండు గాదా! లోకము........లెవ్వదు. మీ........గని విప్రుండె ఉండుమహాపాపి కుండని వేదంబులు చెప్పుటగా విని భుజముల మీముద్రిలు, ఒలాడము తిరుమణి తిరుచూర్ణములై ని........గ్యుండుగాదు. ఇది మెరిగి మెరుంగ కుండుట మిమ్మెరుంగకుండుట. ఇది సిద్ధాంతము. అది శాస్త్ర సమ్మతము. పరమజ్ఞానము. మా రామా........నికి సమ్మతము. శ్రీకృష్ణ సమ్మతి స్వామీ, సింహగిరి నరహరీ! మీ దివ్యనామ సంకీర్తనము సమ్మతము.

# 17

దేవా! పూర్వజన్మ పురాకృత ఫలము జంతురాసులయందు లక్షలయందు విరించికైనం గడుపరాదు. కర్మఫలంబనుభవింపకపోరాదు. ఒతోగుణంబున ఋషిహోమ్రండంబు స్తుతియింపుచునుండి లోకమాతయైన పార్వతింజూచి మోహించి తస్థలితుండైన అరిని శివుడాగ్రహించక రక్షించండే? అనాదిపతి, సింహాగిరి నరహరీ!

# 18

దేవా! దశరథరాజనందనుండవై జనియించి మహత్వంబు వహించి పరబ్రహ్మస్వరూపుండవుగా నేరవైతివి. దేవా, నీవు అయోధ్యాపట్టణంబును సహోదరులకు నీ జననీజనకులు చేసిన దోషంబు నీకు అనుభవింప గారణ మని శత్రువులను జంపెనని కారణములు లేవు. దేవా మధ్యరంగంబున

తల్లిదండ్రాదులు చేసిన దోషంబు నీకు అనుభవింపగారణమని అరణ్యానకు చేగితివి. దేవా, నీకు యెవ్వరు తల్లి? యెవ్వరు తండ్రి? నీవు జగద్భరి చుంచవు. నీవు మహాత్మ్యంబవని నీకు మ్రొక్కిన దోషంబు, నీవు నరుని కడుపున జనియించి జగత్తులు గావని వహించనేరవైతివి. దేవా! కరుణా నిధివి. అనాదిపతివి. శ్రీకృష్ణమువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ!

# 19

దేవా! పర్ణశాలల వసించినాడవు. నీకేల అరణ్యానకేగ? నీకేల ఉప వాసములుంట? నీకేల నారచీరలు గట్ట? నీకేమి కారణము దేవా! నీకు ఆహారలు కాయలు అన్నంబు భుజియించ నేమికారణము? దేవా! నీవు గత పూర్వంబున చేసిన కర్మంబు వదల్చుకోలేవు నిన్ను నుతియించిన కర్మంబులు పాయునని నరులు నీకు మ్రొక్కెదరు గదవయ్యా! నీ కర్మంబులు నీవు వదల్చుకోలేవు గాక, నీవు మానవుని యంటం బుట్టి యెరుంగవు గాక! మీ దాసులు వ్యాసపరాశర పుండరీకాంబరీష శుక శౌనక బ్రహ్మాదులు మీదాసులు నీకు మ్రొక్కెదరు. నీవుచేసిన ద్రోహంబు తెలుసుకుదురు. వీరికి భయస్థుండవై యుండుదువు గాన, దేవా! పరమరహస్యంబున నేను నితయించినాడను. నన్ను గావవే! శ్రీకృష్ణమువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ!

# 20

దేవా! నీవు అశ్వమేధ యాగాధికారుండవై యాగము చేసితివే. దేవా, నీ కర్మంబులు చూడనె దోషంబు ధర్మకర్మములు పాలించవైతివి. అధర్మివి నీవు. సుకృతా ధర్మంబులు లేవుకదా! నీ వలను. నీవు నరుని కడుపునంబుట్టిన జ్ఞానముచెప్పెగాక! నీకు శిరశానపెల్పులు. నీకుటమి కారణ మున వారధి గట్టితివవు. నీవు విష్ణుమాయ ప్రపంచకముచేసి పదినేడు సముద్రంబు లేకమైయున్ననాడు ఏకస్వరూపంబున నుండవా, నీవు రఘుకులో ద్భవుండవై అంబుధి యెరుంగవు గాక! ఆదినారాయణ మహత్వంబు

దహించినపుడె నీకు యెదురెవ్వరె, దేవా। నీవు మనుష్యుని కడుపుసంబుట్టి నీ సత్యంబు నీ వెరుంగవు గాక। నీవు అయోధ్యలోనుండి ఒక బాణము సంధించిన రావణాసురు సంహరించి, వాని మీ శ్రీపాదములకు మ్రొక్కినంతనే వాడు చేసిన దోషంబులెల్ల విరుగడాయ వాడు ముక్తిం బొందెడా। వాని దేహతేజంబు జూచి లక్ష్మణుబిలిచి సీతామహాదేవిని ప్రమాణము పలికించుకొమ్మని యాడితిరి. ఆలాగె లక్ష్మణుండు సీతామహాదేవిని ప్రమాణంబు పలికించిరి. ఆ మహాత్మురాలు అన్యథా యెరుంగదు గనుక ప్రమాణంబు గెలిచెను. ఆ ప్రమాణంబు గెల్చిన దోషంబు నీకు యెన్ని యుగంబులం దొలంగునే, దేవా। చాతుర్లక్ష గ్రంథసంకీర్తనము వలన దశావతారుండవై చేసిన దోషంబులెల్ల బాసెను. నీవు రఘునాథుండవై చేసిన దోషములెల్లంబాసెను. నా వలన నీకు ముక్తి కలిగెను. నీ వలన నాకు ముక్తి కలిగెను. నీవు దశావతారుండవు. నేను పదునొకండవ యవతారుండను. నీవు నరమృగమవు। నేను నరకేసరిని। నీవలన నాకు కైవల్యంబవుట. అనాది పూర్వకృతఫలమేగదా। శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ।

## 21

దేవా। ఏమని నుతియింతు మిమ్ము? కులపర్వతము లేడుదీవులతో ధరయెత్తిన మీరు గోవర్ధగిరి నెత్తితిరని యేమని నుతియింతు? కాల సంహారుండవై, జగత్తు లయంబుజేసి మీరు కంస కాళింగమర్దన నరకాసురుండాదిగా గల రాక్షసుల హతంబు చేసితివని యేమని నుతియింతు? సప్తసాగరములు మీ రోమకూపముల సరిలేవు. నీవు జలధి నింకించితివని యేమని నుతియింతు? మీ సతికరుణాలేశమున సకలదేవతలు రాజ్యవిభవ సంపన్నులైనారు. బలినడిగితిరని యేమని నుతియింతు? మీ దాసులో జన్మ మరణాదిభయరహితులైనారు. మీరు దశావతారమున తిరువ నవధరించితిరిగాన యేమని నుతియింతు? శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ।

## 22

దేవా। అకారణ కృపాకృతివై రక్షింతువు గావున దేవా। జపతప [illegible] మొదలైన వేద [illegible] అశ్వమేధంబులు మొదలైన యాగంబులు

షోడశమహాదానంబులు గంగానదీస్నానంబులు పితృదేవతా తర్పణంబులు ఇవి యిన్నియున్ని మీ దివ్యనామసంకీర్తన ఘాతాంతర్యామిగాన శిరిసుజన్మ కర్మంబు శ్రీ కృష్ణ కువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ!

# 23

దేవా, భాగవతులసేవ, ఆచార్యులకైంకర్యము—ఇదియేమరియున్న నరుండు సారమేయ గ్రామసూకరములట : ప్రధారివై యొనరించును, సదాభగవత్సేవా సత్క్రియలొనరించుచుండి మా సింహగిరి నరహరికి .... .................. కతంబడడు.

# 24

దేవా : అభ్యసింపగా రానివి రెండు, సదాచార్యుల కటాక్షంబొ పటిలము, మీ దాసుండై యుండుటొకటియు. అవిగాన అభ్యసింపగా రానివి రెండున్ను. అదిగనుక యెరింగి నడుచుకొనవలయును. శ్రీకృష్ణ కువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ !

# 25

దేవా! పతి తనమీదను కరుణగలండని సతియానందించినట్లే మీ దయావిశేషము నామీద గలదని యానందించి యున్నాడను. ఈ యానందింపు తుదిముట్టించుమీ. నన్ను మీ దాసానుదాసునిగా జేయవే! సింహగిరి నరహరీ!

# 26

దేవా, మీదాసుల యనుగ్రహంబులేక మీదివ్య పదాధికారంబులేదు. మీ దాసుల యనుగ్రహంబు లేక యీ కర్మ సాగరంబు గడపరాదు. సూర్యరశ్మి హస్తంబున ధరియింప వశమా! ఈ లోకంబు మనుజులకును శ్రీకృష్ణకువారు స్వామీ, సింహగిరి నరహరీ! మీదాసులు సర్వమాన్యులౌట గాన నే నెరింగితిని దేవా.

# 27

దేవా! భిన్న ప్రకృతి వికాస జీవుండు అని యెరింగిన కదా హానిబొందకుం డుట. అనాదిపతి సింహగిరి నరహరీ! అయురన్న త్రయ స్వామి[1] యని యెడి శ్రుతివాక్యమెరింగినకదా హానిబొందకుండుట. నరహరి. దయానిధీ ।

# 28

దేవా, అన్యదేవతాభజనంబు దోషంబు. అన్యదేవతానిందయు దోషంబు. అన్నిమతములా నడువంగ దోషంబు. అన్యులదోషంబు లెంచగా దోషంబు. అన్యులనంగా నెవ్వరులేరు. అన్న తనంబున నున్న ఘాతకి జంపిన వెన్నుండగు మా సింహగిరి నరహరి అన్ని చోటులంగలడని తెలియుండి. దేవా!

# 29

దేవా! చతుర్వేద పఠనాది(థి?)ముఖుండైన నేమి? ఆచార్యకృపతో పంచ సంస్కార పరుండైన నేమి? తత్త్వత్రయ రహస్యత్రయ విదుండైన నేమి? శాంతశమదమాది గుణంబులు భావంబందున బొడమంగ వలయును. పరధన పరస్త్రీ పరహింస పరనిందా నివర్తుడును కలిగిరేని మా సింహగిరి నరహరికి యని తలంచవలయునే, దేవా!.

# 30

దేవా! కరతలామలకంబైన మీ కథామృతపానము చేసి కుసత జ్ఞాన మయ్యెడినో కదా ఆతమునన్ను గతించెందనొల్లక మనసంతే విస్తారం మీ మాయారూపణం పిరుకొలది తామరవలె జగతియందు. యద్భావం తద్భవతి అనియెడి యుహామందుల వచనములు చదివి హితు మెరుగుల నేను హాదింపగ నేలా! ఆతురజనబాంధవా! సింహగిరినరహరీ ।

1. అయురన్నం త్రయద్స్వామి?

## 31

దేవా, మనుజుండు పెద్దలైనవారల ఆచార్యుల మేదినీసురుల మాతృపితృ దేవతల హుంకారతిరస్కారంబులు చేసెనేని అనంతకోటికల్పంబులు రౌరవాది నరకంబులందుండి క్రిమికీటకాదులతోటి సంగతిని ఒకటియై యనుభవించును, అది యెట్లనిన చెప్పెద వినుండు. తొల్లి ఇంద్రద్యుమ్నుండను మహారాజు మహాత్ముల తిరస్కరించి కరియోనింబుట్టి కడపటు మహాత్ముని కరస్పర్శనమున ముక్తుడాయెను. అది మీ రెఱుంగరా, దేహంబు నీచుండైన నరుండు నిరంతరము శ్రీకృష్ణకువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ।

## 32

దేవా! మీదివ్యమంగళాది చారిత్రంబైన ద్వయతిరుమంత్రము పరమ రహస్యము. ఆచార్యకృపాకటాక్షము దొరికిన మనుజుండు క్రిందజాతి మల సులైననేమి, దుర్జనుండైననేమి. అతండు మీదివ్యపదంబును బొందు. నవంతీవహింసలు చేసి మాంసము బం(ఖం?)డించేటి లోహము, వేదశాస్త్ర పురాణంబులు వ్రాసేటి లోహములున్ను పరుసముసోకిన శుద్ధసువర్ణముగదా అనాదిమూర్తీ, సింహగిరి నరహరీ।

## 33

దేవా, నేను ప్రభాతకాలమున లేచి తిరుమణి తిరుచూర్ణంబులు ధరియించి దండెలును తాళంబులు పూని, పరమభాగవతులున్ను దాసున్ను స్వామికోవెలకుంజని మిమ్ము స్తోత్రము సేయుచుండంగను, ద్రౌపదీమానోద్ధారకా, పాండవపక్షపాతీ, సర్వసహా, మాధవా, గోవర్ధనగిరిధరా, నీవే రక్షింపవలెం జేయుగాదని స్వామి ప్రసన్నవదనుండై అప్పుడిట్లనియె, నీకు చింతవిచారంబేలా? నా నామోచ్చారణంబులు యెవ్వరేని పఠియించిరేని, చాతుర్లక్ష గ్రంథంబైననేమి, సహస్రంబైననేమి, అష్టోత్తరశతంబైననేమి, అంతఃకరణశుద్ధిగాను ప్రభాతమందు లేచి తిరుమణియు తిరుచూర్ణంబులు

ధరియించి యేకనామోచ్చారణంబులు చేసిన అతనికి పుత్రమిత్ర పౌత్రాభి వృద్ధియు, ధనధాన్యసమృద్ధియు, కామితైశ్వర్యంబులిచ్చి అంత్యమున అతనికి నాలోకంబు నిత్తునని శంఖంబుపూరించి పేచేసి(వా) కృతార్థుండనైతినని పరమభాగవతులున్ను, దాసులున్ను తనపురంబునకేగి, శ్రీకృష్ణ కువ్వారు. సింహగిరి నరహరీ:

# 34

దేవా! మీతిరుమణి నాకొక్క-దైవంబు. మీతిరుచూర్ణము నాకొక్క-శృంగారంబు. మీ వనమాలిక నాకొక్క- నవరత్నపుసొమ్ము(లు). ఈ జన్మమున నా కిటవలె జేస్తిరి, ఇంకొక జన్మంబునసైన నన్నుం గృతార్థు నింజేయవే. నన్నురక్షింపవే. శ్రీకృష్ణకువ్వారుస్వామీ. సింహగిరినరహరీ!

# 35

దేవా! మహా ప్రళయకాలమువాడు క్షీరాంబుధిమీద మాయావటపత్ర శయనుండవై లక్ష్మీభూకాంతలతో నన్ను మరచితివో, దేవా! విశంబున సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశి ఈశ్వర సంవత్సరాలు మూటను, నా పుత్ర మిత్రకళత్రాదులు అన్నబాంధవులు అన్నపానాదులులేక క్షుత్పిపాసలు చెరమున్ను ఉన్నారు. గనుక, నే సీదామందను. నీవు నాపతివి, నన్నేల మా యాంధకారదింతేపతివి! ఇహమందు సౌఖ్యభోగముకృపచేసి నన్ను రక్షింపవే. అనాదిపతీ. సింహగిరినరహరీ!

# 36

దేవా! నాలుగువేదములు నవబ్రహ్మలు ఒకకొమ్మట! అందేయు చిటికాశము మీ దివ్య నామసంకీర్తన పరుండును ఒక కొమ్మట! జ్ఞానధరా శరకానకాదులు ఋషులందరును గూ తులాభారము దూచినవాడు సంకీర్తన పరునికి సరితూగవాయెనట! అనేక జన్మజన్మాంతరములనే బుట్టి సంకీర్తన పరుండే కావలయును. శ్రీకృష్ణకువ్వారుస్వామీ. సింహగిరి నరహరీ!

## 37

దేవా, భగవద్భాగవతులకు సమర్పింపక, తానసుభవించక కూర్చిన యర్థము ఇహపర, ఉభయభ్రష్టంబౌను, అది మెచ్చవిన, మధువుగూర్చిన మక్షికరీతియౌను. అటుగాన మా సింహగిరి నరహరికి తళిగలు సమర్పించక తళిగల తచ్ఛేషం తానసుభవించవలెను. శ్రీకృష్ణకువ్వారుస్వామీ, సింహగిరి నరహరీ!

## 38

దేవా, యీ భూలోకంబున మనుజులై దుర్మదాంధులు అన్యాయార్జితంబైన ధనంబులన్ని సకలంబులును యిల్లు చూరగొని మోక్షార్థులంతేయు శేషాచలంబున తిరువేంకటనామంబులు సకలదేవతామూర్తులు రుద్రుండును బ్రహ్మయును స్థావరజంగమంబుల భోగంబులం బొరలక పొందక కలియుగంబునవడి అరగింపులరు పరంజ్యోతి మహామహిమ తృప్తిబొంద శ్రీపురుషోత్తమంబున ప్రథమ తిరుపతివి నానారూపంబున విలిచితివి దేవా, నీవు పుష్పాంజలి యవసరంబున మహామహోత్సవంబువలన ధర్మాధర్మంబులడు చాతుర్లక్షగ్రంథంబున వరాహరూపంబున విలిచితివి. దేవా, నీవు ఉభయ కావేరీ మధ్యంబున వైష్ణవరామానుజ మతమున జాటపట్టై, విభీషణ వరదుండవై, శేషశయనుండవై, దక్షిణాభిముఖుండవై, లక్ష్మీసమేతుండవై భాగవతులగు వైష్ణవులకు ప్రసన్నుండవై, అనంత దివ్య నామతేజుండవై పరంజ్యోతి శక్తిప్రకాశుండవై, అనంతనాముండవై, వైకుంఠంబునం బింగె శ్రీరంగంబున శేషశయనుండవై భూలోకంబున విహరించి నాడవి మా యూచార్యులి విధంబున తెలిపినారవి నమోనారాయణాయని మీ ప్రభావంబు నారదుండు దేవతలకు చెప్పిన వాక్యంబు నాకుంజెప్పినాడవు గాన నాకు సకలంబును మీ మహిమ ఫలనం గానంబడె. ఓం సదా పశ్యంతి సూరయః, యని, యిదృపం తద్వసతి యని మిమ్ముంగనుగొంటి. యతిరాజానుజ మునిదాసారు. అనాదిపతి. సింహగిరినరహరీ!

# 39

దేవా, గార్దభంబునకు ఘంటానినాదంబులున్నె పక్కెన పల్లంబులు పూని దానికనేక తూర్యనాదభక్తిసములతో వచ్చిననేమి? కనుహీనముగా జాతురుగాని ఉత్తమాశ్వంబునకు సరివచ్చునా. దేవా, గార్దభంబు .... .... పల్యములతో స్మశానభూమిలోను పొరలాడజూచుగాని, అశ్వశాలాభ్యంతర మందు కరంబు ఆద్యంత పరిపూర్ణముగా చేసిననేమి? అతియుదుర్గంధంబు నందడి ఘోటారంబు చేసునుగాని, ఇటువలెనె గార్దభజ్ఞాతియైన మనుజుండు సుఖభోగ్యంబెరుగడు అల్పభోగమునకై అనేకఅలమట మొందును, దాని గార్దభస్వరంబు మాన్పరాదు. దేవా, దుర్గంధ హేతువైనకిరి పంకమధ్యం బున పొరలాడం జూచును. గ్రామ సూకరము దెచ్చి దానికి పన్నీటి అభి షేకంబు చేసి, కస్తూరిగంధలేపనంబు పెట్టి యొనెకరచుట వెట్టచేందిచిన వ్యాంపహితంబు చేయుకాని, తనపూర్వస్థితినరక రూపంబున నెప్పుడు బోయి ఉండును. దాని స్వభావత మాన్పరాదు. దేవా! ఉగ్రమదాంధకారుండైన మనుజుండు పదిరివల్ల తనవద్దనున్న సమ్మోహం బెరుగడు. తప్పు నెరగడు. సర్వభోగసాయుజ్యంబులు విసర్జించును. ఆ కర్మములో మెలంగి నప్పుడే లేమివల్ల భ్రమయంబు చెప్పును. ఆ మనుజుండు మత్తగజంబై జని యించును. ఆ మనుష్యప్రకృతి యెరుంగక సూకరంబు మత్తగజంబునకు సరివచ్చునా? దేవా, స్నానంబును పంచభక్ష్యంబులు దెచ్చి ఘటియించిపెట్టి పానుపుమీద శయనింపజేసిన జీవహింస కోరంబుమానునా? దేవా, మధుపు గ్రహించు వాడొకడు, ఔరకుండొకడు, రజకుండొకడు, పూజాండ్రైన దుష్టజంతువుండొకడు, పక్కెరపల్లంబు చేసెడి చర్మవైరి తొలుకడు, వెలి చండాలురిద్దరు, వీరేద్వురున్న వారి సమానం సమకూర్పరాదు. జనులతో అంటముట్టరాని వారైనా గాక మీ నిజదాసుండయిన వారిని దూషించరాదు. జలములన్నియు నొక్కటి, దుగ్ధ........అన్ని కులంబులనొక్కటై వంతో షము నొక్కటె. కలిమిలేములు అవి రెండు కలియుగమున పొంది నీతి, కలిమివలనంగాదా యీ చండాలాదులకు పదవులు కలుగుటు. కులవర్ణాశ్రమ ధర్మంబు కులముగాదందురు, కులహీనులమందురు. కలిమిమహిమ గాదా

చండాలాదులకు పదవులు కలుగుట. యిది నీతిజగతికి జీవహింసకారణంబైన మనుజుండు దానికి ఏకయత్నముగా ఘోషించును. తటుకున లేచును. పరలాకత చేయును. విడుపకున్న పూలిగించం జూచుగాని ఆ భోగస్థితి యెరుంగడు. అజ్ఞానంబైన జంతువు ఆ విధంబువనే తిరుగుచుండును. కామాంధుడై, గర్వితుడై, నిర్వికారియై, మహాత్ముల గుణంబెరుంగక దూషించును. గాన, యతిరాజరామానుజ మునివరందారారు. అనాదిపతి, శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ!

## 40

దేవా! ప్రాకృత జ్ఞానసుదర్శన పాంచజన్యంబులు శాంతశమదమాది గుణంబులు గాంభీర్యమునకు సరవి పల్ల రాదు. వాని స్వభావము మాన్ప రాదు. అటండాడినట్లాడును. వారకాంత దెచ్చి యిల్లాలిగానేలి, దానికి ధార కలుగ యిచ్చి మత్తుండై సంతతి వడసినన్నేమి, కులగోత్రము బంధువర్గం బులు సహోదరులు శోభన క్రతువులకు నిలువరు. ఆ వారకాంత స్వభావం బు మానుపరాదు. తా నటచే నడతలు నడువం జూచును. మరి జనము జూచును. ఉత్తమగుణంబులు దొరకవు. పుణ్యభార్యాంగనకు సరివచ్చునా! దేవా, శస్త్రులు విని రక్తమాంసాదులు. అదిగాదని నిరర్థకపు దైవములు గొంచరింబట్టి లీలావినోదంబులు ఆడించుచు వారికి భయపడి మ్రొక్కుగొల్లువ నెరుంగని నీచగుణంబులవారు నీ మహత్త్వంబెరుంగరు. ఏకోవిష్ణు(ర్) మహద్భూతం బనియెడి సింహాద్రప్పను పూజింప నెరుంగరు. అజ్ఞానులకు సుజ్ఞానము దయచేసి రక్షింపవే! అతుల జనబాంధవా! శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ!

## 41

దేవా, శాంత శమదమాది గుణంబులులేని శ్రీవైష్ణవునికంటె శాంత శమదమాది గుణంబులుగల తిరునామ ధారియె ప్రసన్నుండు. అటుగాన సాత్వికమె ప్రమాణము. శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ! శైలములేని జ్యోతిక్రియను.

## 42

దేవా, సుజ్ఞానమను విత్తు, వివేకమను మొలక సద్వైష్ణవముచే పొదలి సదాచార్యకటాక్షముచే తిరిగెవారి తిరుమంత్రములనెడి పుష్పఫాది ద్వయమనెడి పిందెదిగి అందుల చరమార్థములను తెలుసుకుంటెనయ్యా! శ్రీకృష్ణమవ్వారు స్వామీ, సింహగిరి నరహరీ! మీ కృపను.

## 43

దేవా, అతిమధురం, అనేక మధురం, హరిసంకీర్తన. పుణ్యమోక్ష నారాయణ సింహగిరినాథుపాదకమల చింత తద్గుణాంబ మోక్షసారము. నమో నమో (దయానిధీ! )

# శ్రీ స్వామివారికి భక్తులు జరిపించు ప్రత్యేక సేవలు



| | | | |
|---|---|---|---|
| తలనీలాల మొక్కుబడి | .... | రూ. | 2_50 |
| ప్రత్యేకదర్శనం | .... | ,, | 10_00 |
| సాధారణ దర్శనం | .... | ,, | 2_00 |
| కప్పస్తంభం ఆలింగనము | .... | ,, | 3_00 |
| ,, ,, దంపత్యాలింగనము | .... | ,, | 6_00 |
| కప్పస్తంభమునకు మనిషిని కట్టుటకు | | రూ | 3_00 |
| ,, ,, దంపతులను కట్టుటకు | | ,, | 6_00 |
| ,, ,, పశువులను కట్టుటకు | | ,, | 15_00 |
| ,, ,, పశువు ఖరీదు | | ,, | 25_00 |
| నూనె ధ్వజంపై దీపారాధన, నెయ్యి | | ,, | 0_50 |
| ,, ,, నూనె | | ,, | 0_25 |
| ,, దీపారాధన | | ,, | 0_15 |
| డోలా సేవ | | ,, | 5_00 |
| నూనె అమ్మకం | | ,, | 1_50 |
| అమృతకలశ • | | ,, | 0_25 |
| సన్నిధి దీపారాధన | | ,, | 1_50 |
| ,, అమృత కలశ | | ,, | 1_00 |
| ,, పుష్పమాల సేవ | | | 1_00 |